





# కావ్యాలు

## ప్రభంధములు

## మహాశ్వేత మహగవేషణ -బాణుని కాదంబరి పరిశీలన





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120029321

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మహాశ్వేత
# మహాగవేషణ

బాణుని కాదంబరీ
పరిశీలన


రచయిత్రి :

చిల్లరిగె స్వరాజ్యలక్ష్మి
భా. సా. ప్రవీణ



ప్రచురణ.

Ch. స్వరాజ్యలక్ష్మి
ఇం. నెం. 10-132, ప్లాట్ నెం. 4, ఇందిరానగర్,
టెలిఫోన్ కాలనీ దగ్గర, కొత్తపేట,
హైదరాబాద్ - 500 038.

# విషయ సూచిక



పుట్టినింటి నుంచిగాని అత్తవారింటి నుంచి గాని అర్ధం గాని, అప్యాయతలుగాని, అందుకోలేని, నన్ను జ్ఞానం వచ్చిన దగ్గిర నుంచి, కంటికి రెప్పలా సమస్త సన్నిహిత బంధు వర్గము అందించే ఆప్యాయతల కంటె అతి మిక్కుటంగా తన వాత్సల్యా అమృతాన్ని అనుక్షణం అందిస్తూ ఆనందింపచేస్తూ ఉపలాలిస్తూ ఉపశమనం కల్పిస్తూ సర్వవ్యాపిగా అన్న కృష్ణ పరమాత్మకు సర్వదా సభక్తికంగా ప్రమాణాల నర్పిస్తూ అతని పాదాలను కన్నీరను పన్నీటిచే ప్రక్షాళనం చేసుకుంటూ ఉన్నాను. ఆనంద నందనుడు ఆనంద సంద్రాన్ని అందించి ఆదరిస్తున్నాడు. ఆపర మాత్మకు భక్తి పూర్వక కృతజ్ఞతా సమస్కృతులు.

# అంకితం

నాకు జన్మనిచ్చిన కన్నతండ్రి మహా విజ్ఞాని-జ్ఞాని-భగవద్గీత, రామకథాసుధ, ఆంధ్ర గద్య వాఙ్మయ చరిత్ర, జ్యోతిర్వేదము దీర్ఘతములు చరిత్ర, నక్షత్రములు, చుక్కల సుద్ది ఆంగ్లమున (స్ప్రింక్లర్ ఆఫ్ ది హెవెన్స్) మొదలగు గ్రంథాలలో భూగోళ ఖగోళ సమన్వయం వ్యక్తం చేస్తూ మహామద్భుత విషయాలను వ్యక్తం చేసి ప్రపంచ వైతాళికుల ప్రశంసలందుకున్న కీ॥ శే॥ శ్రీ గొబ్బూరి వేంకట రాఘవరావుగారు, వీరు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారి నేతృత్వంలో వెలువడిన "భారతి" మాస పత్రికలో శర పరంపరగా ఖగోళ విజ్ఞాన వ్యాసములు వ్రాసి జయపురం మహారాజా శ్రీ విక్రమదేవ వర్మ మహారాజుచే జ్యోతిర్విద్యా విశారద బిరుదమును పొందిరి గద్య వాఙ్మయ చరిత్రకు రత్నఖచిత స్వర్ణమయ పతకమును గ్రహించారు.

అట్టి కీ॥ శే॥ పితృపాదులు మా పూజ్య శ్రీ గొబ్బూరి వెంకటానంద రాఘవరావుగారికి, నాకు అక్షర భిక్ష పెట్టి నాచేత పుస్తకము వ్రాయించగల శక్తి నిచ్చారు, ఆయనకు ఈ గ్రంథమనే అక్షర పుష్పాన్ని సభక్తికంగా సాశ్రునయనాలతో సమర్పించుకుంటున్నాను.

Ch. స్వరాజ్యలక్ష్మి

పూజ్యులైన మా పితృపాదులు



శ్రీయుతులు గొబ్బూరి వేంకటానంద రాఘవరావుగారు

బి.ఏ.బి.ఎల్.

జననం : 14-4-1892. నిర్యాణం : 26-10-1958

ఏలూరు. వీరి సెంటినరీ 1992లో జరుగుచున్నది.

# పూజ్యురాలైన మా మాతృమూర్తి



శ్రీ రాఘవరావుగారి సతీమణి

## శ్రీమతి గొబ్బూరు సుభద్రమ్మగారు

'క్షమ యా ధరిత్రి' అన్న నానుడికి తార్కాణమైన తరుణీమణి. అపర అన్నపూర్ణలా స్వపర భేద మెఱుగని మహనీయురాలు. దానశీలి. భర్తకు తగిన భార్యామణి. పరమ త్యాగశీలి. అత్తగారిని అపార ప్రేమతో ఆఖరి వరకు సేవించిన ధన్య చరిత. ఈమె ప్రస్తుతం ద్వితీయ పుత్రుని యింట నున్నారు. ఈమెకు భగవంతుడు దీర్ఘాయురారోగ్యములను గ్రహించుగాక :

# తొలి పలుకు

అసలు నాకు గ్రంథం వ్రాయాలనే సంకల్పం ఎప్పుడూ లేదు.

ఏలూరులో పశ్చిమగోదావరి జిల్లా రచయితల మహాసభలకు నన్ను ఆహ్వానించారు. అప్పుడు "రచయితల బాధ్యతలు" అన్న శీర్షికపై ఉపన్యసించడం జరిగింది. ఆ సభలకు శ్రీ పురిపండా అప్పలస్వామిగారు నన్ను శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారికి పరిచయం చేశారు. అప్పుడు గోపాలరెడ్డిగారు మీరేమైనా పుస్తకాలు వ్రాశారా ? అని ప్రశ్నించారు. లేదు అని అన్నాను.

మా కాలేజీ ప్రిన్సిపాల్, సిస్టరు జోసఫీనా, సిస్టరు ప్లాసిడా నా చేత ప్రతి సంవత్సరం బైబిలు నుండి విషయం వారు సూచిస్తూ నృత్యనాటికలు వ్రాయిస్తూ ఉండేవారు. చాలా వరకు రసవత్తర ఘట్టాలు నాచేత వ్రాయించారనే చెప్పవచ్చు.

సాహిత్య మండలిలో శ్రీ పుల్లాబొట్ల శ్రీరామమూర్తిగారు ప్రతి సాహిత్య సమావేశానికి నన్ను ఆహ్వానించేవారు. నా కవితలు ఏలూరుపుర ప్రజలు సాదరంగా విని నాకునంతో షాహం కలిగిస్తూ ఉండేవారు.

శ్రీ పురిపండా, బి. గోపాలరెడ్డిగారు నన్ను పుస్తకరచన చెయ్యవలసిందిగా ఆదేశించారు.

అది కారణంగా బాణుని విశిష్టత కాదంబరి అన్న అం
శాన్ని తీసుకుని మహాశ్వేతకు ప్రాధాన్యం ఇచ్చి వ్రాశాన.
వర్ణనలు నన్ను ఎక్కువగా అలరించాయి. కథ సంగ్రహంగా
వ్రాసి పాత్రలు, వర్ణనలు విపులంగా విశదీకరించా..

పుస్తకం వ్రాయడం పూర్తిచేసిన కొన్ని సంవత్సరాలకు
పదవీ విరమణ చేశాక మా చిన్న తమ్ముని యింటికి రావలసి
వచ్చింది. మా చిన్నమరదలుగారి ప్రోత్సాహం వల్ల (చి॥ సౌ॥
లీలావతిగారు) పుస్తకము అచ్చువేయించే ఆలోచన వచ్చింది.

నేను వ్రాసిన పుస్తకాన్ని అచ్చువేయుటానికి
వాఙ్మయ మహాధ్యక్ష కళాప్రపూర్ణ డాక్టర్ శ్రీ పుట్టపర్తి
గోపాలకృష్ణయ్య గారు, జ్యోతి క్రియేషన్స్ ప్రింటర్స్
యజమాని శ్రీ ఆంజనేయులుగారితో పరిచయం చేసి పుస్తకం
అచ్చువేయుట ప్రారంభింపచేశారు.

అనాధనైన నాకు నా తండ్రిగారు శ్రీ గొబ్బూరు వెం
కటానంద రాఘవరావుగారు అక్షరభిక్ష పెట్టి అనుగ్రహించబట్టి
నేను ఆజన్మాంతం ఆర్థిక సమస్యలులేక స్వతంత్రంగా జీవ
యాత్ర చేయగల్గుతున్నాను. కనుక సభక్తికంగా కనపడని
ఆయన పాదాలను కన్నీటితో తుడిచి ఈ అక్షర సుమాలచే
తలను పాదాలకు తాకించి పూజించుకుంటున్నాను.

సంతాన రహిత, సౌభాగ్య విహీన అని తలచి నా అనుంగు
సోదరవర్గం అపార ప్రేమాదరాలతో సాదగ మందహాసాలతో

సుమధుర మంజుల భాషణలతో వాడి వడలిన నా హృదయ కమలాన్ని సరమల ప్రేమామృత వృష్టిచే సర్వదా నవనవోన్మేషంగా ఉండునట్లు ఆదరిస్తున్నారు. వారందరికీ నా హృదయపూర్వక అనేకానేక కృతజ్ఞతలు సర్వదా సమర్పిస్తున్నాను.

నా సోదరి శ్రీమతి కె. మీనాక్షి నా యీ వృద్ధాప్యంలో ఈ హైదరాబాద్ నగరంలో ఉండుటకు అవాసాన్నిచ్చింది మామరది శ్రీ కె. సుబ్బారావుగారికి శ్రీమతి మీనాక్షికి నా హృదయపూర్వక అభినందనలు. అత్యంతాభిమానంతో అమృత వర్షం అందిచ్చే సహృదయ సన్మిత్ర వర్గానికి సర్వదా కృతజ్ఞురాలను.

సహృదయింతో తమ సందేశాత్మకమైన ఒక అనుభూతి, విశిష్ట వ్యాఖ్యానం, పీఠిక వ్రాసి ఇచ్చిన శ్రీ భమిడిపాటి రాధకృష్ణమూర్తి గారికి P. సాంబశివరావు గార్కి శ్రీ V. గోపాలకృష్ణయ్యగార్కి. నా కృతజ్ఞతా పూర్వక నమస్కృతులు.

రచయిత్రి

**చిల్లరిగె స్వరాజ్య లక్ష్మి**

# ప్రశంస

శ్రీమతి చిల్లరిగె స్వరాజ్యలక్ష్మిగారితో పరిచయం ఒక
అపూర్వ సంఘటన. సాహిత్యగోష్ఠి ప్రసక్తంగా వారి హృదయం
తెలుసుకునే అవకాశం లభించింది. అన్నిటికన్నా ముంద
మానవత్వానికి ప్రాధాన్యమిచ్చే స్నేహశీలి ఆమె.

ఒక్క విలక్షణమైన వాతావరణంలో జన్మించిన ఆమెక
సాహిత్యపు నినాదాలే మేలుకొలుపు లయాయి. ఆటపాటల
ప్రాయంలోనే గీతాధ్యయనం ప్రారంభమయింది. ప్రాయంతో
పాటు భక్తికూడా పెరగడమేకాక అది వివిధమైన భక్తిమార్గ
లలో మలుపులు తిరిగి చివరికి మధురభక్తి రూపంలో స్థాయి
త్వానికి వచ్చింది. ఆ ప్రాతిపదికతో వారు భాగవత (భక్తి) న
నీత సారాన్ని మధుర భక్తి భావంతో చిరకాలం నుంచీ ఆసా
దిస్తూ వచ్చేరు.

లౌకికమైన దూషణ భూషణ తిరస్కారాల ప్రాబల్యం
వల్ల మనసు కంపించినపుడల్లా కన్నయ్యతో, మానసిక ప్రసం
గాలు చేసి ఆత్మశాంతికి పరిహారమార్గాల్ని కొనుక్కున్న
వేదాంతి ఆమె.

శ్రీమతి స్వరాజ్యలక్ష్మిగారి జీవితంలో సారస్వత
వ్యాసంగం ప్రధానాంశం, వారి రచనల్లో కాదంబరి విషయ
విశ్లేషణ. మహాశ్వేత మహనీయత అనునది ఒకటి. ఆంధ్రీకరణ

ములలో కూడ కవితారీతులకు ఆత్మీయత శైలి ఆత్మశుద్ధి మొదలైన సహజశక్తులు అంతర్వాహినిగా అక్కడక్కడ భావుక హృదయాలకి ప్రత్యక్షమవుతూ వుంటాయనే అంశం సర్వజన విదితమే. ఆ దృష్టితో గనుక యీ గ్రంథాన్ని చూచినట్లయితే శ్రీమతి స్వరాజ్యలక్ష్మిగారి ఆంధ్రీకరణలో, కవయిత్రి జన్మతః పుణికిపుచ్చుకొన్న గద్యశైలీ ఆత్మశుద్ధీ ధారావాహికంగా ఆద్యంతం సమస్థాయిలో నడిచి పాఠక హృదయాల్ని రంజింపచేస్తున్నాయనడం అతిశయోక్తి కాదనీ ఈ గ్రంథాన్ని పఠించినవారు గమనించకపోరు.

ఇటువంటి మరికొన్ని రచనలు ఆంధ్ర పాఠక లోకానికి అందించే అవకాశం భగవంతుడు వారికి ప్రసాదించుగాక !

డా. రాజేశ్వరి, M A ఆనర్స్
Ph. D

# సందేశం

## శ్రీమతి రాజేశ్వరిగారు

'తీరికేలేని విశ్వ సంసారి' ఈమె. ఎన్నెన్నో కార్యక్రమాలు ఉన్నా పాపం తీరిక చేసుకుని ఎంతో విశాల హృదయంతో అవ్యాజానురాగంతో పుస్తకంలో ఏ భాగమూ చదవక అభిప్రాయం వ్రాయమన్న వ్రాసి పంపారు. ఆమె ఒక భాగవత వాహిని, అతి విశాల హృదయ, గృహస్థాశ్రమ ధర్మాలను నిర్వర్తిస్తూ కాలాన్ని సర్వదా సాహితీ రంగంలో పరుగులుతీయించే ప్రయత్నశీలి, స్నేహశీలి, పరోపకార ధురీణ. నాకు అమూల్యమైన అక్షర సందేశాన్ని అందించిన ఆమెకు అనేకానేక ధన్యవాదాలు.

ఇట్లు

**Ch. స్వరాజ్యలక్ష్మి**

ఇప్పుడు "మహాశ్వేత గవేషణ..." మన చేతిలో వుంది. ఇది సంస్కృత 'కాదంబరి' కి పరిశీలన లాంటి అనువాదం.

ఇక్కడ 'కాదంబరి' గురించి నేను ఏ ఒక్క మాట చెప్పినా అది సూర్యుడికి ఒక చిన్న దివ్వెతో చూపించటం అవుతుంది. అయినా చాపల్యంగా ఒకటి రెండు మాటలు చెప్తాను.

"కాదంబరి రసాస్వాదం అహారమపి నరోచతే..." (కాదంబరి రసాస్వాదనం పొందిన వారికి ఏ ఆహారం రుచించదు.) అంతటి రస మంజరి కాదంబరి. అసలు కాదంబరి చదవటానికి "సారి మతెం కవీంద్రులు.... లో నారసి... మేలునాం...." అన్నంతటి వారు కావాలి. అందుకే "బాణోచ్ఛిష్టం జగత్సర్వం" అన్న మన్ననలకు పాత్రమైంది. బాణుడు తన దైవ ప్రౌఢ పోకలతో, పద్యకావ్యంగా కాకుండా గద్య కావ్యంగా కాదంబరి రచన చేశాడు. ఆ గద్య రచన కూడా "గద్యః కవీనాం నికషం వదన్తి" అన్న ఆర్యోక్తికి దీటుగా సాగింది. రసోల్లాసము, సంస్కృత సమాస భూయిష్టమూ అయిన కాదంబరిని సంస్కృతంలోనే చదివి ఆనందించాలి అంటె చదివే ప్రతివాడు మరో బాణుడు కావలసిందె. ఆ అనుభూతిని ఇతరులకు అందించాలంటే.... ఇంకెంతటి ప్రతిభ కావాలి.... అటుపైన సంస్కృతంలోనే మేలు బంతి అయిన ఈ గద్య కావ్యాన్ని తెలుగులో.... తెలుగువారికి అందించాలంటె అనువాదకునికి సంస్కృతం—తెలుగు, రెండింటిలోనూ సమానమైన ప్రతిభ వుండాలి.

'కాదంబరి' అనువాదాలు అనేక భాషలలో చేయబడ్డాయి. తెలుగులో కూడా అనువాదాలున్నాయి. అయితే ఇంతవరకు జరిగిన

అందలి "ఆహారసి నరోచతే" అయిన "రసాస్వాదాన్ని" తాము ఆస్వాదిస్తూ మనందరికి ఆస్వాద యోగ్యం చేశారు.

పండిత గ్రాహ్యమైన సంస్కృతి కాదంబరిని తెలుగు వారి అతి తక్కువ చదువుకున్న వారు సైతం అనుభవించగలిదేటట్లు చేసిన శ్రీమతి స్వరాజ్యలక్ష్మిగారి ప్రయత్నం సఫలీకృత మైందనే చెప్పాలి. వారు ఇలాంటి "వ్యాఖ్యాన" రచనలు ముంధు ముందు అనేకం చేసి తెలుగు వారి హృదయ పీధుల్లో చిరస్మరణీయులు కావాలని, వారికి ఆయురారోగ్య ఐశ్వర్యాలు ఇవ్వాలవి ఆభగవంతుడిని మనసారా ప్రార్థిస్తున్నాను.

ఈ 'గవేషణ' వారి మొదటి ప్రయత్నం కావున మార్గం అనుకున్నంత సుగమం కానందున కొన్ని చిన్న చిన్న లోపాలు, అవీ — అందరికి చెప్పాలన్న ఆతురత వలన—కలిగిమ్యి. అవి —

శ్రీమతి లక్ష్మిగారు సంస్కృత మూలం ఏదో ఒకటి రెండుచోట్ల మాత్రం చెప్పి కథా గమనంలోకి వెళ్ళిపోయారు. ముందరే చెప్పాను— ఇది అనువాదం కాదని—వ్యాఖ్యానమని. అయినా అవసరం అయిన చోట వుదాహరణంగా సంస్కృత మూలాన్ని చెప్పవలసిన అవసరం వుంది. అల్లాగే విషయాలను వర్గీకరణ చేసి చెప్పే సందర్భాలలో బాణుని చరిత్ర వరిజ్ఞానం గురించి చెప్పేటప్పుడు బాణుడు చెప్పిన చారిత్రక విషయాలేమిటో వ్యాఖ్యానంగానైనా చెప్పలేదు.

ఇక మూడవ విషయంగా — పాత్రల పరిచయంటనూ ఆయా పాత్రల శీల చిత్రణలోనూ భావాలు, వ్యాఖ్యానాలు చర్విత చర్వణాలైనాయి.

అనువాదాలన్నీ మూలానుగుణంగ, ఆదే రీతిలో వున్నాయి. కాని ఈ 'మహాశ్వేత మహాగవేషణ' పరిశీలన మాత్రం.... ఒక గవేషణ లాంటిదే.

ఈ గవేషణ సాగించినది శ్రీమతి చిల్లరిగె స్వారాజ్యలక్ష్మిగారు. వీరి గవేషణ అనితర పూర్వము. దీనిని అనువాదం అనే కంటె ఒక వ్యాఖ్య అంటే చాలా బాగుంటుంది. వ్యాఖ్యాతకు కేవలం భాషా పాటవం మాత్రమే కాకుండా, శాస్త్ర పరిజ్ఞాన తదితర గ్రంథ పరిచయం కూడా చాలా అవసరం. శ్రీమతి స్వరాజ్యలక్ష్మిగారి "మహాశ్వేత గవేషణ" చదువుతుంటే వారి పాండిత్య ప్రకర్ష ద్యోతకమౌతుంది. శ్రీమతి స్వరాజ్య లక్ష్మిగారి బహుముఖ విషయ పరిజ్ఞానం ఇందులో అద్దంపట్టినట్లుగావుంది. నిజమైన "వ్యాఖ్య" కీ పుస్తకం ఒక వుదాహరణ.

కథను సంగ్రహంగా చెప్పి, కథలోని పాత్రల పరిచయం చేస్తూనే ఆ పాత్రల శీలమును వ్యాఖ్యానించారు రచయిత. ఆ పాత్రల శీల వ్యాఖ్యానముతోబాటు అయా పాత్రల వల్ల కలిగిన రసస్ఫూర్తికతను బహు చక్కగా వెల్లడించారు.

బాణునియొక్క బహుముఖ ప్రజ్ఞాపాటవాలకు వర్గీకరించి తెలియజేశారు. అతని చారిత్రక పరిశీలన, భౌగోళిక శాస్త్ర పరిచయం, ఖగోళ శాస్త్ర మందలి అపారశేముషి మొదలైన విషయాలను శ్రీమతి లక్ష్మిగారు వర్గీకరించి తెలియజెప్పారు. అలా వ్యాఖ్యానిస్తూనే ఆయా విషయాలలో తమకున్న పాండిత్యాన్ని కూడా ప్రదర్శించారు. ఇల్లా అనువాదాన్ని అనువాదంగా కాకుండా ఒక వ్యాఖ్యానంగా అనుమతిస్తూనే

మరి రచనల్లో ఇల్లాంటి స్వల్ప లోపాలను సవరించుకుంటె.... వీరిరచనలు పదికాలాలపాటు నిలవగలవనటంలో సందేహం లేదు.

“పుశ్రైర్యశోలభ్యతే....”

ఇంకా ఇంకా ఇల్లాంటి రచనలు చెయ్యాలని ఆశిస్తూ....


భమిడిపాటి కృష్ణమూర్తి
15-1-1990

5/1 కృపా కాంప్లెక్స్,
నేరేడ్ మెట్ట,
రామకృష్ణాపురం పోస్టు,
సికిందరాబాదు-500 556.

# ఒ క మా ట

సాహిత్యం ఒక మహార్ణవం. ఆ సముద్రంలో అనంత జలరాసి, అట్టడుగున ఎనలేని ముత్యాలు. ఆ ముత్యాలు ఏరాలంటే జలరాశిలో మునకలు వేయాలి. ఒక పుస్తకం చదివితే ఒక మునక వేసినట్లన్నమాట. ఒక భాషలో సాహిత్యంలో గాఢ పరిచయం సంపాదించాలంటే, ఒక జీవితకాలం చాలదు. ఇక రెండు మూడు భాషలు తెలుసుకోవాలంటే చెప్పాలా? కాని పూర్వజన్మ సుకృత పరంపరలను వెంటబెట్టుకుని జన్మించిన శ్రీ స్వరాజ్యలక్ష్మి వంటివారు భాషలను సునాయాసంగా నేర్చుకోగలరు. ఆమె సరళ హృదయులు, మృదుభాషిణులు, సత్య ప్రియులు. కాలం కలసిరాక పొగరుబోతు గుఱ్ఱంలా ఎదురు తిరిగితే దానికి భగవన్నామమనే కళ్ళెము వేసి బిగపట్టి నిలబెట్టి సన్మార్గంలోకి మళ్ళించుకోగల సమర్థురాలు.

సత్సంగత్వే నిస్సంగత్వం
నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చల తత్వం
నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః (భజగోవిందం)

అనే కోవకు చెందినది. ఆధ్యాత్మిక మూర్తి, నా పరిచయస్థులు, నా సన్నిహితులు, ఏదైనా మహత్కార్యం చేస్తే అది నేనే చేసినట్లు గర్విస్తాను, ఆనందిస్తాను. అనంతమైన తృప్తిని అనుభవిస్తాను. శ్రీమతి స్వరాజ్యలక్ష్మిగారు సంస్కృత కాదంబరి కావ్యాన్ని వివిధ కోణాలతో విశ్లేషించారు. మహాశ్వేతకూ వర్ణనలకూ ప్రాధాన్యం ఇచ్చారు. ఆమెను మనఃస్ఫూర్తిగా అభినందిస్తున్నాను.

చదవడం అనేది మనో ప్రాంగణంలో చుక్కలు పెట్టడం వంటిది. దానిని తెలుగువారికి అందివ్వాలనే కోరిక కలగడం ముగ్గు తీగలుతీసి చుక్కలు కలుపడం వంటిది. దానిని అచ్చొత్తించి, వెలుగులోకి తేవడం అంటే అందులో పూలూ, పసుపు కుంకుమలతో అలంకరించిన గొబ్బెమ్మలను ముగ్గులలో సింగారించినట్లు శ్రీమతి స్వరాజ్యలక్ష్మిగారు ఈ బృహత్ గ్రంథాన్ని వెలువరించి సాహితీ ప్రాంగణానికి సంక్రాంతి అలంకరణ చేశారు.

మాతృభాష చదవడం మంచినీళ్ళు త్రాగడం వంటిది. దేవభాష చదువలేకపోవడం దురదృష్టకరం. అటువంటివారికీ ఈ గ్రంథరచన వరం వంటిది. సాహితీప్రియు లందరూ ఆ తోటలోకి ప్రవేశించి, భాష భావమూ కల్పనా కథాస్ఫూర్తి అనే పంచరంగుల పూలనుదులలో మళ్ళీ మళ్ళీ తిరిగి ఆ పరిమళాల వేగాలలో తమ తమ ఆత్మల నుద్దీపన చేసుకుని ఆనందింతురు గాక! ఒక మహోత్కృష్టమైన కావ్యాన్ని రచించి ఇలాంటి ఆనందాన్ని పంచిపెట్టిన శ్రీమతి స్వరాజ్యలక్ష్మిగారు ధన్యులు.

క్రొత్తఢిల్లి
19-12-89

ఇట్లు
బి. జ్ఞానప్రసూన

# స్నేహశీలి

ఒక మంచి స్నేహితురాలుగా శ్రీమతి టి. జ్ఞాన ప్రసూనాంబగారు ఒక మాట వ్రాసి నన్ను ప్రశంసించారు.

ఈమె జగమెరిగిన సాహితీ సామ్రాట్ అనదగిన శ్రీ రావూరు వెంకట సత్యనారాయణగారి పుత్రికా రత్నం. ఈమె హృదయం అవ్యాజ ప్రేమామృత సాగరం. నిగర్వి నిండుకుండ, అతిధులను అపర అన్నపూర్ణలా ఆదరించి ప్రేమించగల విశాల హృదయ ఆ నిష్ఠా నిధిగేహసీమ నడురేయి అలించినన్-నాస్తి శాక బహుతాష్ణ వాస్త్యోదన సౌష్ఠవంచ కృపయా భోక్తవ్యమ్। అన్నట్లె ఉంటుంది వారి గృహసీమ. అడిగిన తక్షణం తమ అమూల్య అభిప్రాయాన్ని అందించినందుకు వారికి అనేకానేక కృతజ్ఞతల నందిస్తున్నాను.

Ch. స్వరాజ్య లక్ష్మి

# విశిష్ట వ్యాఖ్యానం

శ్రీమతి స్వరాజ్యలక్ష్మిగారు మహాశ్వేత, మహా గవేషణ గ్రంథం వ్రాసారు. ఇది కాదంబరి పరిశీలన. ఇందులో బాణుని విశిష్టత, కాదంబరి పాత్ర చిత్రణాదీతులు కాదంబరి కావ్యంలోని వర్ణనలు వివిధ పాత్రల ప్రాముఖ్యత సంభాషణల చాతుర్యం బాణుని ఆధ్యాత్మిక తత్వం కాదంబరి నామ ఔచిత్యం బాణుని కవితా విశిష్టత మున్నగునవి ఈ గ్రంథంలో కనిపిస్తాయి. రచయిత్రి కాదంబరి కావ్యం సమగ్రంగా పరిశీలించి కావ్యంలోని రసమయ సన్నివేశాలకు వారి వ్యాఖ్యానాలు అందించారు. కాదంబరి సంస్కృత కావ్యం సాహిత్యంలోనే ఒక ప్రత్యేక విశిష్టత సంతరించుకుంది. అటువంటి కావ్యాన్ని కూలంకషంగా చర్చించి వివరించడం సామాన్య విషయం కాదు.

శ్రీమతి స్వరాజ్యలక్ష్మి, బహుభాషాకోవిదులు, పండితులు, భాషా ప్రవీణులు. చిరకాలం ఉపాధ్యాయ వృత్తిలో జీవితం గడిపిన పరిశీలకులు ఈ పరిశీలనా గ్రంధం అటు పండితులకూ, ఇటు విద్యార్థులకూ ఎక్కువ ప్రయోజనకరం కాగలదని విశ్వసిస్తున్నాను. రచయిత్రికి నా ప్రశంసలు,

బోతుకూచి సాంబశివరావు
అధ్యక్షులు, అఖిల భారత తెలుగు రచయితల
మహాసభలు

# పీ ఠి క

"కాదంబరీ రసజ్ఞస్య ఆహారోఽపి నరుచ్యతే" అన్న ఆర్యోక్తి అత్యంత ప్రసిద్ధమైనది. ఈసూక్తి ఎంత ప్రసిద్ధమైనదో దీనిలోవున్న అర్థ రహస్యం అంత అప్రసిద్ధమైనది. మహా పండిత కవిగా సమస్త శబ్దార్థాలను "బాణోచ్ఛిష్టం జగత్సర్వం"గా ఆపోశన పట్టి పుక్కిలించిన బాణుడు కాదంబరి శబ్దాన్ని "కల్లు" అనే అర్థంలో సార్థక రాహిత్యమైన పదం తన గ్రంథ నామీకరణంలోనే ప్రయోగించాడని అనేక మంది కవి పండిత విమర్శకులు భావించారు. వాస్తవానికి కల్లు తాగిన వాడికి మనోబుద్ధి వాక్కాయాలు అవశంగా వుంటాయి. ఆహారం రుచించక పోవడమూ వాస్తవమే. అయితే యీ కాదంబరీ నవల చదివిన వాడికి గాని మహా సుగుణ సౌందర్య రాశియైన కాదంబరి సౌందర్య సుగుణా మృతాది రసాస్వాదన చేసిన చంద్రాపీడునుడికి గాని చూపరులకు గాని ఆమె జీవిత కథా స్రవంతీ రసాస్వాదన చేసిన వారికి గాని మనోబుద్ధి వాక్కాయాలు అద్భుతావహంగా వికసిస్తాయే గాని అవశ వ్యవస్థలోకి వెళ్ళవు. ఆహారం రుచించక పోవడం అంటూవుండదు. ఈ పరిస్థితుల్లో "కల్లు" (మద్యం) అనే అర్థంలోనే కాదంబరీ నామాన్ని బాణుడు పెట్టా డనుకోవడం కేవలం పొరపాటు. నామ సార్థకతను నోచుకోని ఈ శబ్దాన్ని మద్యం అనే అర్థంలో నిరర్థకంగానే కాక దురర్థకంగా సైతం బాణుడు ప్రయోగించాడనడం చాలా అసంగతం. వాస్తవానికి కాదంబరి శబ్దానికి సరస్వతీ దేవి అని కూడా అర్థంవున్నది. సరస్వతీ మాతృస్నేహం పొంది వాగమృత రసాస్వాదన చేసేవాడికి ఇతరాలేకాక ఆహారం కూడా రుచించక పోవడంలో విశేషం లేదు. ఇక్కడ కాదంబరి శబ్దం చేత

మండూక బ్రాహ్మి అనబడిన సువర్చలాలతయైన సరస్వతీ లత కూడా నిర్దిష్టమైనది. సరస్వతీ లతలు ఆకుల రసాన్ని చెరకు రసం మొదలైన వాటితో మిశ్రితం చేసి సార్థకంగా సుప్రయోగంగా ఆస్వాదన చేసిన వారికి మనోబుద్ధి వాక్కాయాలు అపూర్వంగా అత్యంతం పరిశుద్ధమవుతాయి అమృతప్రాయమవుతాయి. మనస్సు బుద్ధి అద్భుతంగా వికసించి అభ్యుదయం చెందడమేకాక వాక్శుద్ధి వాక్సిద్ధులు కూడా లభించడంతోపాటు అది అద్భుతావహమైన రసాయనంగా ఉపయోగపడి నిత్యనవ యౌవనంతో శరీరం అమృతప్రాయంగా మారుతుంది. ఈ సరస్వతీ లతా రస రహస్యాలను గ్రహించిన వాడికి ఆహారం కూడా రుచించక పోవడంలో ఆశ్చర్యకరమైన విషయం లేదు బాణుడు అసాధారణమైన తన విజ్ఞతా ప్రదర్శన చేస్తూ సరస్వతీ దేవిని సరస్వతీ లతను దృష్టిలో పెట్టుకొని సార్థకంగా కాదంబరీ నామాన్ని పెట్టాడే కాని శ్లేషలోనైనా నిరర్థకమూ దురర్థకమూ అయిన కాదంబరీ శబ్దాన్ని మద్య వాచకంగా పెట్టలేదని నిస్సందేహంగా భావించవలసి వచ్చింది

ప్రపంచంలోనే అసాధారణమై అపూర్వమైన మొట్ట మొదటి నవలగా చరిత్రలో స్థానం సంపాదించుకున్నది. సంస్కృత భాషలో అవతరించిన అపార అమేయ భాష భావబంధుర సంస్కృతులకు నిలయమైన ఈకాదంబరి నవలమీద అనేకమంది పరిశోధనలు చేశారు. అయితే తెలుగు వారిలో తెలుగు సంస్కృత పండితులు కాదంబరి అధ్యయనపరులు వేలాదిగావున్న. ఈ కాదంబరి మీద పరిశోధన చేసి రచన చేసిన వారు లేరనే చెప్పవచ్చు. లొగడ విద్వాన్ విశ్వంగారు మాత్రం తెలుగులోకి కథా రూపంగా అనువాదం చేశారు. అయితే ఈ అనువాదం సర్వతోముఖమైన బాణుని ప్రతిభకు శబ్దార్థాది వివిధ శ్లేషలకు ప్రతిబింబంగా అవతరించిందని చెప్పడానికి అవకాశం లేదు. ప్రస్తుత

గ్రంథం బాణుని కాదంబరి మీద అసాధారణమైన అధ్యయన తత్పర
తతో శ్రీమతి చిల్లరిగె స్వరాజ్యలక్ష్మిగారు అలవోకగా రచించిన పరిశీలనా
గ్రంథం. ఈ పరిశీలనా గ్రంథంలో వివిధ పాత్రల విశేషాలను
అపూర్వంగావున్న వర్ణనలను సూక్ష్మాతి సూక్ష్మంగా విశ్లేషించారు.
శ్రీమతి స్వరాజ్యలక్ష్మిగారు భాషాప్రవీణ చదివే రోజుల్లోనే అంటే
1945, 1950 మధ్య సంవత్సరాలలోనే కాదంబరిని ఆమూలాగ్రం
పఠించారు. మహాశ్వేతకున్న సంపూర్ణ సౌందర్య భౌతిక రూపంకాని
తపోయోగ నిష్ఠాపరమైన లౌకిక శారీరక వ్యవస్థా ప్రక్రియలుగాని
శ్రీమతి స్వరాజ్యలక్ష్మిలో లేకపోవచ్చును, కాని ఆమె సంసారిక జీవన
వ్యవస్థను అంతర్ముఖమైన ఆత్మ సంశుద్ధ సౌందర్య వ్యవస్థను అత్యంత
సన్నిహితంగా ఆమె మానసిక దత్తపుత్రుడుగావున్న నాకు అనుభవంలో
శ్రీమతి స్వరాజ్యలక్ష్మిగారు ఒక మహాశ్వేతగా కనిపిస్తారు. నేను
వయస్సులో చిన్నవాడినైనా శ్రీమతి స్వరాజ్యలక్ష్మిగారికి వ్యాకరణ
ఛందో గ్రంథాలు భాషాప్రవీణలో పాఠం చెప్పానన్న తృప్తి నాకున్నా
ఆమె నన్ను ఒకపుత్రుడుగా భావించిన భావన కంటే నాకున్న అమాతృ
భావన కంటే గొప్పది కాదు. శ్రీమతి స్వరాజ్యలక్ష్మిగారు ఏలూరు
సెంట్ థెరిసాస్ గరల్సు హైస్కూలులో సీనియర్ తెలుగు పండితురాలు
గా పనిచేసి విశ్రాంతి తీసుకున్నా ఆమె జీవితాన్ని ఒక మహాశ్వేతగానే
గడుపుతున్నారు. బాణుని మహాశ్వేతకు కాదంబరి ఒక్కతేకాని శ్రీమతి
స్వరాజ్యలక్ష్మి గారికి ఆమె జీవిత యాత్రలో ముగ్గురు సోదరీమణులే
కాదు అనేకమంది కాందబరీ వాచ్యలు వున్నారు. కాగా శ్రీమతి
స్వరాజ్యలక్ష్మిగారు యీ బాణుని కాదంబరీ పరిశీలనా గ్రంథానికి
"మహాశ్వేత మహా గవేషణ" అని పేరుపెట్టడం అత్యంత సముచితంగా
వున్నది. శ్రీమతి స్వరాజ్యలక్ష్మి తండ్రిగారు సుప్రసిద్ధ ఖగోళ పరిశోధక
రచయితలయిన శ్రీగొబ్బూరు వేంకటానంద రాఘవరావుగారు, తండ్రిగారి

ఖగోళ పరిశోధనా విషయాలు శ్రీమతి స్వరాజ్యలక్ష్మిగారి రచనలో ఈ మహాశ్వేత మహాగవేషణలో ప్రతిబింబింప చేశారు. ఇవి బాణుడు వివిధ సందర్భాలలో ఉటంకించిన ఖగోళ విషయాలను దృష్టిలో పెట్టుకుని బాణుని అచుంబిత విషయాలను కూడా మానసనామ వర్ణావి విశేషాలతో విపరించడం జరిగింది గ్రంథ ముద్రణలో అనేకమైన ముద్రారాక్షసాలు దొర్లినా పాఠకులు ఈ గ్రంథంలోని అశేష విశేషాలను గుర్తించి ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

ఇట్లు

వాఙ్మయ మహాధ్యక్ష

డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య

కళా-ప్రపూర్ణ

2-2-1118/A,

న్యూ నల్లకుంట,

హైదరాబాదు-44.



# మహాశ్వేత
# మహాగవేషణ

("కాదంబరి" పరిశీలన)



# మహాశ్వేత
# మహాగవేషణ

## 1వ ప్రకరణము

## భట్టబాణుడు

సంస్కృత సాహితీ సంద్రమ్ము నందున
ప్రవిమలమణి వీవు బాణభట్ట!
గణనీయమైనట్టి కాంచన మధ్యాన
వజ్రద్వయం బట్లు వరలె కృతులు
అచ్చమైయలరారు నాకాశరంగాన
ధ్రువుని వోలె నుండు దృఢముగాను
కమనీయమైనట్టి కాదంబరియు మరి
వరధ్రువ తారగా వరలుచుండె
అమర గీర్వాణవాణికి అతులితముగ
రత్నమయహారతతు లీవు రాణ మీర
నవ్య కాంతుల నీనెడి నాణ్యమైన
కాంచనాభరణాదులు కంఠమందు
వాణి కర్పించి నిలచితి వసుధయందు॥

పద్య కవితకంటె గద్య రచించుట
ఘనతరంబని యెంచు ఘనుఁడ వీవు
కథలు చెప్పుటయందుఁ గమనీయ ఫణితిని
చక్కఁగా చూపిన చతురమతివి
కాంచనవర్ణమౌ కన్య కాదంబరి
నలలవోలె నలంకరించి తీవు
ఉపమాన ముత్ప్రేక్ష లూహ కందని రీతి
కుప్పతిప్పలుగ కురిపించినావు
వీసమంతైనను వాసి తగ్గని రీతి
వర్ణనల్ వర్ణించి వరలినావు
అత్యద్భుతంబైన ఆ సన్నివేశాలు
కూర్చగల్గితివీవు గుంఫనముగ
నవరసాలంకృత నాట్యరంగమునందు
రాజు పాత్రల నీవు రాణ మీర
అనుపమానంబుగా నతిప్రాభవమ్ముతో
ఆ పాత్రలందున అలరి తీవు
భారతావనిలోన భట్టబాణుండుగాఁ
బ్రాదుర్భవించిన ప్రభుఁడవయ్య!
తరువాతి కవులంత తల వంచి నీ చెంత
మెసవిరి ఉచ్ఛిష్ఠ మెతుకు లెన్నొ
హర్షున కెంతయో హర్షమ్ము గూర్చిన
అతని చరిత వ్రాసి అలరి తీవు
కవిరాజుగా నీవు ఖ్యాతి నార్జించితి

అంచ వెలఁది నిన్ను నాదరింప
భారతావని ప్రజలంత భక్తితోడ
కవివరేణ్యుఁడ వంచును ఘనత మీర
రాజ కవిరాజు వీ పంచు రహిని నెపుడు
వందన శతాల నర్పింప వరలితయ్య

## బాణుని విశిష్టత

సంస్కృతసాహిత్యమనే ఆకాశంలో కెంపుల్లా మెరిసే చక్కని చుక్కల్లా నేటికీ, ప్రకాశిస్తున్నాయి ఇతని కాదంబరీ హర్షచరిత్రలు.

ఇతని రచనావైచిత్రిని ఉగ్గడిస్తూ "బాణవేగంబును" అన్నాడు భట్టుమూర్తి తన నరస భూపాలీయంలో.

మనుచరిత్రకారుడు, అల్లసాని పెద్దన్న ఆ కావ్యంలో ఇలా వ్రాసాడు.

మ॥ వనజాక్షోపమ వాములూరు తనయున్ ద్వైపాయనున్ భట్టబా
ణుని భాసున్ భవభూతి భారవి సుబంధున్ బిల్హణున్ గాళిదా
సుని మాఘున్ శివభద్రు,మల్హణకవిన్,చోరున్, మురారిన్ సుఁనూ
రుని సౌమిల్లిని దండి ప్రస్తుతుల పేర్కొందున్ వచశ్శుద్ధికిన్ ॥

ఇందు వాల్మీకి వ్యాసుల తరువాత మన బాణుణ్ణే పేర్కొనడంలో అతడు కవికి ఎంత ఉన్నతస్థానం ఇచ్చి గౌరవించాడో, అని మనకి చాలా ఆనందం అనిపిస్తుంది. అంతేకాదు, కవితారాజ్యంలో, ఇతడు తృతీయస్థానాన్ని అందుకున్నాడంటే, అది సామాన్యవిషయంకాదుకదః

హర్షుని ఆస్థానకవిగా బాణుడు బాగా శోభించాడు.

హర్షచరిత్ర వ్రాసి, ఇతడు పాఠకలోకానికి ఎంతో హర్షాన్నివ్వగలిగాడు.

బాణునికిముందు అసలు చరిత్రలు రాసినవాళ్లున్నట్లు కనపడదు.

సంస్కృతంలో, కాదంబరి "నానారసోల్లాసభాసురమూ" "సురుచిరభావోదయ విలాస మనోహరమూ, నానాలంకార శోభితమూ" అయిన, హృద్యం అయిన గద్యకావ్యం అన్నారు రెంటాలవారు.

"బాణోచ్ఛిష్ఠం జగత్సర్వం అని, బాణోచ్ఛిష్టమిదం జగత్, అని బాణోచ్ఛిష్టం జగత్రియమ్" అని పలువిధాలుగా బహుముఖప్రజ్ఞావంతులైన పండితులూ విజ్ఞులూ ఇతణ్ణిగూర్చి రమణీయంగా వర్ణించారు,

సంస్కృత వాఙ్మయంలో, ఇంత విశిష్టత ఏ కవీ సంపాదించలేదని నిస్సందేహంగా మనం చెప్పవచ్చు.

ప్రపంచంలో ప్రాణికోట్ల అనుబంధాలను అన్ని కోణాలలోంచి సూక్ష్మదృష్టితో ఇతడు పరీక్షించాడు. ఆయా అనుభూతుల్ని బాగా మననం చేసుకున్నాడు. అతి సమర్థవంతంగా ఆయా భావాలకి ప్రాణం పోసేశాడు.

గ్రంథపఠన చేస్తూఉంటే అప్రయత్నంగానే పఠితల హృదయాల్లో ఆయా పాత్రలు చోటు చేసుకుని నిలబడతాయి. అలారాయడం కవిప్రతిభకు తార్కాణం.

పఠన చేస్తున్నంతసేపూ నిలవడం కంటె ఆ తరువాతకూడా నిలబడేటట్లు రచించడం దానికి పైమెట్టు.

అంతేగాకుండా ఆయా పాత్రల సుఖదుఃఖాల అనుభూతుల్ని పాఠకుడు పొందగలిగేటట్లు రాయడం అంతకంటె పైస్థాయి.

పాఠకుడు ఆమరణాంతం మరువలేనంత పటిష్టంగా పాత్రపోషణ చేయగల్గడం మహాకవి మన బాణుడికే సాధ్యం అయింది.

అతని అవధులులేని అనురాగాన్ని అందుకోలేక పోయానని కుమిలి కుమిలి కుదిళ్ళిపోతుంది మహాశ్వేత. ఆబాధ అనుభవించక తప్పలేదు. అన్నీ విడిచి విరాగిగా పుండరీకుణ్ణి తలుస్తూ ఎలాగో పొద్దులు వెళ్ళదీస్తూ ఉంటుంది.

ఎంతటి కఠినుడైనా ఆ పాత్రని చదువుతూ ఉంటే అలా నీరు కారి తీరుతాడు. తారాపీడు డనే రాజు, అతని భార్య విలాసవతి. శుకనాశుడనే మంత్రి; అతనిభార్య మనోరమ.

కాదంబరీ చంద్రాపీడుల వృత్తాంతం అత్యద్భుతంగా అదివరకెన్నడూ కనీవినీ ఎరుగని తీరుల్లో సృష్టించి పఠితల కందించాడు బాణుడు.

విలాసవతీ, మనోరమలు, భారత నారీమతల్లులుగా రచించాడు. భారతీయ సంస్కృతి వాళ్ళ ప్రత్యణువులోనూ ప్రస్ఫుటితంగా కనిపిస్తుంది.

ప్రకృతిని వర్ణించడంలో ఇతడికితడే సాటి. ఎంత వర్ణించినా తనివితీరినట్లు అతడికి కనిపించలేదనే తోస్తుంది.

జాతీయాలు, సూక్తులూ, అలంకారాలూ, అతనికి అలా అలా అప్రయత్నంగా కోకొల్లలు వచ్చిపడిపోతాయి అతని రచనల్లో.

"బాణుడు తన కావ్యాలలో నిక్షేపింపని భావాలు గాని గావింపని కల్పనలుగాని ప్రదర్శింపని ఊహాసమృద్ధిగాని సంస్కృత వాఙ్మయంలో అరుదుగా కన్పిస్తుంది.

నిజమే. అతని తరువాత కవులు అతని భావాలనే ఎంగిలి మెసవినవారే. అందుకే "బాణోచ్ఛిష్టం ఇదం జగత్" అన్నారు.

బాణుడు వాత్స్యాయన వంశంలో పుట్టాడు. అపస్తంభ సూత్రుడు బ్రాహ్మణ కులం ఇతనిది. తాత కుబేరాఖ్యుడు. తండ్రి చిత్రభానుడు తల్లి రాజాదేవి. అత్యంత పవిత్ర చరిత్రాలంకృత. ఇతని తండ్రి వేద శాస్త్ర నిష్ణాతుడు. తాత జగద్విఖ్యాత విద్వాంసుడు. ఆ మహాపండితుడి ఆస్యం నిరంతర వేదపఠన పురోడాశన, భక్షణంచే ప్రపూతమైన దని తెలుస్తోంది.

గుణాఢ్యుని బృహత్కథామంజరిలో కథను ఆధారంగా చేసుకుని ఇతడు కాదంబరి రచించాడు.

ఇంతే కాకుండా హర్షచరిత్ర, చండీ శతకం, మకుట తాడితం అనే గ్రంథాలు కూడా రచించాడు. పార్వతీ పరిణయం అనే గ్రంథాన్ని ఇతడే వ్రాశాడనీ, వ్రాయలేదనీ పండిత లోకంలో విభిన్న అభిప్రాయాలున్నాయి.

మన సాహిత్య చరిత్రలో రామాయణం తప్ప మరే ఇతర కావ్యాలూ అదే పేరుతో తిరిగి తిరిగి రాసినట్లు కనపడదు.

కాని ఈ మహాకవి కాదంబరిని సమగ్రంగా పఠించారు ఆనాటి కవులు, దీని మీద ఆదరంతో కాశ్మీర పండితుడు కాశీనాథకవి, కాదంబరి కథను సంగ్రహంగా, సంక్షిప్త కాదంబరిని వ్రాశాడు. మహావిద్వాంసుడు మణిరామకవి, కాదంబరీ అర్ధకావ్యం అను, పద్య సారాన్ని రచించాడు.

శివరాముడు, వైద్యనాథుడు, బాలకృష్ణుడు, శూరచంద్రుడు, మహాదేవుడు, సుధాకరుడు, ఘనశ్యాముడు మొదలైన వారెందరో మహా కవులు ఇతని కాదంబరిపై హృద్యం అయిన వివిధ వ్యాఖ్యానాలు రచించారు.

తెలుగులో నాకు తెలిసిన వారు ఈ కాదంబరిని వ్రాసిన మహనీయులెవరెవరంటే (1) ముదిగొండ నాగలింగశాస్త్రిగారు, (2) సత్యవోలు కామేశ్వరరావు గారు, (3) కాదంబరీ కథా సారం అనే పేరుతో కె. సుబ్రహ్మణ్య శాస్త్రి గారు, (4) కాదంబరీ కల్యాణం, జంధ్యాల పాపయ్యశాస్త్రి గారు, (5) కాదంబరి పేరుతో రెంటాల గోపాలకృష్ణ మూర్తి గారు, (6) కంభంపాటి రామగోపాలకృష్ణమూర్తి గారు మరియు (7) విద్వాన్ విశ్వం గారు. ఇక నాటకాలుగా యస్. కామేశ్వరరావు, వి. రాజమ్మాళ్ గారు రచించారు.

పీబరు అను ఆంగ్లకవి అతి హృద్యం అయిన వ్యాఖ్య విమర్శ రాసినట్లు తెలియవస్తున్నది. దీన్ని బట్టి కాదంబరి ఉత్కృష్టత ఎంతటిదో రసజ్ఞులే ఊహింపగలరు.

ఈ క్రింద, మన కవిని ఎవరెవరు ఎలా ఎలా స్వభావోక్తులతో స్తుతించి తృప్తి చెందారో చూద్దాం.

జయంతభట్టు- "ప్రకట రసానుగుణ వికటాక్షర చమత్కారిత సకల కవి కులాభరణస్య బాణస్య వాచః"

గంగాదేవి- "వాణీ పాణీ పరామృష్ట వీణా నిర్వాణహారిణీ"

ధర్మదాససూరి- రుచిర స్వర వర్ణ పదా రసాభావ వతీ జగన్మోహరతి, తత్కిం తరుణీ? నహినహి బాణస్య మధురశీలస్య-

చంద్రదేవ కవి- శ్లేష శబ్ద గుంఫ, రసాలంకార సదర్థక కవీంద్ర, వంచానుడూ అని పొగడాడు.

అభినందుడు- వాగీశ్వరుడని, వాక్పతిరాజు అర్ధేశ్వరుడని అన్నారు.

సోడ్డలుడు- వాగర్థ రసాది సర్వేశ్వరుడని నుతించారు.

ఇతని కాదంబరి భాషాతత్వ జిజ్ఞాసుపులకు సద్గురూపదేశమని పలువురు పలువిధాలుగా ప్రశంసించారు.

ఈపై ఉదాహరణల మూలంగా ఇతడు "అమర గీర్వాణ వాణీ వాత్సల్య విశారదు డయ్యాడు.

కవితా సామ్రాజ్యమున, ఈ కవి గద్యకవి సార్వభౌముడయాడు గద్యకవితా, కవిబ్రహ్మ అని బిరుదు నందాడు. చదువుల తల్లికి ముద్దు బిడ్డ-పెద్దకొడుకు.

ధన్యుడవయ్యా బాణభట్టూ ధన్యుడవు

## గద్య వాఙ్మయము

"వాక్యం రసాత్మకం కావ్యమ్" అన్నారు పెద్దలు.

రస విశిష్టంగా ఉన్న ఒక్కవాక్యమైనా సరే దాన్ని కావ్యమనాలి అని పైనానుడిని బట్టి మనకు సువ్యక్తమౌతుంది.

కాని పద్యం రసాత్మకం కావ్యమని లేదు. ప్రప్రథమంగా సంస్కృతంలోనూ, ఆ తరువాత తెలుగులోనూ, పద్య కావ్యాలే ప్రాదుర్భవించాయి. రాగాను గుణ్యమైన శబ్దజాలాన్ని ప్రేమించడం, ఆదరించడం మానవ సహజ లక్షణాలు, ఆ కారణంచేత, పద్య కవితనే కవిత్వంగా గణిస్తూ వచన కవిత్వాన్ని చిన్నచూపు చూస్తూ వచ్చిందనుకోవచ్చు.

విషయం అనే శుద్ధం అయిన బంగారం పుష్కలంగా ఉండాలి. భాష, భావం అనే సుత్తి సేనాం చేతుల్లో ఉంటే ప్రతిభా వ్యుత్పత్తులనే వజ్ర సంపద,కల్పనాశక్తి అనే రమణీయం అయిన లతలూ, (డిజైన్స్)

పుష్టిగా పుంజుకోగలిగితే కవి అనే కంసాలి చెయ్యలేని ఆభరణం ఏముంది! అదే అన్నారు తిక్కన్నగారు.

"కూర్చుట నూత్న రత్నమునకున్ కనకంబునకున్ దగున్",
పద్యం అయినా గద్యం అయినా హృద్యం అయిన హారంగా చేసి వాణిని అలంకరించాలి

సుష్టుగా రససృష్టిచేయగల స్రష్ట కావాలి కవి.
"అపారే కావ్యసంసారే కవిరేక ప్రజాపతిః"

అపారం అయిన కావ్య సంసారానికి కవి మాత్రమే ఏకైక ప్రజాపతి.

అపారం అయిన కావ్యసంసార సామ్రాగ్రిని కవి తన గుప్పిట ఉంచుకో గలగాలి, భావదారిద్ర్యం భాషాదారిద్ర్యం ఉంటే రసహీనమైన కవితా సృష్టిచేసి వాగ్దేవతకే నీరసం ఆపాదించే అప్రాచ్యులు కొందరు

మనంబున నుండెడి యమ్మదుర్గమాయమ్మ"

వీధివాకిలిలో కూడ కాలు పెట్టడానికైనా అర్హత లేదనడం సాహసం కాదు.

కళాజ్ఞాన హీనులై తమ రచనలకు పద్యవేషం ఇవ్వడానికి, పలు విధాల పాట్లుపడి నాల్గు ముక్కలను చేర్చి గణప్రాసాదులతో కొట్టు కొంటూ,

"గురువు లఘువుచేసి కొట్లాడి కొట్లాడి
లఘువు గురువుచేసి లాగి లాగి"

ఛందో విషయాలని పాటించామనుకొని ఏదో ఒక విధంగా తడక లల్లే వేషధారులు ఎన్నటికీ కవులు కాలేరు. "నక్కకు దేవలోక మెక్కడ" అన్నట్లు వేషధారులీ కవితారాజ్యాన్ని సమీపించడానికైనా అర్హులు కారు.

కత్తిపట్టినంత మాత్రాన పిరికిపంద మహాశూరు డవుతాడా? గాను తొడిగిన మేదరి పట్టభద్రు డవుతాడా?

కవితా వస్తువు పుష్కలంగా ఉండాలే గాని పద్యం అయినా గద్యం అయినా సాహిత్యరాజ్యంలో తన అర్హతను పట్టి చోటు చేసుకుంటుంది.

ప్రస్తుత కాలంలో గద్యకు మంచి స్థానం ఉంది. కాని మన భట్టు నాటికి గద్యని సంఘం చాలా చిన్నచూపే చూసేది.

దండిమాత్రం సంఘానికి ఎదురీది దశకుమార చరిత్ర సంస్కృతంలో గద్యరూపంలోనే రచించాడు. కాని మన భట్టు కాదంబరిముందు అది దివిటీ ముందు దీపంలా వెలవెల పోతుంది దానిముందు ఇది ఎంతో తక్కువ స్థాయి అని చెప్పక తప్పదు.

"గద్యః కవీనాం నికషం వదన్తి"

అన్నారు విజ్ఞులు. కవిగత ప్రతిభకి గద్యరచన ఒక చక్కని గీటురాయి.

కవి తన భావావేశాన్ని తృప్తికరంగా వ్యక్తంచెయ్యాలి అంటే గద్యే చాలా చక్కగా సహకరిస్తుంది. తాను చెప్పాలి అనుకున్న విషయాన్ని సంతృప్తిగా, సంపూర్తిగా సక్రమంగా చెప్తాడు.

పద్యంలో అయితే యతి గణప్రాసలలో ఎలాంటి విషయాన్నైనా బంధించాలి అంటే వ్యర్థపదాలు అసమర్థుల చేతుల్లో అవిరళంగా దొర్లుతాయి. ఈపద్య రచనల్లో, పద్య కవిత్వం రాసినవాడే కవి గాని, గద్య రాసినవాడు కవిగాడు అన్నభావం ఇప్పటికి కూడా చాలావరకు సంఘంలో గట్టిగా ఉంది.

సంస్కృత సాహిత్యంలో "మహాకవి బాణభట్టు" అన్న ప్రఖ్యాతి నార్జించాడు. "గద్యకవితా సామ్రాట్" మనకవి. తనకు ముందున్న కవులందరికంటే తలమానికంగా విరాజిల్లాడు.

"సుకవితా యద్యస్తి రాజ్యేనకిం"

అన్నట్లు సంస్కృతి గద్యకవితా సామ్రాజ్యానికి శాశ్వత సార్వభౌముడీ కవి మహానుభావుడు.

అతనికి దేశపర్యటనం చాలా ఇష్టం. ప్రకృతి ఇతని ప్రియ మిత్రురాలు. అందుచేత అందినంతవరకు ఆమూలాగ్రం వర్ణించు కుంటేనే గాని అతనికి తృప్తి ఉండదు. ఆయా ప్రాంతాలలో ఉండే సాంఘిక వ్యవస్థలు ఆచార సాంప్రదాయాలు మొదలైన వెన్నో మనకవి ఎంతో సునిశితంగా అవగతం చేసుకున్నాడు.

కం॥ సమయజ్ఞుడు సమచిత్తుడు
సమ శబ్దార్థ ప్రయోగ చతురుడు భావకృమ
రస పోషణ రచనా కమనీయ
వృత్తిచు డిల సుకవి యన బరగున్ ॥

అని తన కావ్యాలంకార చూడామణిలో విన్నకోట పెద్దన్న, కవిని గూర్చి వక్కాణించాడు.

పైపద్యంలో సుకవి కుండ వలసిన సల్లక్షణాలన్ని మహా చక్కగా పేర్కొన్నాడు. సమయస్ఫూర్తి, అన్నిటియందు సమత్వం కలవాడు శబ్దార్థాలని ప్రయోగించడంలో అసమాన వైదుష్యం గలవాడు భావ రసా నుగుణంగా రచన సాగించడంలో అద్భుత ప్రతిభా వ్యుత్పత్తులు గల వాడు ఈ ప్రపంచంలో సుకవి స్థానానికి అర్హుడు.

పై పద్యంలో పేర్కొన్న సత్కవి లక్షణాలన్నీ మన మహాకవిలో అతి పుష్కలంగా ఉన్నాయి.

"బుద్ధి సవ నవోన్మేషా శాలినీ ప్రతిభావిదుః"

అన్నట్లునూ "ఎప్పటి కప్పుడ నవీన కల్పనల్"

నూతన అతి నూత్నమైన బుద్ధివికాసంతో కూడిన సరికొత్త కల్పనా చాతుర్యంతో భావాను గుణ్యమైన భాషా ప్రాభవంతో కవితా రాజ్యాన్ని సమర్ధవంతంగా ఏల గల్గేవాడే సత్కవి.

మన కవికి గల భాషా ప్రౌఢిమ తదనుగుణ్యమైన మంచి భావనా బలం సమానంగా సరి తూగుతాయి.

స్వాతి కార్తెలో వర్షపు జల్లుల కంటే చాలా ఎక్కువ గానూ వెయ్యి పేటల ముత్యాలహారం ముడులు సడిత్తే అవి జలజల నేల రాల్తున్నట్టూ మన కవి కవితలో పదజాలం ముత్యాలవెల్లువ జల్లుల్లా మనకి కోకొల్లలుగా కనపడతాయి. మన కవికి ముందు దండి దశకుమార చరిత్ర రచించినా భావనా శక్తిలోనూ, భాషా పటుత్వంలోనూ, చాలా తక్కువే అనుకున్నాంగదా!

దండి ధైర్యంతో పద్య కవితకంటె గద్యగవిత ఏ మాత్రం తీసిపోదని విద్వత్ప్రకాండులకు చాటిచెప్పాడు.

గద్యంలో రసవత్తర మైన వాఙ్మయం సృష్టించా లనుకోవడం ఆనాడు అతి సాహసంతో కూడినపని.

దాన్ని చేపట్టి సాహిత్యరంగంలో ఒక ఉన్నత స్థానాన్ని కల్పించి

"దండినః పదలాలిత్యమ్"

పదలాలిత్యానికి తనంతవాడు లేడు అన్న అర్హతను సంపాదించి మన భట్టుకి బంగారు బాట చూపాడు దండి.

బాణుడు దండీ తరువాత వాడయినా అన్ని విధాలా అతని కంటే ఇతడెంతో అధికుడు అని సాహితీ వేత్తలు అనుకుంటూ ఉంటారు.

దండి పదిమంది రాకుమారుల చరిత్రను "దశకుమారచరిత్ర" అనే పేరుతో రచించాడు.

తెనుగు వాళ్ళకి కథలు రాయడం అన్నా చెప్పడం అన్నా చాలా ఇష్టం. అసలు ఆ రక్తి కథలకే ఉంది.

బాణుడి తరువాత భాసుని వాసవదత్త కథ, ఆపైన విష్ణుశర్మ రాజ కుమారులకు జంతువుల పేర్లతో అద్భుతంగా కథలు చెప్పి వాళ్ళం దరిని మంచి మార్గంలో నడిపించాడు.

తెలుగువాళ్ళు కథలంటే చెవి కోసుకుంటారు. తెలుగువాళ్ళే కాదు అసలు మానవులకే కథలంటే చాలా ఇష్టంలా కనిపిస్తుంది.

అందుకే మహాకవులు తమ బుద్ధి కుశలతతో కథా సాహిత్యాన్ని ప్రజల కందిస్తున్నారు.

అనగా అనగా ఒకరాజు దగ్గరనుండీ ఆంజనాసందినం పీఠం దాకా మనవాళ్ళు ఏ కథ చెప్పినా మహా ఇష్టంగా వింటారు.

ఈ విషయం గమనించి గుణాఢ్యుడు సంస్కృతంలో "బృహత్క థామంజరి" అని రాశాడు. అందులోది కాదంబరి కథామూలం.

మన బాణభట్టు కథావస్తువు అక్కడించి తీసుకున్నా సర్వతంత్ర స్వతంత్రంగా మలిచి మలిచి పారేశాడు.

"కాదంబరీ రసాస్వాదం ఆహారమపి నరోచతే" అనిన్నీ

"కాదంబరీ రసజ్ఞుల కాదట రుచియించు నొక్కొ ఆహారంబున్"

అంటే కాదంబరీ పాఠకుడికి ఆహార పానీయాలు ఏమీ రుచించవట.

"భట్ట బాణుని ముక్కుపట్టి కాదంబరి కథలు చెప్పేడి చెల్మికత్తె నాకు" అన్నారు జంధ్యాలవారు,

వర్ణనలు అలంకారాలు పాలు కాస్త తగ్గిస్తే కథమాత్రం పాఠకుణ్ణి తల యెత్తకుండా చేసేస్తుంది.

ప్రారంభంనుంచీ ముగింపు దాకా కథలోకథ కథలోకథ, పాఠకుడికి పద్మవ్యూహంలోకి పోతున్నట్టు ఉంటుంది ఎక్కడా కథలకి అంతు పట్టదు.

సామాన్యంగా కథలూ, నవలలూ, చదువుతున్నామంటే అవి సగం చదివితే ఉన్నది మన ఊహకి అందుతుంది.

కాని కాదంబరీ, పింగళివారి కళాపూర్ణోదయం ముగింపుదాకా పాఠకులకి ఎక్కడా కథ అంతూ పంతూ కనపడకుండా ఉంటుంది. అలా కథ రాయగలగడం ఆ కవిపుంగవుల ప్రతిభకు తార్కాణం.

కథలు చెప్పడంలో రెండు పద్ధతులున్నాయి. ప్రారంభం నుంచి చివరిదాకా అలా చెప్పుకుంటూ పోవటం ఒక పద్ధతి.

కథ మధ్యలోంచిగాని మూడవ భాగంలోంచి గాని ప్రారంభించడం రెండవ పద్ధతి. పాఠకుడికి ముందు కథ ఏం జరుగుతుంది? ఏం జరుగుతుందని ఆత్రంతో పుస్తకంచివరి వరకూ పఠనసాగిస్తాడు. ఏ పాత్ర ఎవరు? దీని ముగింపు ఎలా ఉంటుంది? అనే ఆరాటం ఏ మాత్రం తగ్గకుండా రాయ గలగడం కవి ప్రతిభను బట్టి ఉంటుంది.

కాదంబరి కథమాత్రం ఒకంతట పాఠకుడికి అంతు పట్టదు. ఈ కావ్య పఠన ప్రారంభించిన, పాఠకుడు కథాగమనం కోసం, చాలా ఓర్పు పట్టవలసే ఉంటుంది.

ఒక్కొక్క పాత్రకి కొన్ని జన్మాల పూర్వ వృత్తాంతా లున్నాయి. జన్మ జన్మల వాసనలు ఆయా పాత్రలకి కొన్నింటికి గట్టిగా పట్టుకొని ఉంటాయి.

పూర్తిగా గ్రంథం పఠిస్తేగాని ఆపాత్రల నిజ స్వభావ స్వరూపాలు పఠితల కందవు.

కథాసంవిధాన వైచిత్ర్యంలో మహా ఘనుడు మనబాణభట్టు.

## కాదంబరీ పాత్ర పరిచయం

కథ సమగ్రంగా అర్థం కావాలంటే ముందు జాగ్రత్తగా ఆయా పాత్రల్ని కనీసం రెండు మూడు సార్లయినా పరిశీలించి తరువాత కథ చదవాలని మా పాఠకులకు మనవి.

శూద్రకుడు :

ఇతడు విదిశా పట్టణాన్ని పరిపాలించే రాజు. ఇహలోక సుఖాల్ని అనుభ వించాలనే మనస్తత్వం కలవాడు కాదు. సంగీత సాహిత్యగోష్ఠు లంటేనే ఇతనికి మహా ఇష్టం.

మనకి ముందు కథలో వచ్చే తారాపీడుడనే రాజు కొడుకు పేరు చంద్రాపీడుడు. అతడే శూద్రకుడై పుట్టాడు. అతడి హృదయంలో మిక్కుటంగా నాటిన కాదంబరిపై మక్కువ ఎంత ఎక్కువైందో గాని ఈ జన్మలో కూడా అతడి హృదయంలో ఎక్కడా చెక్కుచెదరక నిలిచి పోయిందన్నమాట.

వెనుకటి జన్మలో ప్రేమించిన కాదంబరి మీదే మమత ఉందన్న మాట. అంటే శూద్రకుడికి జ్ఞాపకం ఉందని గాని, కాదంబరీ వ్యామో ంచేతే ఇలా ఉన్నాడని కాని కవి ఎక్కడా వాచ్యంగా చెప్పలేదు. సుని తంగా ఆ పాత్రని పట్టిచూస్తే ఆ విషయం నీళ్ళల్లో జాడలా చిన్నగా ఖామాత్రంగా ధ్వనిస్తుంది.

చంద్రాపీడుడు :

ఇతడు తారాపీడుని కొడుకు. యువరాజు. చతుష్షష్టి కళాకోవి దుడు. నలకలు లేని అప్పుడే తీసిన నవ్య నవనీతం లాంటి మనస్సు అతనిది. సద్గుణాలనే రత్నాల ఆభరణాలని అతడు ధరించాడు. ఆ అలంకార శోభితుడు కీర్తి కాంతా బద్ధుడు. శరీరాన్ని చాలించినా చంద్ర సూర్యు లున్నంత వరకూ కీర్తి శరీరంతో వెలుగుతూనే ఉంటాడు. ఇతడు చంద్రుని అవతారం.

మహాశ్వేతని ఎంతగానో సహృదయంతో సన్మిత్రునిలా ఆదు కుంటాడు. ఆమె కష్టగాథ విని కన్నీరు కారుస్తాడు. మనోమాలిన్యం లేనపుడు మగువలతో సన్నిహితంగా మనుగడ సాగించడం తప్పు కాదని నిరూపించాడు కవి.

కుమారపాలితుడు :

శూద్రకుని మంత్రి.

వైశంపాయనుడు :

శుకనాసుని కొడుకు చంద్రాపీడుని మిత్రుడు. మహాశ్వేత ప్రియుడు.

చండాల దారిక, శూద్రక మహారాజుకి బంగారు పంజరంతో మాటలు వచ్చిన చిలుకను తీసుకు వచ్చి బహూక రిస్తుంది. దాని పేరూ వైశంపాయనుడే. శూద్రకుడు తన వృత్తాంతాన్ని అడిగితే జాబాలి మహర్షి శిష్యులకు తన కథ చెప్పగా తను విన్నాను అని చెపుతుంది. అలా విన్నాక పూర్వజన్మ స్మృతి రాగా మహాశ్వేతను చూడాలని వెళుతూ ఉంటే మార్గమధ్యంలో రెక్కల బలంలేక పడిపోయిందట. బోయ వాళ్ళు పట్టి దానిని చండాల దారికకు ఇచ్చారు. ఆ చండాలదారికే నన్ను నీకు సమర్పించిందని చిలుక శూద్రకుడికి చెపుతుంది.

శ్వేతకేతువు :

తెల తామరలో లక్ష్మి ఈ మహర్షిని కాముక దృష్టితో చూస్తుంది. తత్ఫలితంగా కొడుకు ఆ తామరలో పుడతాడు, ఆమె ఈ బాలుణ్ణి మహర్షికి "వీడు నీ తనయుడే తీసికో" అని ఇచ్చేసింది. అతడు పుండరీకుడని పేరు పెడతాడు ఈ పిల్లవాడికి. తరువాత విద్యలన్నీ నేర్పాడు. ఈ పాత్రను మహా సుకుమారంగా చిత్రిస్తాడు మనకవి.

హారీతుడు :

ఇతడు జాబాలి కొడుకు. తండ్రిలాగే తపః సంపన్నుడు.

హారీతుడు ఒకనాడు సాయంత్రం అహ్నికాది కార్యక్రమాలు నిర్వర్తించటం కోసం వెళతాడు నదికి. ఆ సమీపంలో ప్రాణం అటూ యిటూగా ఉన్న ఒక చిలుక కనిపించింది. దాన్ని తీసి నీళ్ళు పట్టి సేద దీర్చి ఆశ్రమానికి తీసుకు వెళతాడు.

జాబాలి, చిలుకను చూసి, తపోదృష్టిచే, దీని సంగతంతా తెలుసు కుంటాడు. ఆశ్రమ వాసులకి ఈ చిలుక పూర్వజన్మ వృత్తాంతం అంతా సవివరంగా చెప్తాడు.

జాబాలి :

ఇతడు మహర్షి.

తపోధనుడు. భూత భవిష్యద్వర్తమానాలన్నీ చూడగలడు, చెప్పగలడు. దుర్నిరీక్ష్యంగా వెలిగిపోతూ ఉంటాడు తపోశక్తిచే.

పుండరీకుడు :

మొదటి జన్మ శ్వేతకేతు కొడుకు పుండరీకుడు. రెండవ జన్మలో వైశంపాయనుడు. మూడవ జన్మ కూడా వైశంపాయనుడే గాని చిలుక జన్మ. చివరకు మళ్ళీ (పుండరీకుడే) వైశంపాయను డనే పేరుతో ఉన్నా డని మహాశ్వేతకు తెలుస్తుంది. అతణ్ణి ఆమె వివాహం చేసుకుంటుంది. ఇతడు చంద్రాపీడుడికి స్నేహితుడు.

కపింజలుడు :

పుండరీకుడి స్నేహితుడు. ఇతడు చనిపోంగానే కపింజలుడు కూడా ఆకాశంలోకి దూసుకు పోతూ ఉంటాడు. గంధర్వుడు పిడి కొంపర పాటుచూసి గుఱ్ఱంగా పుట్టమని శపిస్తాడు. ఇంద్రాయుధం అనే గుఱ్ఱంగా ఇతడు జన్మిస్తాడు. వైశంపాయనుడి వృత్తాంతం చెప్పంగానే అతడు ప్రాణాల్ని విడిచిపెట్టేస్తాడు. పత్రలేఖ ఈ గుఱ్ఱంతో రాజు లేకపోయాక మనంమాత్రం ఎందుకు" అని ఇద్దరూ సరస్సులో దూకేస్తారు ఆ గుఱ్ఱం మళ్ళీ కపింజలుడై వచ్చి మహాశ్వేతకు వైశంపాయనుడే పుండ రీకుడని చెప్తాడు. జాబాలి ఆశ్రమంలో చిలుక రూపంలో ఉన్న వైశం పాయనుడని చూస్తాడు.

కేయూరకుడు :

కాదంబరీ వీణావాహకుడు. అంతఃపురంలో అందరికీ ఆత్మీయుడుగా ఉంటాడు. ఎంతటి నిగూఢ రహస్యాలైనా కాదంబరి వీడికి చెపుతుంది. చంద్రాపీడుడికి కాదంబరికీ అంతరంగికుడుగా ఉంటాడు.

మేఘనాథుడు :

చంద్రాపీడుని ప్రధాన పరిచారికుడు.

కథలో ఈ పాత్రకి పెద్దగా ప్రాముఖ్యం లేదు.

చిత్రరథుడు- ఇతని భార్య మదిర, వీరి కూతురు కాదంబరి.

హంసుడు- ఇతని భార్య గౌరి. వీరి కూతురు మహాశ్వేత.

చండాల కన్య- లక్ష్మీదేవి అవతారం. పుండరీకుడి తల్లి వైశంపాయనుడనే చిలుక మళ్ళీ మహాశ్వేత దగ్గరకి పోబోతూ కిందపడ్డంచేత సురక్షితస్థానంలోకి వాడ్ని చేర్చమని శ్వేతకేతువు లక్ష్మికి ఆజ్ఞాపించాడు.

అందుకని ఆ చిలుకను శూద్రక మహారాజుకి అప్పగించి నిశ్చింతగా ఉంటుంది ఆమె.

కాదంబరి :

కథానాయిక. మదిరా చిత్రరథుల కూతురు. చంద్రాపీడుడు కథానాయకుడు. బాణుడు ఈ జంటని బహు విచిత్రంగా సృష్టించాడు.

మహాశ్వేత-

పుండరీకుడి భార్య గౌరీ హంసుల కూతురు. పేరుకి తగ్గంత నిర్మలమైన మనస్సు- కాదంబరికి ప్రియ మిత్రురాలు.

విలాసవతి :

తారాపీడుని పట్టపురాణి. చంద్రాపీడుని తల్లి.

మనోరమ :

శుకనాశుని భార్య, వైశంపాయనుడి తల్లి.

శుకనాశుడు :

తారాపీడుని మంత్రి. బహు సమర్థత గలవాడు. చంద్రాపీడుడికి చక్కటి రాజనీతిని ఉపదేశిస్తాడు.

మదిర- చిత్రరథుని భార్య, కాదంబరి తల్లి

గౌరి- హంసుని భార్య, మహాశ్వేత తల్లి.

తరళిక- మహాశ్వేత ప్రియసఖి.

మదలేఖ, తమాలిక- వీళ్ళిద్దరూ కాదంబరి ప్రియ సఖులు.

పత్రలేఖ- చంద్రాపీడుని ముఖ్య పరిచారిక, రోహిణీ అవతారం.

# కాదంబరి కథ (సంగ్రహంగా)

పూర్వం విదిశా నగరంలో శూద్రకుడనే రాజు ఉండేవాడు. ఒకనాడు పొద్దున్నే చండాల దారిక బంగారు పంజరంలో సమస్త శాస్త్రాల పరిచయమూ పాండిత్యమూ ఉన్న వైశంపాయనుడనే చిలుకను శూద్రకుడికి తెచ్చి ఇచ్చింది.

అది కుడిపాదంతో అతడ్ని అద్భుతంగా అభినందించింది.

రాజు మాటలు విని చాలా ఆశ్చర్యపడ్డాడు. మహా సంతోషించాడు.

తన అంతఃపుర స్త్రీలకు ఈ చిలుకను బహుజాగ్రత్తగా చూడవలసిందని కబురు పంపాడు. ఆహారం అదీ అతి శ్రద్ధగా ఇవ్వమని ఆజ్ఞాపించాడు. పక్షి గదా అని అలక్ష్యం చెయ్యొద్దని కూడా చెప్పాడు.
మధ్యాహ్న కార్యక్రమాలు పూర్తి అయింతర్వాత ఆ రాజు చిలుకను రప్పించాడు.

రాజు- వైశంపాయనా, ఆహారం తీసుకున్నావా? ఆకలి తీరిందా? నీకు కావలసిన సదుపాయాలు ఉన్నాయా! ఏం ఇబ్బంది లేదుకదా!

చిలుక- మహారాజా! మీ పరిజనం అంతా ఆప్యాయంగా అమృతోపమానమైన ఆహారాన్ని పెట్టారు. సుష్టుగా తిని హాయిగా విశ్రాంతి తీసుకున్నాను.

రాజు- నాతో మావాళ్ళు పెట్టలేదని నువ్వు ఎలా అంటావ్? ఏం పెట్టారో ఏమో?

చిలుక- రుచ్యంగా ఉన్న పండ్లూ, పండ్లరసమూ, తేనె, మంచి కెంపుల్లా ఉండే దానిమ్మ గింజలూ ఇలా ఎన్నని చెప్పను.

రాజు- అయితే నీ ఆలసట తీరితే నీ కథ చెప్పు.

చిలుక ఇలా చెప్పడం ప్రారంభించింది. "పంపా తీరంలో బూరుగ వృక్షం ఉంది. దాని తొర్రలో నేనూ మా నాన్న వసిస్తూ ఉండే వాళ్ళం. ఒకనాడు పొద్దు పొడవకముందే మొద్దులా పిల్లగా ఉన్న కిరాతుడు వచ్చాడు, వేట వేగంగా సాగించాడు, నన్నూ మానాన్నని లాగిపారేశాడు. నేను పుట్టంగానే తల్లి పోయింది. ఈ బోయివాడు నా తండ్రి పక్షిని పొట్టన పెట్టుకున్నాడు.

దాహంతో నేను తల్లడిల్లిపోతూ ఉండే హారీతు డనే ఋషి కుమారుడు సాయంకాలపు అహ్నికాదులు నిర్వర్తించడానికి అక్కడకు వచ్చాడు. కొన ఊపిరితో ఉన్న నన్ను చూసి నీళ్ళుపట్టి సేద దీర్చి తన ఆశ్రమానికి తీసుకువెళ్ళాడు.

అతని తండ్రి జాబాలి మహర్షి నన్ను చూసి ఇలా అన్నాడు.

"స్వస్యైవ అవినయస్య ఫలం స్వయమేవ అనుభూయతే"

వాడు చేసిన అవివేకమైన పనికి ఫలం వాడే అనుభవిస్తున్నాడు అని అన్నాడు.

అదేమిటో చెప్పమన్నారు ఆశ్రమవాసులు అతణ్ణి. అతడిలా చెప్పటం ప్రారంభించాడు.

పూర్వం తారాపీడు డనే రాజుండే వాడు. అతడికి లేక లేక చంద్రాపీడు డనే కొడుకు పుట్టాడు.

మంత్రి శుకనాశుడికి కూడా వైశంపాయను డనే కొడుకు పుట్టాడు.

వీళ్ళిద్దరికీ ఒక్క దగ్గిరే సమస్త విద్యలూ అభ్యసించే ఏర్పాటు చేయించాడు రాజు.

అల్పకాలంలోనే ఆ ఇద్దరూ అన్ని విద్యలలో ఆరితేరారు. ఇంద్రాయుధం అనే గుఱ్ఱాన్ని ఎక్కి రమ్మనమని తండ్రి కొడుక్కి కబురు పంపాడు.

అలాగే వచ్చేశాడు చంద్రాపీడుడు.

ఉలూత రాజు కూతురు తాంబూల కరండ వాహకురాలిగా, అంతరంగికురాలిగా, అంగీకరించమని ఆప్యాయంగా చూడమని తల్లి కొడుక్కి కబురు పంపింది. వచ్చిన ఆమె పేరు పత్రలేఖ. తల్లి ఆజ్ఞను తలదాల్చాడు చంద్రాపీడుడు.

మంచి ముహూర్తంలో తారాపీడుడు కొడుక్కి యువరాజ్య పట్టాభిషేకం చేశాడు.

తరువాత అతడు జైత్రయాత్రకు బయలుదేరాడు- కొంత సైన్యంతో వైశంపాయనుడితో.

యువరాజు వస్తున్నాడనే వార్త విని రాజలోకం అంతా సంతోషంతో ఎదురు వెళ్ళింది. ధన కనక వస్తు వాహనాలు కానుక లిచ్చారు. సభక్తికంగా తలలు వంచి దాసు లయ్యారు.

చంద్రాపీడుడు అలా వెళ్ళగా వెళ్ళగా అక్కడ ఒక చక్కని కిన్నెర మిధునం కనిపించింది.

రాకుమారుడు దాన్ని వెన్నాడగా వెన్నాడగా అది అదృశ్యం అయింది. చాలా బాధపడ్డాడు. ఎంతో దూరం రావడంచేత చాలా

దాహం వేస్తోంది. ఇతని గుఱ్ఱం కూడా చాలా అలసి పోయింది. పిశ్న శ్రమను పోగొట్టడానికి ఒక వైపునుంచి చల్లని నీటిమీద గాలి వీస్తోంది. ఇలా రమ్మని ఆహ్వానిస్తోందా? అన్నట్టు.

ఆ గాలికి కొంత సేదదీరి తప్పక నీళ్ళు ఉంటాయని నిశ్చయించి అక్కడికి పయనం సాగించాడు. అచ్ఛోదన సరస్సు అని అక్కడ మహా ప్రసిద్ధమైన ఒక జలాశయం ఉంది.

హాయిగా దాహం తాగాడు రాకుమారుడు గుఱ్ఱాన్ని కూడా ఆప్యాయంగా వీపు తట్టి ఆ కొలనిలోకి తీసుకు వెళ్ళాడు. అది ఆ నీట్లో తృప్తితీరా మునిగింది హాయిగా దాహం త్రాగింది. కొంత తెప్పరిల్లింది. దాన్ని చెట్టుకు కట్టి అక్కడే కాసేపు విశ్రమించాడు చంద్రాపీడుడు.

నిశ్శబ్ద వాతావరణంలో వీనులవిందుగా వీణానాదం వినవచ్చింది. రాజూ వింటున్నాడు. గుఱ్ఱం కూడ చెవులు రిక్కించి మోర సారించి వింటోంది.

గానం వినిపించిన వైపు నడక సాగించాడు మన రాకుమారుడు.

సృష్టిలో ఉండే తెల్లదనాన్నంతా ఒక దగ్గరికి చేర్చి అది బొమ్మను చేసి ప్రాణం పోశాడా దానికి బ్రహ్మ యన్నట్లుంది అక్కడ ఒక స్త్రీ విగ్రహం. ఆమె తపోదీక్షతో ఉన్నట్టు వస్త్రధారణాదులు చెప్పక చెబుతున్నాయి. అతడు ఈమెన్ని పలకరించాలి అని చూస్తున్నాడు. మహా కాళేశ్వరుని ఎదురుగా తన్మయత్వంతో కీర్తించి కీర్తించి అలసిపోయింది ఆమె. తదేకంగా పరమశివుణ్ణి చూసి పారవశ్యం చెందింది. చెమ్మగిల్లిన కళ్ళల్లో నీళ్ళు జాలువారుతున్నాయి.

ఆమె కాసేపటికి చైతన్యంలో పడ్డట్టయింది. తదేకంగా పరీక్షిస్తున్న మన చంద్రాపీడుడు నమ్రంగా చేతులు జోడించి ఇలా అన్నాడు.

అమ్మా! ఈ అరణ్యంలో ఒంటరిగా ఉన్నారే తపోదీక్షతో ఎందుకున్నా రమ్మా అభ్యంతరం లేకపోతే అన్యథా భావించక అస్మదీన్నిగా గణించక చెప్పండి. ఆప్యాయత ఉన్నచోట కష్టం చెప్పుకుంటే కొండంత బరువు తగ్గినట్లు గుండె కొంచెం తేలికపడుతుంది.

"స్నిగ్ధజన సంవిభక్తం ఖలు దుఃఖం సహ్యావేదనం భవతి"అంటే సహృదయంతో బాధల్ని పంచుకోగల్గిన సన్మిత్రులకు దుఃఖాన్ని పంచి ఇస్తేనే ఆ బాధ భరించడానికి సాధ్యం అవుతుంది అన్నాడు కాళిదాసు శాకుంతలంలో.

తోటి మానవులకి మానసిక ఆవేదన చెప్పుకోవడం తప్పుకాదు. అని ఎంతో సానునయంగా అన్నాడు.

ఆ మాటలలో ఆప్యాయతకీ అతనిలో ఉండే సహృదయానికి ఎంతో సంతోషించి శ్వేత వినేవాళ్ళుండాలేగాని కష్టాలు చెప్పుకోడాని కేమయ్యా అంటూ నిట్టూర్చి ఇలా అంది

గౌరీ హంసులు నా తలిదండ్రులు. నాపేరు మహాశ్వేత ఈ అచ్ఛోదన సరస్సూ ఈ మహాకాళేశ్వరుని గుడీ మానాన్నే కట్టించాడు.

నేనూ మా అమ్మా ఈ సరస్సులో స్నానం చేసి ఈ దేవుణ్ని దర్శిస్తూ ఉంటాము.

మరి మీరెవరు?

చంద్రాపీడుడు- మా తండ్రిగారిపేరు తారాపీడ మహారాజు. అతని కొడుకుని నేను. యువరాజ్య పట్టాభిషిక్తుణ్నయ్యాను. పరివారంతో జైత్రయాత్రకు బయలుదేరి పరివారా నికి దూరమయాను.మార్గమధ్యంలో కిన్నర మిధునం కన్పించింది. దాన్ని వెంటాడాను. వాళ్ళు అదృశ్యు లయ్యారు. అలసిన కారణంచేత చాలా దాహం

అనిపించి ఈ సరస్సు దగ్గరకి వచ్చాను. మీ వీణా
నాదం నన్నిక్కడకు తీసుకువచ్చింది.

మీ ఆకారం చూస్తే గుండె చెబువై విషయం అడగాలనిపించింది.

తప్పకుండా చెబుతాను. కొంత తపనైనా తీరుతుంది.

అలవాటు ప్రకారం నేనూ మా అమ్మా ఇక్కడికి వచ్చాం. అమ్మ స్నానానికి వెళ్ళింది.

ఒక ఋషి కుమారుడు అతడి పేరు పుండరీకుడు, అతని స్నేహితుడు కపింజలుడు, ఆ ఇద్దరూ అదే సమయానికి ఇక్కడకు వచ్చారు. ఆ ఋషి పుత్రుడ్ని చూసేసరికి నా ఒళ్ళంతా పులకరించింది. అతని చెవుల్లో దేవపారిజాత పుష్పాలున్నాయి. అవి మంచి సువాసనల్తో చాలా బాగున్నాయి.

నే- ఇవి మీకెక్కడ దొరికాయి?

పుం- మేం ఇవాళ మాసశివరాత్రి శివదర్శనం కోసం వస్తూ ఉంటే మాకో అప్సరస స్త్రీ బహూకరించింది. నీకు అంత ఇష్టం అయితే ఉండు అంటూ అతనే నాతల్లో పెట్టి సంతోషించాడు. అతని చేతిలో జపమాల జారిపడింది. అది నేను తీసుకుని నా ముత్యాలహారం అతనికి ఇచ్చేశాను.

ఇంతలో మా తరళిక వచ్చి అమ్మగారు స్నానం చేసివచ్చారని నన్నూ స్నానానికి రమ్మనమని చెప్పి వెళ్ళిపోయింది. నేనూ ఎలాగో వెళ్ళాను.

తరళికతో ఈ విధంగా కపింజలుడు పుండరీకుని వృత్తాంతం చెప్పాడు.

శ్వేతకేతు మహర్షిని మహాలక్ష్మి మోహపు దృష్టితో చూసిందట- ఆ కారణంచేత ఆమె ఆసనమైన తెల తమ్మిపూవులో ఒక మగ శిశువు జన్మించాడట. ఆ బాలుడ్ని ఆమె మహర్షికి నీ తనయుడని ఇచ్చేసింది.

ఆ పిల్లవానికి తండ్రి పుండరీకుడని పేరు పెట్టి విద్యావంతుడుగా శిక్షణ ఇచ్చాడు. ఇవాళ మాసశివరాత్రి శివదర్శనం కోసం వస్తూ ఉన్నాము. మార్గమధ్యంలో ఒక అప్సర కనిపించి ఈ దేవ పారిజాత పుష్పాలు ఇచ్చింది. మా పుండరీకుడు మీ అమ్మగార్ని చాలా అను రాగపూర్వకంగా చూశాడు సుమా నువ్వు గమనించే ఉంటావు అని ఇంకా ఏవేవో చెప్పాడుట.

నేనూ మా అమ్మా స్నానాదికాలు ముగించుకొని ఇంటికి వచ్చేశాం.

దేహం గేహంలో ప్రవేశించినా మనస్సంతా అక్కడే వుండి పోయింది.

సాయంత్రం కపింజలుడు వచ్చాడు. తన మిత్రుడి తపన అంతా చెప్పాడు. నా దగ్గిర జపమాల ఇమ్మన్నాడు. ఇక నన్ను చూడకపోతే అతడు బతకడం కష్టాత్ కష్టతరమని స్పష్టంగా చెప్పేశాడు

తరళికా నేనూ సాహసించి వచ్చేసరికి ఏం చెప్పను ఇక్కడే ఇక్కడే నాయనా ఈ ప్రదేశంలోనే జరగరానంత మహాఘోరం జరిగి పోయింది. ఆ దృశ్యం చూడలేక చాపచుట్టలా ఒక్కమారు నేలకొరిగి పోయాను. పాపం మా తరళిక మహా తల్లడిల్లిపోయిందిట. నీళ్ళు జల్లి విసిరి మళ్ళీ నన్ను మనిషిగా సజీవంగా దక్కించుకుంది. నేనా బాధ పడేకంటే ఈ ప్రాణాలు పోతేనే బాగుండుననిపించింది.

తరళికా "ఈ బాధ భరించలేనే, వేగంగా చితి పేర్చే సెయ్యి" అనిఅంటూ ఉండగానే. ఆకాశంలోంచి ఒక దివ్యపురుషుడు వచ్చాడు. జాగ్రత్తగా, పుండరీకుని రెండు చేతుల్తోను ఎత్తి అకాశరంగంలోకి ఎగిరిపోతూ "మహాశ్వేత నువ్వు తొందరపడి ఎలాంటి అఘాయిత్యానికి పూనుకోకు. నామాట విను. ఇతడు తిరిగి బ్రతుకుతాడు సుమా అంత వరకూ నిరీక్షించు" అంటూ గంధర్వలోకంలోకి తీసుకువెళిపోయాడు.

అప్పటినుంచి ఈ తపోవేషంతో, మనసు కుతకుత లాడుతున్నా అతడెప్పుడు వస్తాడా? అని "ప్రతిక్షణ మహాయుగముల్" అన్నట్టు క్షణం ఒక మహాయుగంగా మనుగడ సాగిస్తూ ఉన్నాను- అంటూ ఉంటే కన్నీటి తెరలు కమ్ముకు వచ్చేశాయి. ఆపలేని దుఃఖంతో అలా వాలి పోతున్న నన్ను పడకుండా ఆపాడు. చల్లటి నీళ్ళు ముఖంపై జల్లి మెల్లిగా కొంచం నీళ్ళు ఆమె నోటికి అందించాడు ఆప్యాయంగా వెన్ను తట్టి చెల్లిలా లాలించాడు చంద్రాపీడుడు.

కొన్ని క్షణాల తరువాత "ఇక చాలు నీ కథ వింటే విలవిల్లాడి పోతున్నాను. అబ్బా మరి వినలేను. అంటూ ఉండగా ముఖంలో చిరు చెమటలు క్రమ్మాయి కళ్ళు ఎఱ్ఱబారి కంఠం గద్గదికంగా అయింది.

నీకు చాలా బాధ అనిపించింది కదూ అందుకే చెప్పటానికి తట పటాయించాను. నువ్వెంతో అభిమానంగా అతి లాలనగా అడిగితే చెప్ప కుండా ఉండలేకపోయాను.

చంద్రాపీడుడు- మాట్లాడ్డంలో ఇందాక తరళిక అని అన్నట్టున్నావ్ ఆమె ఏది? నీకు తోడుగా కావలసినప్పుడు ఎప్పుడైనా కాసిని మంచినీళ్ళయినా అభిమానంగా ఇచ్చే ప్రాణి

లేకపోతే ఈ అరణ్యంలో ఈ బాధలో ఈ జీవితాన్ని
ఎలా గడుపుతున్నావ్?

మహాశ్వేత- చెప్తా విను. "మదిరా చిత్రరథుడనే గంధర్వులకి నిరుప
మాన సౌందర్యరాశి కాదంబరి అనే కూతురుంది.
అది నాకు ప్రాణస్నేహితురాలు.

నా ఈ దుఃఖవార్త విని ఆమె మనసు కలతతో కరిగి
పోయింది. నా వివాహం అయేదాకా తానూ ఆ ప్రసక్తికి
పోనని భీష్మించుకూచుంది.

చిత్రరథుడు నాకు "కాదంబరిని ఎలాగైనా మనస్సు
మార్చుకొనేలా నువ్వే చెయ్యగలవని కబురు పంపాడు.
అందుకని తరళికకు ఆమెకు చెప్పవలసినవన్నీ చెప్పి
పంపాను. ఆమె వెళ్ళింది. నువ్వు వచ్చావ్ దేవుడు పంపి
నట్టు-

ఇలా అంటూ ఉండగానే తరళిక- కాదంబరి వీణావాహకుడు
కేయూరకుడు వచ్చేశారు.

మహా- తరళికా, కాదంబరి నా మాట వింది? ఏమంది బాగుందా?

తరళిక- ఆమె బాగానే ఉంది. నా మాటలు ఆవిడ చెవిలో అసలేమీ
పడ్డట్టే అనిపించలేదు. నీకు ఆ కేయూరకుడితో ఏవేవో చెప్పి
పంపింది.

మహాశ్వేత- అలాగా అయితే కేయూరకా ఇలారా

తర- ఈ మహానుభావు డెవరమ్మా?

మహాశ్వేత- నిన్న ఇతను ఇక్కడికి వచ్చాడు. తారాపీడ మహారాజు

కొడుకు- చంద్రాపీడుడు ఇతని పేరు, యువరాజు జైత్ర యాత్రకు బయలుదేరి తోవతప్పి ఇలా వచ్చాడు- చాలా మంచివాడు, సహృదయుడూను.

చంద్రాపీడా- మాటల్లో చెప్పడం మరిచా మా చెలి తరళిక-

తరళిక- నమస్కారం

చంద్రాపీడుడు ప్రతి నమస్కారం చేస్తాడు- చూపులు నేలకు వాలే ఉంటాయి.

మహా- చంద్రాపీడా- ఈ దగ్గరలోనే హేమకూటంలో ఉంది మా కాదంబరి. ఒకమాటు చూసి వచ్చేద్దాం అంటూ, కేయూరకుని చూసి, ఆఁ అన్నట్టు మరిచాను "కేయూరకా ఇతడు యువరాజు చంద్రాపీడుడు.

కేయూ- నమస్కారం

చంద్రాపీడుడు ప్రతినమస్కారం చేస్తాడు.

మహాశ్వేత- కేయూరకా ఇతణ్ణి మన ఆప్తుడుగా బంధుకోటిలో వాడిగా భావించు- ఏదీ కాదంబరి ఏం చెప్పింది. జంకు లేకుండా చెప్పు.

కేయూ- "ఏం కబురు పంపావ్ మహాశ్వేతా! నువ్వు మృదుభాషిణివే ఇంతకష్టంగా వర్తమానం పంపడం ఏం బాగాలేదు. నీ విషయం తేలేదాకా నాకు ఇలాంటి సందేశం ఇంకెప్పుడూ పంపకు.

మహా- మనం తప్పక వెళితేగాని పనులు జరగవు వెళదాం పద. వీళ్ళు వెళ్ళేసరికి వీళ్ళకంటే ముందుగా చేరిన కేయూరకుడితో ఈ విధంగా మాట్లాడుతోంది.

కాదం- కేయూరకా! వచ్చేశావా? మహాశ్వేత ఎలా ఉంది? ఏమిటి విశేషాలు?

కేయూ- ఆమె బాగున్నారండీ- చంద్రాపీడుడని ఒక రాజకుమారుడు వచ్చారట వారితో మాట్లాడుతున్నారు ఆమె.

కాదం- అలాగా ఆ రాకుమారుడు అక్కడికెలా వచ్చాడు? ఆకృతి విశేషాలేవిటి? ఎలా మాట్లాడాడు? ఈ విషయాలు ముగియ కుండానే- మహాశ్వేత చంద్రాపీడుడు రానేవచ్చేశారు.

కాదంబరి ఎదురు వెళ్ళింది. అతికుతుకంతో కౌగిట చేర్చింది మహాశ్వేతని ఎన్నాళ్ళయింది ఎన్నాళ్ళయింది నిన్నుచూసి అంటూ బుగ్గలూ నుదురూ పుణుకుతూ స్నేహసముద్రం వెల్లువలై ప్రవహిస్తోందా అన్నట్టు ప్రశ్నపరంపరలు కురిపించింది.

మహా- ఆప్యాయంగా వెన్నుతట్టి ఆమె ప్రక్కమీద కూచోపెట్టి ముంగు రులు సరిచేస్తూ కాదంబరీ నిన్ను విడిచి ఎన్నోనాళ్ళయినట్టుం దమ్మా అని ఆనందంతో లాలించింది.

ఈ లోగా పరిచారికలు అర్ఘ్యం తెచ్చారు. మహాశ్వేత కాళ్ళు కడిగింది, తన చెరచెంగుతోనే కాళ్ళు తడి ఒత్తింది.

ఇంకొక పీఠంమీద చంద్రాపీడుడు కూచున్నాడు. ఆమె చెలి అతని కాళ్ళు కడిగి అతిథి పూజ చేసింది.

కాదంబరి లేత తమలపాకులు వక్క మహాశ్వేత కిచ్చింది.

మహా- నన్ను కాదమ్మా ముందు పూజించవలసింది మన చంద్రా పీడుణ్ణి సత్కరించు. నీ చేత్తో ఇతనికి వక్కలాకులూ ఇయ్యి అని గట్టిగా ఆజ్ఞాపించింది. ఇహ వీలులేక కంపిస్తూ వక్కలా

కులు అతని కందిస్తూంటే నాజీవితం నీకందిస్తున్నాను అన్న
ట్లుగా ఉంది.

కాదంబరీ చంద్రాపీడులు మొదటిచూపుల్లోనే కాముని తూపులకు
గురి అయ్యారు.

మర్నాడు వాళ్ళదగ్గర సెలవు తీసుకొని అతడు తన పరివారాన్ని
కలుసుకున్నాడు.

తండ్రి తనని రమ్మని వార్తాహరులను పంపాడు.

వెంటనే వైశంపాయనుణ్ణి సైన్యాన్ని తరువాత రమ్మని చెప్పి
చంద్రాపీడుడు వెళ్ళిపోయాడు.

మహాశ్వేత కాదంబరి చిత్తవృత్తిని గ్రహించింది. తన ఆశ్రమా
నికి వెళ్ళిపోయింది.

ఆత్రంగా ఉన్న తల్లిదండ్రులను చూశాడు. కొంచెం రోజులకు
సైన్యం వచ్చింది గాని వైశంపాయనుడు రాలేదు.

పరిజనాన్ని "ఏమిటి విషయం అని అడిగితే వాళ్ళు వైశంపాయ
నుడు రాను అన్నాడు అక్కడే ఆ చెట్ల కిందే ఉండిపోతా నన్నాడు అని
చెప్పారు చంద్రాపీడుడితో.

కాదంబరీ కటాక్షాలు ఇతణ్ణి ఎప్పుడో చుట్టపడేశాయి.

వైశంపాయనుడ్ని తీసుకువస్తానని చెప్పి తండ్రిని ఒప్పించి
ప్రయాణం కట్టాడు చంద్రాపీడుడు.

వార్తాహరులు ఈ వార్త మహాశ్వేతకు చెప్పారు. కాదంబరికీ
సంగతి కబురు చేసింది శ్వేత.

చంద్రాపీడుడు ఇక్కడికి వచ్చేశాడు. మహాశ్వేతని సాదరంగా కుశలప్రశ్నలడిగాడు. ఆవిడ ఎంతో ఆత్మీయంగా మాట్లాడి అతిథి సత్కారం చేసింది.

తరువాత శ్వేత ఇలా చెప్పింది.

'చూడు చంద్రాపీడా! ఒకనాటి రాత్రి మంచి పండు వెన్నెల. ప్రకృతి అంతా అతిరమణీయంగా ఉంది. నేను ఇక్కడే ఇలా ఈశ్వర ధ్యానం చేసుకుంటున్నాను వైశంపాయనుడు ఇటు వచ్చాడు చూపుల్లో ఆశామోహాలేగాని! నిశ్చల నిర్మలత్వాలు లేవు. దాంతో ఒళ్ళుమండి చిలుకవి అయిపొమ్మని శపించాను. అని ఇంకా చెపుతుండగానే రాకుమారుడు అలా అలానే నేలకొరిగిపోయాడు.

కాదంబరి హృదయంలో కాంక్షల వెల్లువలు పరవళ్ళు త్రొక్క సాగాయి. అతి త్వరగా ఆశ్రమంలో అడుగుపెట్టింది. పిడుగడిచినట్లయింది, ఆ దృశ్యం పెనుగాలికి అల్లాడుతున్న అరటిచెట్టులా నిలువెల్లా కంపించి పోయింది. కట్టలు తెంచుకు ప్రవహించాయి కన్నీళ్ళు. కొంత సేపటికి ధైర్యం తెచ్చుకుంది. చెలికత్తెతో చితి సిద్ధం చెయ్యి అని గట్టిగా ఆదేశించింది. ఉన్న పరివారాన్ని పట్నానికి పొమ్మంది, ఇంతలో చంద్రాపీడుడిలోంచి ఒక తేజస్సు పైకిలేచింది,

అంత అశరీరవాణి: నువ్వు సాహసంచేసి ప్రాణాన్ని పీడకు, నీ చేతుల్లో అమృతం ఉంది, నీ ఊరటకోసం ఇతడ్ని ఇక్కడే ఉంచుతున్నాం, కొంతకాలం గతించాక పునర్జీవితుడవుతాడు నా మాటనమ్ము అనిచెప్పింది.

రాజే లేకపోయాక మనం ఎందుకని పత్రలేఖ ఇంద్రాయుధంతో అచ్ఛోదన సరస్సులోకి ఉరికింది.

కొంతసేపటికి ఆ నీళ్ళల్లోంచి కపింజలుడు బయటకు వచ్చాడు.

మహాశ్వేత కపింజలుణ్ణి చూసి ఆశ్చర్యపోయింది. "వచ్చావా కపింజలా రారా ఎంతకాలం అయింది. పుండరీకుడు ఎక్కడ? క్షేమమా" అని ఆత్రంగా అడిగింది.

"వైశంపాయనుడే పుండరీకుడని చెప్పాడు శ్వేతతో కపింజలుడు.

ఆ మాట విన్న శ్వేత గుండె ఓటారిపోయింది. వైశంపాయనుడు జాబాలి ఆశ్రమంలో ఉన్నాడని చూడాలి అని ఉందని చెప్పి వెళ్ళి పోయాడు, కపింజలుడు.

విషయం తెలిశాక మహాశ్వేత ఆవేదన ఇంతా అంతా కాదు. వెక్కిలు పిక్కటిల్లేలా ఏడ్చింది.

జాబాలి ఆశ్రమానికి వెళ్ళాడు కపింజలుడు వైశంపాయనుణ్ని చూశాడు. కళ్ళనీళ్ళతో చిలుక ఒళ్ళంతా తడిపి ముంచెత్తేశాడు. ఆప్యాయంగా ఒళ్ళో కూచోపెట్టుకుని పళ్ళు అవి తినిపించాడు.

వైశంపాయనుడు కపింజలుడితో, "కపింజలా ఇంతకాలం ఎక్కడ ఎలా ఉన్నావ్. నన్ను ఒంటివాణ్నిచేసి వెళ్ళిపోయావు గదా! నేనెలా ఉంటాననుకున్నావ్," అని ఏడ్చేశాడు.

చేత్తో పట్టుకుని ఓదారుస్తూ-చూడు పుండరీకా ఆ గంధర్వుడు భూమ్మీదనుంచి అలా ఎత్తుకుపోయాడా! అప్పుడు నేనూ వెంబడించి ఆకాశంలోకి ఎగిరిపోయాను. ఆ తొందరలో ఒక గంధర్వుణ్ని ఢీ కొన్నాను- ఆతడు "నీకింత తొందరపాటే పో భూమ్మీద గుఱ్ఱానివై పుట్టు అని శపించాడు- నేను ఇంద్రాయుధం అనే గుఱ్ఱంగా భూమ్మీద ఉన్నాను- చంద్రాపీడుడికి వాహనం అయాను.

అతను ఇవాళ ప్రాణం విడిచాడు. నేనూ పత్రలేఖ సరస్సులో దూకాం. మళ్ళీ నా పూర్వరూపం నాకు వచ్చేసింది. అని చెప్పాడు, కపింజలుడు.

"ఎన్ని బాధలు పడ్డావో పాపం కపింజలా అంటూ వైశంపాయనుడు ఏడ్చాడు. మళ్ళీ వస్తానంటూ కపింజలుడు అక్కణ్ణించి కదిలాడు.

వైశంపాయనుడికి పూర్వజ్ఞానం కొంచెం వచ్చిందేమో మళ్ళీ మహాశ్వేతమీద బుద్ధి మళ్ళింది.

రెక్కల్లో బలం లేకపోయినా చూడాలనే కుతూహలంతో బయలుదేరాడు, మధ్యలో ఒకచోట పడిపోగా బోయవాళ్ళితన్ని పట్టుకున్నారు. ఏం చేస్తారో అని చాలా బాధపడ్డాడు వైశంపాయనుడు.

వాళ్లు తమ నాయకుడికి ఈ మాటలాడే చిలుకను ఇచ్చారు వాడు తన కూతురికి దీన్నిచ్చాడు.

ఆవిడ అతిప్రేమగా ఆహారాన్ని తినిపించింది, నీ దగ్గరకు బంగారు పంజరంలో నన్నుంచి తెచ్చి నీ కిచ్చింది ఆమె, అని చిలుక కథ ముగించింది,

శూద్రకుడు- వైశంపాయనా తరువాత కథ ఏం జరిగింది ?

వైశం- నాకు ఆ తరువాత విషయం తెలియదు, ఆమెను పిలిపించి తెలుసుకోమన్నాడు,

రాజు- చండాల దారికను పిలిపించాడు, ఆమె వచ్చింది, విషయం అడిగాడు,

చండాల దారిక- రాజా! సమయం సమీపిస్తూంది, నువ్వు చంద్రాపీడుడివి-ఇది వైశంపాయనుడే నీ మంత్రికొడుకు- అని చెప్పి అంతర్ధానమైంది.

శూద్రకుడు :

అక్కడ కాదంబరి చంద్రాపీడుడి శరీరాన్ని అనురాగంతో సాకుతూండగా చలనం కనిపించింది- కళ్ళల్లో కదలిక శరీరంలో చైతన్యం కలిగాయి.

పట్టరాని బ్రహ్మానందంతో మహాశ్వేత కీ వార్త పరుగులుతీస్తూ వెళ్ళి చెప్పింది.

మరికొన్ని క్షణాల్లోనే చిలుకరూపు విడిచిపెట్టి మామూలు వైశంపాయనుడుగా పుండరీకుడు అక్కడికి వచ్చేశాడు.

మహాశ్వేతా పుండరీకులకు కాదంబరీ చంద్రాపీడులకు మహా వైభవోపేతంగా వివాహం జరిగింది.

ఇది కాదంబరీ కథా సంగ్రహం

# కాదంబరీ పాత్ర చిత్రణము

## వైశంపాయనుడు

వ్యాసప్రోక్త మహాభారతాన్ని, జనమేజయుడికి వైశంపాయనుడు చెప్పినట్లు మనకు తెలుసు.

వైశంపాయనుడు అంటె సమస్త శాస్త్ర సంశోభితుడన్నమాట.

తారాపీడుడి మంత్రి శుకనాశుడు. తన కొడుకు అంతవాడు కావాలని వైశంపాయను డనేపేరు పెట్టినట్లు కనిపిస్తూంది.

పేరుకి సార్థకంగా సమస్త శాస్త్రాలు చదివాడు వైశంపాయనుడు.

మహాశ్వేత శాపంతో చిలుకగా జన్మించినా, పేరు మాత్రం వైశంపాయనుడనే వచ్చేసింది.

శూద్రకుడను రాజుకి చండాల దారిక ఈ చిలుకను ఇస్తుంది. ఇస్తూ ఇది షట్శాస్త్ర సంశోభిత 'వేదవేదాంగ పఠిత' అని రాజుకి పరిచయం చేస్తుంది.

అదే అంటాడు కాళిదాసు- కుమార సంభవంలో

"ప్రపేదిరే ప్రాక్తన జన్మ విద్యా"

అంటే

"పూర్వ జన్మలో సంపాదించిన విద్య తేలికగా వచ్చినట్టు"

జన్మ జన్మాల వాసనలు ప్రాణికి పట్టి ఉంటాయని మన శాస్త్రాలు చెప్పుతూ ఉన్నాయి.

వాయుర్గన్ధా నివేశయత్

గీత 15వ అధ్యాయం 8వ శ్లోకంలో ప్రాణి శరీరాన్ని విడిచినా వాసనలని విడువదు. ఎలా అంటే వాయువు పువ్వులలో పరిమళాన్ని తీసుకు వస్తున్నట్టుగా.

అలాగ్గానే వైశంపాయనుడు ఈ చిలుక జన్మలోకూడా అంతకు ముందు మంత్రికొడుకుగా ఉన్నప్పుడు సంపాదించిన శాస్త్రపరిచయం ఏమీ మరచిపోలేదట.

అందుకే బంగారు పంజరంలో చిలుకను తెచ్చి చండాలకన్య ఈ రాజుకి ఇచ్చింది.

అప్పుడు చిలుక తన కుడికాలు రాజుకి అభివాదం చేస్తున్నట్టుగా పైకి ఎత్తింది. అంతేగాక ఒక శ్లోకంతో చక్కగా అతడ్ని పొగడింది

శ్లో॥ స్తనయుగ మశ్రుస్నాతం సమీప తరవర్తి హృదయ శోకాగ్నేః
చరతి విముక్తాహారం వ్రతమివ భవతోరిపు స్త్రీణామ్

(కాదంబరి 14వ పే. 15వ పంక్తి సంస్కృత)

విద్వాన్ విశ్వంగారి పై శ్లోకానికి తెనుగుసేత ఇట్లా ఉంది.

"నీరిపు రమణుల హృదయము సారెకు కన్నీళ్ళ మునిగి సంతాపాగ్నిన్ జేరి విముక్తాహారమ్మై రాజా వ్రతము సేయు నడవులలోన్.

(కాదంబరి 17వ పే. 3వ పంక్తి)

"రాజా! నీరిపుల నారీమణులు ఆభరణాలు విడిచి అరణ్యంలో ఉంటూ వియోగాగ్నిని తమ కన్నీళ్ళచే ఆర్పుకుంటున్నారా? అన్నట్టున్నారు.

అని భావం మనకు తెలుస్తుంది.

సాధారణంగా మహాకవులు తమ కావ్యంలో ముందు చెప్పబో కథను ప్రథమంలో పస్తుహపంగా చెప్పడం ఉంది. ఇంచుమించు కావ్యకథ అందు ధ్వనిస్తూ ఉంటుంది.

ఇందులోకూడ చరతి, విముక్త-ఆహారం. చరతివిముక్తా-హార

అంటే అరణ్యంలో స్త్రీలు భర్తృ వియోగబాధ అనుభవిస్తూ ఉన్నారు- ఆహారం వదలి వ్రత మాచరిస్తున్నారా? అన్నట్టున్నారు,

భర్త లేని స్త్రీలు ఆభరణాల్ని అంతగా అపేక్షించరు గను ముత్యాలహారాలని విడిచేసి తమ కన్నీళ్ళచే హృదయింలో ఉన్న పరి పాన్ని చల్లార్చు కుంటున్నారా: అన్నట్టుంది.

కాదంబరిలోకూడా ముఖ్యమైన స్త్రీ పాత్రలు రెండు మహాశ్వేత కాదంబరి. ఇద్దరికీ పటిష్ఠం అయిన మిత్రత్వం ఉన్నందుకు ఇం మించు తుల్యమైన బాధల్నే కవి అందించాడు.

సుఖానికి శత్రువు దుఃఖమే కదా- రాజ్య సుఖాలు లేక అ అర్థం తెలుస్తుంది.

'సమీప తరవర్తి' హృదయశోకాగ్నే'

ఇందులో కాదంబరికి చంద్రాపీడుడి శరీరం సమీప తర వర్తిగా ఉంటుంది. లేకపోతే చింత. ఉంటే సంతోషం. సహజంగా ఉంటుంది ప్రాణికోట్లకు కాని ఇక్కడ ప్రాణం ఉన్నట్టు కాదు లేనట్టూ కాదు ఆ కళేబరం లాంటి దాన్ని చూస్తూ ఊపిరి లేక, ఉలక్క పలక ఉంటూంటే, అలాంటి కష్టాన్ని చూసి భరించడం మాత్రం మ చి మర్మం.

మన బాణుని భావనాశక్తి ఆ పాత్రల సృష్టి నిజంగా అతడి. అంటాలి.

కనుక పైన వైశంపాయనుడు శూద్రక మహారాజుతో చెప్పిన శ్లోకంలో కరుణ రసస్ఫోరకంగా ఉన్న కాదంబరి కథ మహా హృద్యంగా ధ్వనిస్తోంది.

ఆ శ్లోకాన్ని విన్న శూద్రకుడు ఆనంద జలధిలో మునిగి తల మునకలైనాడు.

జాబాలి వాక్యాలచే చిలుకకు పూర్వజన్మ జ్ఞానం కలిగినట్లు, చిలుక శ్లోకంచేత శూద్రకుడికి జన్మాంతర సన్నివేశాలు స్ఫురించి ఉండాలి.

శూద్రకుడు మధ్యాహ్న ఆహ్నికాలు నిర్వర్తించుకున్నాక విశ్రాంతి తీసుకున్నాడు.

పరిరక్షించమని పరివార జనానికి పంపిన చిలుకను తెమ్మన్నాడు. వాళ్ళు తెచ్చి రాజు ముందు ఉంచారు. ఆ చిలుకను చూసి ఇలా అన్నాడు రాజు.

రాజు- వైశంపాయనా! ఈ అంతఃపురంలో నువ్వు అరమరికలు లేక కావలసిన ఆహార పానీయాలు అనందంగా సుష్టుగా తీసుకున్నావా? ఆహారం తీసుకోవడంలో "త్యక్త లజ్జా సుఖీభవ" మొహమాటం విడచి శుభ్రంగా ఆహారం తీసుకుంటేనే సుఖం. మొహమాటపడి ఆహారం తీసుకోకపోతే వారికే బాధ. అర్ధాకలిగా పెట్టిన పాపం మాకు చుట్టుకుంటుంది.

చిలుక- రాజా "మనీషిభిః సాప్తపదీన ముచ్యతే" అన్నారు
సఖ్యం సాప్తపదీనమ్,

మనీషావంతులతో ఏడు మాటలాడినా ఏడు అడుగులు నడచినా మంచి స్నేహం శాశ్వతంగా ఉంటుందంటారు గదా! నీతో

ఇంత పరిచయం ఏర్పడ్డాక ఇంకా నా దగ్గర జంకు కొం
దెందుకు? నువ్వేమైనా అనుకుంటావని? లేక పెట్టలేని వా
వనా? ఎందుకు తీసుకోలేదు?

కావలసిన కంటే ఎక్కువే తిన్నాను. నీకెందుకా సందేహం?
రాణులు స్వహస్తాలతో అమృతోపమానమైన ఆహారాని
అతి ఆప్యాయంగా పెట్టారు.

రాజు. అయితే నీ కథ వినాలి అని ఉంది చెప్పు. నువ్వు ఏ దేశంల
జన్మించావ్? ఈ దేశానికి ఏలా వచ్చావు? ఏ అక్షరాలు ?
నామాన్ని అలంకరించాయి? తల్లి ఎవరు? తండ్రి ఎవరు? వే
శాస్త్రాలు అన్నీ నీకెలా వచ్చాయి? ఇన్ని కళలు ఏ విధంగ
సంపాదించావ్? జన్మాంతర ఘట్టాలు ఎలా జ్ఞాపకం ఉన్నాయి?
పక్షి రూపంలో ఎందుకు నివసిస్తున్నావ్? ఇదివరకు ఎక్క
ఉండేవానివి? పంజరంలో ఎలా బంధింపబడ్డావ్? చండాల కన
చేతిలోకి నువ్వు ఎలా వచ్చావ్? ఈ విషయాలన్నీ నాకు చా
వినాలని ఉంది చెప్పు.

చిలుక. రాజా నా కథ చాలా ఉంది. వినాలని ఉందన్నావు గదా? సరే
విను.

పంపా సరోవర తీరంలో ఒక పెద్ద బూరుగు వృక్షం ఉంది.
ఆ తొర్రలో ఒక చిలుక జంట వసిస్తూ ఉండేది. అవే నా తల్లి
దండ్రులు. నేను మాతృగండాన పుట్టిన దౌర్భాగ్యుణ్ణి. కన్న
తల్లి కళ్ళల్లో వెల్లివిరిసే వాత్సల్యాన్ని ఒక్కసారి కన్నారా
చూద్దామని కైనా నోచుకోలేదు. కన్నతల్లి అనురాగాన్ని ఒక్క
సారి కన్నారా చూసుకోలేని జన్మం నిజంగా ఒక జన్మమేనా?

అనిపిస్తుంది. భార్యా వియోగ దుఃఖం మా నాన్న భరించ లేక పోయేవాడు. అంతు కందని అనురాగ జలధి వారిది.

దినాలూ, వారాలూ, వత్సరాలూ, పుష్కరాలూ, వాళ్ళ క్షణాల్లా గడిపేవాళ్ళు. పవిత్ర ప్రేమైక జీవులు- అమ్మ ప్రాణానికి నేను మృత్యు దేవతలా అవతరించాను. భార్యా వియోగ దుఃఖాన్ని భరించలేక పోయేవాడు మా నాన్న. ప్రాణాన్ని విడవడానికి నా మీద మోహం అడ్డు వచ్చింది. నా కోసం కష్టపడి ఆహారాన్ని సంపాదించే వాడు. ఆహారాన్ని ఒక్కసారి చేత తాకి కన్నారా నా తల్లి గూటివంక చూసి కళ్ళ నీళ్ళు పెట్టుకొని నన్ను తన ఒళ్ళో ఉంచుకొని అతి ప్రేమగా ఆహారాన్ని తినిపించే వాడు. మిగిలిన దాన్ని పంచుకు తినే పొలతి లేదే అని పొగుల్తూనే జీవ ధారణం కోసం మాత్రం తినేవాడు.

మా గూటిలోంచి బైటికి వెళ్ళేవాడేకాదు. వెళ్ళినప్పుడు నా తల్లి గూటిని చూసుకునే వెళ్ళేవాడు. మళ్ళీ రాంగానే ఆ గూటిని చేరి కుమిలిపోయేవాడు. నన్ను చూసుకొని మాత్రం కాస్త ఊరట పొందుతూ ఉండేవాడు. నిద్దుర లేచినా తిన్నా ఎక్కడికైనా వెళ్ళినా తిరిగి వచ్చినా అమ్మ గూటి దగ్గిరకి వెళ్ళితేనే గాని ఏ పనీ చేసేవాడు కాదు. పడుకునే టప్పుడు కూడా తల్లి గూటి దగ్గిర తలవంచి ఏడ్చేవాడు.

"కాలోయమ్ దురతి క్రమమ్"

ఎంతటి వారికైనా విధి విహితమైన కష్టాల్ని అనుభవించక తీరదు కదా!

ఒకనాడు సూర్యోదయం కాలేదు. వెలుతురు రాలేదు. ఇవాళతో అమ్మ వియోగబాధ ఇక పడక్కర్లేదని ఇంతవరకు అనుభవించిన బాన్ని తపనుడు తన కిరణాలనే చేతుల్తో ఇతణ్ణి సముదాయిస్తున్నాడా? అన్నట్టు అర్కుడు దయించాడు. మా పాలిట యముడు ఇలా అవతరించాడా అన్నట్లున్నాడు. ఒక శబరుడు పక్షులను పట్టి వేటాడ్డం కోసం బయలు దేరాడు. వాణ్ణి చూస్తే చాలు పై ప్రాణాలు పైకి పోతాయి.

కూడ్ర- వాడి ఆకారం చూస్తేనే సగం పక్షులకి పై ప్రాణాలు పైకి పోయి ఉంటాయనుకుంటా. పాపం మరి నువ్వూ మీ నాన్న అప్పుడు ఏం చేశారు?

చిలుక- ఏం చేశాం? చూస్తూ ఊరుకున్నాం. వాడు కనిపించిన చెట్లన్నీ చకచక ఎక్కేస్తున్నాడు.

"ప్రచలిత ఏవ తదరణ్య మభవత్" అరణ్యాన్నంతా కదిపి ఊపి కుదిపి పారేస్తున్నాడు,

అలా చెట్లెక్కి తొఱ్ఱలలో ఉన్న కుఱ్ఱ పక్షుల్ని పెద్ద పక్షుల్ని కరాళ కబంధ హస్తాల్లా చాపి అందు కుంటున్నాడు, అందినవాటిని చంపేసి వదల్తున్నాడు. అలా వాడు ఆ అరణ్యంలో ఎక్కడా ఒక్క బక్కచిక్కిన పక్షినైనా వదలలేదు. కంటికి కనిపించినంత మటుకు చేతికి చిక్కినంత వఱకూ అడ్డూ ఆపు లేకుండా మారణహోమం చేస్తున్నాడు.

ఆ వూపు పూపు మేం ఉండే చెట్టుకి కూడా తగిలింది. నేను అతిభయంతో మా నాన్న రెక్కల్ని గట్టిగా అదిమి పట్టు

కున్నాను. నా రక్షణ మాత్రమే ఏకైక లక్ష్యంగా పెట్టు
కున్నాడు మా తండ్రి. తన శాయశక్తులా తన ప్రాణాల్ని
ఇచ్చి అయినా సరే నన్ను రక్షించుకోవాలని తన రెక్కల
క్రింద నన్ను దాచాడు.

ఆ గోయువాడి మెడనీ, ఉక్కుముక్క కంటే ఎక్కువ బలంగా
ఉన్న వాడి జబ్బలనీ గట్టిగా ముక్కుతో పొడిచి పొడిచి విడి
చాడు, కాని ఏం లాభం? వాడు ఎక్కువ అయిన ఒకటో రకం
ఉక్కు మనిషి. మా నాన్న పొడుస్తున్నా దన్న పొగరుతో
నన్నూ మానాన్నని ఒక్క ఉదుటున దురుసుగా లాగి దూరంగా
గిరవాటే శాడు.

ఆ దెబ్బతో తండ్రికూడా శాశ్వతంగా నన్ను విడిచాడు. నాస్థితి
రెక్కలా ఇంకా బలంగా రాలేదు. ఏ దిక్కు చేరితే ఏ కష్ట
నష్టాలో తెలుసుకో లేని స్థితి కఠోర హృదయుడి కర్క శ
హస్తా ల్లోంచి నేలబడ్డానేమో, ఒళ్ళంతా పులిసి పోయింది. పచ్చి
పుండులా ఉంది. విపరీత మైన దాహం. తలయెత్తి చూడ్డానికే
వణుకు పుడుతూంది. ఎక్కడ చూసినా యముడులా వాడే
కనబడుతున్నాడు. ఇంతిదాకా తల్లి లేకపోయినా తండ్రే
అన్ని విధాలా ఆప్యాయంతో చూస్తున్నాడు.

ఎంతెంతటి కష్టాలు వచ్చినా జీవితాశ మాత్రం వదలదు
ప్రాణులకి. ఈ జీవిత తృష్ణ ఎంతటిది?

కాదంబరి 33, 34 పే. 5, 10-15 పంక్తులు.

"అనుపజాత పక్షతయా నాతిస్థిర సంచారస్య ముహుర్ముహుః అధోముఖేన అపతతో ముహుర్ముహు తిర్యక్ నిపతతః ఆత్మానం ఏకయా పక్షపాల్యా సన్ధారయత. కథంతం సంవర్ధ్యః శ్రీ మాతురస్యా అసహ్యానవశాత్ ఏక మపిదత్వా పదమ్ అనవ రతమ్ ఉన్ముఖస్య స్థూల స్థూలం నిశ్వసతో ధూళి ధూసరస్య సంవర్ధ్నతో మామనుభూతే మనసీ అతి కష్టాసు దశాస్వపి జీవిత నిరపేక్షా నభవంతీ ఖలు జగతి ప్రాణినాం ప్రవృత్తయః నాస్తి జీవితాత్ అన్యదభిమతతర మిహ జగతి జంతూనాం ఏవ ముపరతే సుగృహీత నామ్ని తాత ఇయత్ అహమవిక లేంద్రియ పునరేవ ప్రాణిమి ధిఙ్మాను కరుణ మతి నిష్ఠురం వినోథ పితృ మరణశోక దారుణం యేన మయాఽప్యతే ఉప కృతమపి నాపేక్షతే ఖలం హి ఖలు మే హృదయం అహంహి లోకాంతరముపగతాయామ్ అంబాయాం నియమ్య శోక వేగ మాప్రవసపదినాత్ పరిణత వయసాపి శతా తాతేన త్రై స్త్రైరుపాయై సంవర్ధతీ క్లేశ మతి మహాంత మపిస్నేహవశాద గణయతా యత్పరి పాలితస్తత్సర్వ్వ మేకపదే మయా విస్మృతమ్

అతి కృపాణాఖలు అమీ ప్రాణాః

యదుపకారిణ మపి తాత మద్యాపి గచ్ఛంతం నాను గచ్ఛంతి సర్వథా న కంచి న్న ఖలీ కరోతి జీవితతృష్ణా, యదీదృగవ స్థమపి మా మయ మాయాస యతీ జలాభిలాషః మద్యేచ అగ ణిత పితృమరణ శోకవ్యనిర్ఘృణత న్త్రైవ కేవల మియంమమ సలిల పాన బుద్ధిః అద్యాపి దూరత ఏవసరః తథాహి- జల దేవతా నూపుర రవానుకారి దూరేద్యాపి కలహంస విరుతం

అస్ఫుటానిచ శ్రూయంతే సార సరసితాని ఆయంచ విప్రకర్షా దాయముఖ విసర్జన విరళః సంచరతి నళినీ షండ పరిమళఃదివ సస్యేయమతి కష్టాచదశావర్తతే, తథాహి రవిరంబర తలమధ్య వర్తీస్ఫుటంతం ఆతప మనవరత మనల ధూళినికరమివ వికిరతి కరైః అధికామ్ ఉపజనయతి చతృష్ణం ఆతప స్పర్శ సంతప్త పాంసుపటల దుర్గమా భూమి. బల అతిప్రబల పిపాసావసన్నాని గంతుమల్పమపి మేనాలం అంగకాని అప్రభురస్మ్యాత్మనః సీదతి మేహృదయం అంధకారతాముపయాతి చక్షు, అపిఖలోవిధి రనిచ్ఛతోపి మే మరణ మద్యైవ ఉపపాదయేత్.

వైశంపాయనుడి అవస్థపైన సంస్కృతంలో బాణుడు వర్ణించిన మూలం.

(నేను చదువడానికి వీలుగా అక్కడక్కడ సంధులు నాకుతోచిన రీతి విరిచాను! పాఠకులకు అర్థం అవుతుందనే అభిప్రాయంతో).

పుట్టంగానే తల్లి కరువైంది. తల్లిబాధ్యత కూడా తండ్రే వహించాడు. నాకు అమ్మ ఆదరణ లేదనే బాధ రానిచ్చేవాడే కాదు. అమ్మ కంటే ఎక్కువగా అభిమానం అనే అమృతాన్ని నామీద వర్షిస్తూ ఉండేవాడు. తన హృదయంలో హృదయంలా తన ప్రాణంలో ప్రాణంలా ఎప్పుడూ ఎదకదుముకుని ఉపలాలిస్తూ ఉండేవాడు. నాకోసం అష్టకష్టాలూపడి ఆహారం సేకరించి పెట్టేవాడు.

తల్లి భూదేవి తండ్రి ఆకాశ స్వరూపుడూను అని పెద్ద లంటారు. ప్రాణికోట్లకు తల్లిదండ్రులు అనే బంగారుభరిణని ఇచ్చాడు దేవుడు. ఆ భరిణలో వస్తువుల లాంటివి జీవులు. తలిదండ్రులు లేని జీవితాలు ఆ భరిణలోంచి పడిపోయిన వస్తువుల్లా అల్లాడవలసి-దేగః

నాలా అబ్బా నా తండ్రి ఎంత శాంతమూర్తి? ఎంత విజ్ఞాని! ఎంత తేనెలాంటి మనస్సు, ఎంత నవనీత హృదయుడు! ఎంత దయాంబురాశి? ఎంత వివేకి? ఎంత త్యాగశీలి? దేవుడిలాంటి తండ్రి, ఎట్టి ఎదుట కసాయివాడి చేతుల్లో పడి ఆఖరి క్షణం దాకా నా ప్రాణాన్ని రక్షించాలని ఆ రక్కసుడితో యుద్ధంచేసి చేసి చచ్చిపోయాడే? నా కోసమే తన ప్రాణాన్ని విడిచిపెట్టేశాడే! నేను నిర్దాక్షిణ్యంగా అలా నిర్జీవుడై పడిఉన్న తండ్రిని చూస్తూ నా ప్రాణాన్ని రక్షించు కొందుకు ఎంత ప్రయత్నం చేస్తున్నాను? తండ్రి అలా ఉండగా నా బ్రతుకు ప్రయత్నంలో మునిగానే! ఎంత కృతఘ్నుణ్ణి? ఎంత నీచుణ్ణి? ఎంత పాపిని? ఎంత ద్రోహిని? తండ్రి శవాన్ని చూస్తూ, నేను ఎలా బ్రతకాలి? అనే ఆలోచన చేయడం విశ్వాస ఘాతుకం కాదూ!

ఎండుటాకుల్లో యముడులాంటి ఆబోయవాడికి కనపడ కుండా దాగి కూచున్నాను.

ఈ ప్రక్కనుంచి నీటిమీద గాలి వస్తోందని తెలుసుకున్నాను. కాళ్ళలో, రెక్కల్లో శక్తి లేకపోయినా మెల్లిగా ఈ శరీరాన్ని యీడ్చు కుంటూ యీడ్చుకుంటూ ఒక రెక్క సాయంతోటే నీటివైపు పయనం సాగిస్తున్నాను. మెడ నిలవడం లేదు రెక్కలు లేవడం లేదు. కాళ్ళు కదలనంటున్నాయి. దాహం తహతహలాడిస్తోంది. కళ్ళూ వళ్ళూ స్వాధీనం తప్పుతున్నాయి. అన్నం నీళ్ళు ఇచ్చి సాకేవాళ్ళు లేకపోయినా ఈ ప్రాణం విడిచినా అయ్యో! పోయిందే అని సానుభూతితో రెండు కన్నీళ్ళు కార్చగలిగే ప్రాణి ఏ ఒక్కటీ లేదే అని తెలిసినా ఎందుకో, ఈ తీరని జీవితాశ- తండ్రిని విడిచి జీవించాలనే మహాపాపిని.

"ఖలం హి ఖలు మే హృదయమ్"
పాపుల్లో మహాపాపి నా హృదయం గదా!

కన్నీళ్ళతో, కంపించే దేహంతో కాళ్ళు కదపలేక కదవలేక దాహం బాధని తట్టుకోలేక పోతున్నాను. క్రింద ఇసుక కాలికాలి ఉంది. అవయవాలు పట్టు తప్పుతున్నాయి అయినా :

"అతికష్టాసు దశాస్వపి జీవిత నిరపేక్షా న భవంతి ఖలు జగతి ప్రాణినాం ప్రవృత్తయః"

"ప్రాణుల స్వభావం ఏమిటంటే ఎంతెంత కష్టాలైనా జీవితాన్ని వదులుకోవడం అంటే ఇష్టపడవు గదా!

ఇందులో బాణుడు తనకి తండ్రిమీద ఉన్న ప్రేమను చాలా చక్కగా వ్యక్తం చేశాడు.

ఇంకా ఈ వైశంపాయనుడు మహాశ్వేతను చూసి మోహించి భూలోకంలోకి వచ్చాడు. ఆ మోహాన్ని తట్టుకోలేక చనిపోయాడు. ఆ తరువాత శుకనాసుని కొడుకుగా జన్మించాడు. ఇతనే చంద్రాపీడుడితో వేటకు వెళతాడు.

అక్కడ చంద్రాపీడుడు రాజ్యానికి వెళ్ళాక అనుకోకుండా మహాశ్వేతని కాముక దృష్టితో చూస్తాడు. ఆమె ఇతణ్ణి చిలుకవై పుట్టమని శపిస్తుంది. ఆ శాపం చేత చిలుకగా పుట్టాడు వైశంపాయనుడు. జాబాలి ఆశ్రమంలో ఉండి అక్కడ తన కథ అంతా చెప్పాక పూర్వస్మృతి కలిగింది. మహాశ్వేతని చూడాలనిపించి బయలుదేరాడు వైశంపాయనుడు.

ఎగరలేక ఎగరలేక వెళుతూ ఉంటే మధ్యలోపడిపోయాడు వైశంపాయనుడనే చిలుక.

ఒక బోయవాడు మళ్ళీ ఈ చిలుకను తన ఏలికకిచ్చాడు. ఆమే ఆడి తల్లి. ఆప్యాయంగా చిలుకరూపంలో ఉన్న కొడుకుని ఆదరించి ఆహారం పెడుతుంది.

మహారాజా! తరువాత ఇక చెప్పేదేముంది. నేను మెల్లిగా నీ దగ్గరకు చేరాను. నిన్ను చూస్తూంటే నాకు చాలా సంతోషంగా ఉంది.

శాపం పూర్తి కాగానే వైశంపాయను డవుతాడు. మహాశ్వేతను వివాహం చేసుకుంటాడు.

బాణుడి పాత్రలు ఎన్నో జన్మ జన్మాల సంస్కారం ఉన్నవిగా ఉంటాయి.

(వైశంపాయనుడి పాత్రలో బాణుడు జీవించి ఉన్నాడని చెప్ప డమే ప్రధాన లక్ష్యంగా తీసుకున్నాను. తదితరాలు తగ్గించేశాను.)

## : మ హా శ్వే త :

ఉజ్జయినీ రాజ్యాన్ని తారాపీడు డనే రాజు పరిపాలిస్తూ ఉండే వాడు.

శుకనాసుడు, అతని మంత్రి వీళ్ళిద్దరికీ కూడ ఎంతోకాలం వరకూ పిల్లలు లేకపోయారు.

పసిపిల్లల కోసం పరితపించగా పరితపించగా ఎంతకాలానికో వీళ్ళ కోరిక నెరవేరింది.

రాజు తన కొడుక్కి చంద్రాపీడుడని పేరు పెట్టాడు. మంత్రి వైశంపాయను డని పేరు పెట్టాడు పిల్లవాడికి. ఇద్దరికీ ఒక దగ్గరే విద్యాభ్యాసానికి ఏర్పాట్లు చేశారు.

చదివి మరచిపోయిన విద్యల్లాగ వాళ్ళకి అన్ని విద్యలూ అలా అలా క్షణాలమీదే వచ్చేశాయి.

విద్య ముగించాక తారాపీడుడు ఇంద్రాయుధం అనే గుఱ్ఱాన్ని ఎక్కి రమ్మనమని పంపాడు.

అది యెక్కి ఇంటికి వచ్చారు—రాజ మంత్రి కొడుకులిద్దరూ. యువరాజ్య పట్టాభిషేకం ప్రకటించాడు—రాజు. వైభవోపేతంగా జరిగింది పట్టాభిషేకం. అంతకుముందు శుకనాసుడు రాకుమారుడికి మంచి నీతి ఉపదేశిస్తాడు.

తారాపీడుడు కొడుకు పట్టాభిషిక్తుడయాక చాలా సంతోషించాడు. కొడుకుని పిలిపించాడు.

చంద్రాపీడుడు వచ్చి చేతులు జోడించాడు తండ్రి ఎదుట.

తండ్రి : నాయనా! చంద్రాపీడా, వచ్చావా! పట్టాభిషేకం అయాక మన సాంప్రదాయాలు కొన్ని ఉన్నాయి బాబూ !

చం : అవి ఏమిటో చెప్పండి నాన్నగారూ- వాటిని నిర్వర్తించడంకంటె నాకుమాత్రం కావలసిం దేముంది ?

తండ్రి : నాయనా! దిగ్విజయ యాత్ర- జైత్రయాత్రకు వెళ్ళాలి. నిన్ను చూడందే నేను ఎలా ఉండగలను! అదే బాధగా ఉంది. పూర్వం ఆచారాలు మానలేను. నువ్వు కష్టపడితే చూడలేను.

చంద్రా : అలా అనుకుంటే ఎలా! రాజధర్మం నడిపించ వలసినవి నడిపించాలిగా. సందేహించక చెప్పండి జైత్రయాత్రైనా- ఇంకా ఏమైనా.

తా : మరేంలేదు. అంతే జైత్రయాత్ర అంటే అంతలేలికైన పనా రాజలోకాన్నంతటినీ జయించడం అంటే మాటలా! సమయానికి

నిద్రాహారా లుండవు వేడుకకి వెళ్ళడమూ బంతి ఆట లాంటిది కాదుగదా.

చం : అయితే నేనంత చేతకానివాణ్ణా? అలా అయితే ఈ రాజ్యపరిపాలనా పట్టాభిషేకానికే అనర్హుణ్ణి అవుతాను. అలా ఏం సందేహించకండి. ఆశీర్వదించి పంపండి.

తా : అబ్బే! నువ్వు, చేతకానివాడివని అనడంలేదు నాయనా. నేనూ మీ అమ్మా, నిన్ను చూసుకోందే ఉండగలమా! అనే ఆలోచనా ఆవేదనా - నీ ఉత్సాహం సమర్థతా మాకు తెలుసు. అందుకేం సందేహించడం లేదు.

చం : అయితే అన్నీ సన్నద్ధం చేయించండి. నేనూ వైశంపాయనుడూ ఇద్దరం వెళితే తొందరగా యాత్ర ముగించుకు వచ్చేస్తాం—మీరు మాకోసం బెంగపెట్టుకు కూచుంటే మాకు దేశ పర్యటనా, ప్రపంచ జ్ఞానం ఎలా వస్తాయి, చెప్పండి!—వెనుకాడకండి పంపండి.

ఒక మంచి ముహూర్తంలో తగినంత సేనతో ప్రయాణ సన్నాహాలన్నీ చేయించాడు తారాపీడుడు. చంద్రాపీడుడూ వైశంపాయనుడూ చాలా సంతోషంగానే బయలుదేరారు జైత్రయాత్రకి.

శుభ శకునా లన్నీ చూసుకుని బయల్దేరారు. మంగళధ్వనులు మ్రోగుతూ ఉంటే పురంధ్రులు వాళ్ళమీద అక్షతలు జల్లి ఆశీర్వదించారు.

వీళ్ళు ఏ దిక్కుగా వెళ్ళినా అక్కడ రాజులు ధన కనక వస్తు వాహనాలు కానుకలుగా ఇచ్చారు. తలలు వంచారు. ఎదురు తిరిగిన శత్రువులు ఎక్కడా లేనేలేరు. వీళ్ళకీ, సైన్యానికీ, కత్తులకీ కావలసినంత విశ్రాంతి లభించింది.

దేశం నలు మూలలా చాలా హాయిగా పెళ్ళివారిలా వీరు పర్యటన సాగిస్తున్నారు.

ఇలా వెళ్ళగా వెళ్ళగా ఒక దగ్గర చాలా అలసిపోయి వీరు విశ్రమించారు.

మర్నాడు సూర్యోదయాత్పూర్వం మంగళవాయిద్యాలతో మేలుకున్నారు.

కొంచెం పొద్దు ఎక్కంగానే పరివారంతో చంద్రాపీడ వైశంపాయనులు బయలుదేరారు.

ఎదిరించే రాజలోకం లేకపోయాక ఇక అడ్డం ఏముంది? మహా సంతోషంగా సాగుతోంది, ప్రయాణం.

చంద్రాపీడుడి గుఱ్ఱం చాలా త్వరగా పోతుంది. దాని పేరుకి తగ్గట్టు—పేరు ఇంద్రాయుధం—అలా వెళ్ళగా వెళ్ళగా ఒక చక్కని కిన్నర మిధుననాన్ని చూశాడు రాజకుమారుడు. అలాంటివాళ్ళని ఇది వరకు చూడలేదేమో, అందులోనూ ఇంకా చిన్నతనం కూడా కదా! అందుకని దాన్ని వెంబడించాడు. అది కనపడ్డట్టే కనపడ్డం దగ్గరకు వచ్చేసరికి చాలాదూరంగా పోవడం, ఇదంతా మాయలేడి తంతులా అనిపించింది. చివరకి, చంద్రాపీడుడు ఏమైనాసరే ఈ సంగతి తెలుసుకోవాలనే నిశ్చయించాడు—వెనుదీయలేదు. వెన్నాడ్డం మానలేదు. ఓపికపట్టి ఇంకా కొంత దూరం గమనం సాగించేసరికి మరి కనపడకుండా ఆ మిధునం అదృశ్యమైంది. 'అయ్యో! ఇంతాచేస్తే కనపడలేదే' అని నిస్పృహతో నెమ్మదిగా నడక సాగించాడు. తనకీ గుఱ్ఱానికీ కూడా చెప్పలేనంత దాహంగానూ చాలా అలసటగానూ ఉంది. ఎండలో తిరిగి

తిరిగి ఉన్నారేమో ఎక్కడా తోవ తెన్నూకూడా తెలియడం లేదు. ఏ దిక్కుగా పోతే ఇన్ని మంచినీళ్లూ ,చల్లని నీడా దొరుకుతుందా? అని తహతహలాడాడు. గమనం సాగిస్తున్నాడు.

ఇతని అలసట చూసి వాయుమూర్తికి జాలి అనిపించి నీటిమీద గాలిని తీసుకువచ్చి అతనికి వీస్తున్నాడా? అన్నట్లు సన్నని తుషార తుంపరలతో చల్లనిగాలి వీచి ఇతడికి ఎంతో సంతోషాన్ని కలిగించింది.

అలా పిల్లగాలులు ఆహ్వానిస్తున్నవైపే ఇతడు ప్రయాణం సాగిస్తున్నాడు. నడుస్తున్నకొద్దీ చల్లదనం ఎక్కువౌతోంది. ఏదిగా దగ్గర్లో ఒక పెద్ద సరస్సు ఉండి తీరాలని నిర్ధారణ చేసుకున్నాడు.

అనుకున్నట్టు పెద్ద చెఱువు కనిపించింది. ఒక పెద్ద పాల సముద్రపు తునకలా ఉంది, దాన్ని చూస్తేనే అలసట తీరింది. అతడికి అమ్మయ్య! అనుకున్నాడు—తన గుఱ్ఱాన్ని అందులోకి తీసుకువెళ్ళాడు ఒతనూ తృప్తితీరా ఇన్ని నీళ్ళు తాగాడు, కాళ్ళూ, మొహం హాయిగా కడుక్కున్నాడు ప్రాణం లేచివచ్చినట్టనిపించింది.

తన గుఱ్ఱాన్ని చేత్తో ఎంతో అభిమానంతో తట్టాడు. ఆ ఆప్యాయతకి అది ఇంతవరకూ పడ్డ కష్టం అంతా మరిచిపోయింది. చాలా హాయిగా ఉంది. గుఱ్ఱం తనూ అలా సేదదీరాక ఒక చల్లని చెట్టునీడలో విశ్రమించారు. ఆ చెట్టునీడని, ఆ చల్లని గాలికి, చెఱుకు రసంలా ఉన్న ఆ మంచినీళ్ళకీ, ప్రాణంతో హాయిగా ఉన్నారు.

చంద్రాపీడుడికి చిన్న మాగన్ను పట్టినట్టుంది. ఇంతలో కొంత దూరంనుంచి వీణానాదం వినిపిస్తోంది. ఇంద్రాయుధం కూడా ఆ సంగీతానికి ఆనందంతో అదే మొహం యెత్తి వింటూ చూస్తూంది. రాకుమారుడు కూడా ఆ సంగీత మాధుర్యానికి కరిగిపోయాడు. అప్రయత్నం

గానే ఆ వైపు నడిచాడు. సంగీతంలో ఉన్న మాధుర్యమే ఇతని హృద యాన్నీ ఇతన్నీ కూడా అక్కడకు లాక్కువెళ్ళింది.

అది ఒక చక్కని శివాలయం. మంచి ప్రశాంతంగా ఉంది. ఎంతటి అశాంతినైనా దూరం చేసేశక్తి ఆ ఆలయానికే ఉందనిపిస్తూంది.

ఆ దేవుడికి అప్పుడే ధూప దీప నైవేద్యాలతో పూజ జరిపినట్లు స్పష్టంగా తెలుస్తూ ది.

ఆ విగ్రహానికి ఎదురుగా ఒక స్త్రీ వీణావాయిద్యంలో తన్మ యత్వాన్ని చె దుతూ ఉ.ది.

తమ్మి చూలి, వె డికొ డ, మంచుకొండ, చలువరాతి తిన్నె, పాలసముద్రము, కామధేనువు, ఐరావతము, హంసలు, కొంగలు, ఏనుగు దంతము, చమరీ మృగములు, చామరములు, నందీశ్వరుడు, కు దేళ్లు, పాము కుబుసము, తెల్లనాగు ముత్యాలూ, శంఖాలూ, శర శ్చంద్రిక, తెల్లదేవ కా చనములు, మల్లెలు, మొల్లలు, జాజులు, విర జాజులు, తెల్ల గులాబులు, లిల్లీలు, తెల్ల డిశంబరు పూవులు, మ చి గంధము, కర్పూరము, కలువలు, నందివర్ధనములు, వత్తి, సీమ సున్న, స్ఫటికము, విభూది, శిలాజిత్తు, వెన్న, పెరుగు, తెల్లపట్టు వస్త్రములు, ఇలా సృష్టిలో ఉన్న దిల్లతనాన్న తా ఒక్క దగ్గిరకు కూర్చి బొమ్మనిచేసి ప్రాణం పోశాడా! అన్నంత తెల్లగా ఉంది ఆపెడ.

తెలదామర రేకుల్లా అతి విశాలమైన నేత్రాలు ఆమెవి! తెల్లని వస్త్రాలు ధరించింది. దంతపుబొమ్మ, చలువరాతినేల. అక్కడ అంతా తెలుపే, తెల్లరంగు పవిత్రతకు చిహ్నం. స్ఫటిక పూసల జపమాల

అక్కడ ఉంది. శివుణ్ణి భక్తి పారవశ్యంతో, మంచి తారస్థాయిలో, కీర్తించి, కీర్తించి అలసి వీణ కింద పెట్టి, మరొక్కసారి శివుడివైపు ఏకాగ్రతతో చూసింది. కన్నీటి తెరలు కమ్మాయి. చిరుచెమటలు పట్టాయి. అలా కొంతసేపు ఉన్నాక మన చంద్రాపీడుణ్ని చూసింది. ఎవరా! ఇతను అని అనుకుని ఎవరైనా, నా ఆశ్రమానికి వచ్చిన వాళ్ళు వందనీయులే-అని నిశ్చయించి సాదరంగా నమస్కారం చేసి లోపలకు ఆహ్వానించింది.

అతడూ ప్రతి నమస్కారం చేశాడు. నమ్రతతో లోనికివెళ్ళి భక్తితో పరమశివుడికి నమస్కారం చేశాడు.

మహాశ్వేత : "మంచి ఎండలో వచ్చారు. చాల అలసినట్లు కనిపిస్తున్నారు. దగ్గరలో నా ఆశ్రమం ఉంది అక్కడ విశ్రాంతి తీసుకుందురుగాని రండి"అని అభిమానంగా ఆహ్వానించింది.

చం : "సరే అలాగే పదండి" అంటూ ఆవిడను అనుసరించాడు.

మహా : ఒక భిక్షాపాత్రను తీసికొని చెట్టదగ్గరకు వెళ్ళింది. ఆ చెట్లన్నీ ఆవిడ పాత్రలో బాగా పండిన పండ్లు ఉంచాయి. అవి తెచ్చింది. అతడికి అర్ఘ్య పాద్యాదు లిచ్చింది ఈ పండ్లిచ్చి అతిథి సత్కారం చేసింది.

వాటిని అతడు ఎంతో ఇష్టంగా తీసుకున్నాడు. ఆ తరువాత కొంత విశ్రాంతి తీసుకుని ఆవిడని ఒకసారి సాదర గౌరవాలతో చూసి ఇలా అడిగాడు.

చం : "అమ్మా మీ రెవరు? తల్లి దండ్రు లెవరు?" ఈ ప్రాయంలో ఈ కఠోర తపస్సేమిటి? ఇంతటి వైరాగ్యం మీకు ఎలా సాధ్యం

హేతువు ఎంతో దయగా అడిగారు. ఎవరు ఎలా పోతే ఎవరి క్కావాలి! తోడి మానవుల కష్టసుఖాల్ని అడిగి పాలు పంచుకుందామనే సహృదయత ఎంతమంది కుంటుంది? నీ యీ అభిమానం చూస్తుంటే నీ మీద ఎందుకనో నాకు ఎనలేని గౌరవాదరాలు కల్గుతున్నాయి.

చంద్రా : ధన్యుణ్ణి! అమ్మా ధన్యుణ్ని. నన్ను మీ ఆత్మీయుడుగా అంగీకరించినారు. అదే చాలా సంతోషంగా ఉంది.

మహా : కష్టాల్లో పాలువంచుకొనేవాళ్ళే దొరకడం కష్టం. సుఖాల్లో అంటావా! పాలుపంచుకున్నా పంచుకోకపోయినా బాధలేదు.

చంద్రా : మీ ఈ తాపసిక వృత్తి చూస్తుంటే నా మనస్సు యెంతో తరుక్కుపోతూంది. దుఃఖభారం కొంత మీకు తగ్గించాలనే ఉద్దేశ్యం. అందుకే అడిగాను.

మహా : నేనూ ఇలా అడిగినందుకు చాలా సంతోషిస్తున్నాను నాయనా! మనిషినుంచి మనిషి కోరేదికూడా ప్రపంచంలో, ఆత్మీయత, ఆప్యాయత కర్మానుగుణ్యమైన కష్టాలూ దైవదత్తమైన బాధలూ పోటికి యెప్పుడూ యెవరూ ఏమీ చేయలేరు.

చంద్రా : మనం చెయ్యగలిగిందేముంది. అంతా ఆ మహేశ్వరుడి చిత్తం. ఇక్కడ ఒక్కరే ఉంటున్నారా?

మహా- ఏం చేస్తాం నాయనా! ప్రపంచంలోకి ఒక్కళ్ళమే వచ్చాం. మళ్ళీ ఒక్కళ్ళమే వెళతాం పుట్టుకా ఒక్కళ్ళయి వెళ్ళడం ఒక్కళ్ళం

అయినప్పుడు ఉండటం ఒక్కళ్ళం అనుకుని బాధపడడందేనికి?
నువ్వే చెప్పు?

చంద్రా - నిజమే అయినా సృష్టిలో ప్రాణికోట్లు పశుపక్ష్యాదుల దగ్గర నుంచీ తమవి అని కొన్ని పరిధు లేర్పరచుకుంటూ ఉంటాయి గదా! మానవుడు ఏర్పరచు కోవడంలో తప్పేం దంటారా!

మహా- తప్పని అనలేను గాని అంత తప్పనిసరి కాదనుకుంటాను- సరే- మా నాన్నగారు హంసుడు, తల్లి పేరు గౌరి- మాది గంధర్వ వంశం. ఈ సరస్సు పేరు అచ్ఛోదన సరస్సు-- పీటిని మా నాన్నగారే కట్టించారు.

చంద్రా - ఈ సరస్సూ ఈ దేవాలయం ఉన్నాయని మీరు తపోదీక్ష తీసుకున్నారా!

మహా- చిన్న మందహాసంతో, ఉహు కాదు. తగినంత కారణం లేందే మనుషులు అంత తేలికగా తపోవేషాల్లోకి వస్తారా! అలావస్తే అది కేవలం వేషం మాత్రమే అవుతుంది. యదార్థం కాదుకద. మా అమ్మగారూ నేనూ రోజూ ఈ అచ్ఛోదన సరస్సుకి వస్తూ ఉంటాము. ఈ సరస్సులో స్నానం చేసి ఈ దేవుణ్ని చూసుకు వెళుతూ ఉంటాము.

ఒకనాడు మామూలుగా వచ్చాము. మా అమ్మగారు స్నానానికి వెళ్లారు. ఆ సమయానికి పుండరీకుడూ, అతని మిత్రుడు కపింజలుడూ ఇక్కడకు వచ్చారు. పుండరీకుడు నిజంగా పుండరీకంలాగే ఉన్నాడు. చాలా బాగున్నాడు. చెవిలో మంచి దేవపారిజాత పుష్పాలు పెట్టుకున్నాడు. అతని చేతిలో జపమాల

ఉంది. నాకూ అతన్ని చూస్తే చాలా సంతోషం అనిపించింది. అతడూ మేం ఉన్నదగ్గిరికే వచ్చాడు. ఈ దేవపారిజాతాలు చాలా బాగున్నాయి అన్నాను. అతడు అయితే తీసుకో అని తలలో పెట్టాడు. మంచి మనస్సు-సున్నితం అయిన ఆకారం శాలిన్యం అయిన కంఠం చక్కని కనుముక్కు తీరు, అందం అయిన కురులు. అతణ్ని అలా అలా చూడాలనే అనిపించింది. ఎంతసేపయిందో కూడా తెలియలేదు. అతనిచేతిలో జపమాల నన్ను చూస్తుంటే చెయిజారి పడిపోయింది. దాన్ని పడకు డా చేత్తో పట్టుకున్నాను. నా ముత్యాలహారం అతనికి ఇచ్చేశాను. నా చెలికత్తె తరళిక అని ఉంది. అది వచ్చి అమ్మగారు స్నానం చేసి వచ్చేశారమ్మా అంది. అది నా చెవిని పడలేదు. కాని ఎలాగో లేవక తప్పలేదు.

మెల్లిగా అమ్మా నేనూ ఇంటికి వెళ్లాము. కాని నాకు ఏమీ తోచలేదు. కాలుకాలిన పిల్లిలా ఇల్లంతా అట. గంతిరి గేశాను. నా మనస్సు మాత్రం ఈ సరస్సుదగ్గరే అంటే సరస్సు దగ్గిరిగా ఉన్న పు డరీకుడి దగ్గర అన్నమాట? అన్నం నీళ్లూ అ డే అసహ్యం అనిపించింది ఆ జపమాల చూస్తూ ఉండాల నిపించింది. మా తరళిక నా దగ్గరకు వచ్చింది. ఏవిటే విశేషాలు అని అడిగాను.

తర - చిరునవ్వుతో అమ్మా మీరు వచ్చాక ఆ అబ్బాయిగారి స్నేహితుడు కపింజలుడు నా దగ్గరకు వచ్చాడు. మీ సంగతి అడిగాడు. ఆ పుండరీకుడి తల్లి లక్ష్మి అట. తండ్రి శ్వేతకేతువట. లక్ష్మి ఇతణ్ని ఒక దృష్టితో చూసిందట అందుచేత ఆ తామరలోనే కొడుకు పుట్టాడు. ఆ పిల్లవాణ్ని మహర్షి కిచ్చేసింది పీడు

నీ కొడుకే తీసుకోమంది. మహర్షి ఆ బాలుణ్ని తీసుకుని పెం
చాడు. తెలతామరలో దొరికాడు కనక పుండరీకుడని పేరు
పెట్టాడు. మహర్షి అన్ని విద్యలూ నేర్పించాడు. ఇవాళ మాస
శివరాత్రి. శివదర్శనం చేసుకోందుకు వచ్చారు అని చెపుతూంటే
నా కెంతో సంతోషం అనిపించింది. ఇతా ఉండగా సాయం
కాలం కావచ్చింది. కపింజలుడు చాలా ఆత్రంగా వచ్చాడు.
లోపలికి అతడు వచ్చినట్లు కబురు వచ్చింది. వేగంగా లోప
లకు రమ్మన్నాను. జంకుతూ వచ్చాడు. జపమాల తెమ్మంటే
వచ్చాను అన్నాడు. ఇంకా విశేషాలు ఏమిటి? ఏం చెప్పమన్నా
వమ్మా. నిన్ను చూసిందగ్గర నించీ వాడికి మోహం చెప్ప
లేనంత ఎక్కువైంది. నీ చదువంతా ఏ గంగలో కలిసిందిరా?
అంటే మాట్లాడు ఉలకడు పలకడు. నాకు నీతులు చెప్పకు
ఆవిడకు చెప్పు నా సంగతి అంటాడు. చాలా బాధపడుతున్నాడు.
చెట్లకింద కూచుంటాడు. తినడు, తాగడు. నీ మీద ఒకటే
ధ్యాస. ఏం చెయ్యమంటావు? నువ్వు ఈ జపమాల తెచ్చినం
దుకు కసురుకుంటాడు. అతనికి చేసిన శీతలోపచారాలు అన్నీ
ఇంకొంచం బాధిస్తున్నాయేగాని తగ్గించడం లేదు. మహాశ్వేతకు
ఈ స్థితి గట్టిగా చెప్పు. లేకపోతే ప్రాణం పోతుందని వేగం
వెళ్లి చెప్పేసి ఆ జపమాల తే అని పంపాడు. నీకు పుణ్యం
ఉంటుంది. మా స్నేహితుణ్ని ఎలాగైనా కాపాడు అని చెపుతూ
ఉండగానే మా అమ్మగారు వస్తున్నారని కబురు వచ్చింది. అది
విని వెళ్లిపోయాడు కపింజలుడు.

మా అమ్మ కొంచెంసేపు మాట్లాడి వెళ్లిపోయింది. నేనూ తర
ళికా ఉన్నాం, 'తరళికా విన్నావా? అప్పటికి నాపై అంత

ప్రేమ ఉన్నందుకు సంతోషమే అనుకో అయితే ఆ విషయం అమ్మకూ వాళ్లకూ చెప్పడం ఎలా? అయిన కుటుంబంలో పుట్టి అమ్మా నాన్నా అనుమతి లేకుండా ఇంట్లోంచి వెళ్లడం ఆ జే ఎంత బాధాకరం? పోనీ ఉపేక్షిద్దామా అంటె అతని ప్రాణరక్షణ ఎలా? పొద్దున్న చూశావా అతని చెవుల్లో ఉన్న పువ్వులు ఎంత బాగున్నాయో. అతడు దగ్గరకు వచ్చి ఎన్నాళ్లనుంచో మహా పరిచయం ఉన్నవాడిలాగ ఎంత అనురాగంగా మాట్లాడాడు. అతని చూపులో అతని చేతలో అతని మాటలో ఎన్నెన్ని జన్మల ఆత్మీయతో ఉన్నట్లుగా అనిపించింది. అది ఎడములేని విడదీయని అనుభూతుల పరంపర పెనవేసుకుందా! అన్నట్టుంది. కపింజలుడు ఇందాక చెప్పాడు. అతని కళ్లంతా నీళ్లే, కపోలాలు అతడి కన్నీటి ధారలచేత ఉబ్బిపోయాయి అన్నాడు.

పెద్దవాళ్ల అనుమతితో కార్యక్రమం నడపాలంటే కాలవ్యవధి కాక తప్పదు. ఈ కట్టుదిట్టాల ఇక్కట్టులు దాటేదాకా అతడుంటాడా? అసలు మనిషి జీవిస్తే గద ఉన్న ఆలోచన!

తరళికా! మనస్సు తల్లడిల్లుతోంది నాకు నచ్చిన మెచ్చిన వరుణ్ని రక్షించుకోవాలంటె కాలు గడపదాటె తీరాలి. అసలతడు జీవించడ అంటూ ఉంటే ఈ జటిల సమస్యలన్నీ తృటిలో పటాపంచల మౌతాయి.

కనుక మనం మనోధైర్యాన్ని చిక్కబట్టి ఎట్టి ఇక్కట్టులనైనా ఎదుర్కోవాలి! అక్కడికి తొందరగా చేరాలి. వేగంగా ఆ ప్రయత్నం చెయ్యి.

అని వాళ్లిద్దరూ ధైర్యం అనే మెలుపుల సహాయంతో సాహసం అనే బాటలో ఉత్సాహం ఉరకలు వేస్తూ ఉంటే వాళ్ల నడకలు పరుగులు తీస్తూ ఉన్నాయి.

"విధి వైపరీత్యం ఎంతటి వారికైనా అనుల్లంఘనీయం కదూ!".

కన్ను పొడుచుకున్నా కనపడని కటిక చీకటి. తరళికా! ఎందుకో భయంగా ఉంది.

ధైర్యంగా ఉండకపోతే పనులు యెలా సాగుతాయి. 'ధైర్యే సాహసే లక్ష్మి' అన్నారు. కంగారు పడకండి.

'కంగారు పడకుండా మనస్సెలా ఉంటుంది. అసలే ఆందోళన దానికితోడు అబ్బా ఈ వెధవ కుడికన్ను అదేపనిగా అదిరిచస్తోంది. అమ్మ వాళ్లకి తెలియకుండా వస్తున్నాం గదా: ఎప్పుడూ ఆత్మసాక్షికి వ్యతిరేకమైన పనులు చెయ్యకపోవడంనుంచో ఏమో గుండె దడదడా కొట్టుకుంటూంది. అయినయి టి పిల్లని. అర్ధరాత్రివేళ అమ్మనాన్నల అనుమతి లేందే అరణ్యలోకి తా వలచినవాడి కోసం వచ్చేస్తే 'అబ్బా, లోకం అంతా నన్నెలా ఆడిపోసుకుంటుందో! మనుషుల తా ఒక నెలరోజుల పాటు నా మాటలే కథల్లా చెప్పుకుంటారేమో అని భయంగా ఉంది

"మీకు చెప్పే అవకాశం లేక కాని చెప్పకుండా చెయ్యాలన్న దురుద్దేశం లేదు కదా. ఎందుకలా కంగారు పడతారు. ఇలాంటి సమయాల్లో ఓర్పు ఎంతైనా అవసరం కనక నిదానంగా ప్రశాంతంగా పదండి. కష్టాలనే కడలి కెరటాలకి కదలిపోవడం కాపురుష లక్షణం" మేరు సమాన ధైర్యంతో ఎదుర్కోవడమే మేధావంతుల లక్షణం. నువ్వు విజ్ఞురాలివి. అలా హడలిపోవద్దు. ధైర్యం అనే గట్టి ఊతకర్రని పట్టకపోతే ఊగి ఊగి పడిపోతాం.

9)

మేకాకీ, కథమపరిచిత ఇవాఽదృష్ట పూర్వ ఇవ అద్యమామ్ ఏకపదే ఉత్సృజ్య ప్రియాసి కుతస్త్వేయమతి నిష్ఠురతా? కథయత్వద్భృతే క్వగఛామి కం యాచే కం శరణ ముపైమి అంధోస్మి సంవృత్తః శూన్యామేదిశోజాతాః నిరర్థకం జీవితం అప్రయోజనం తపః నిస్సుఖాశ్చ ...కాః కేన సహ పరిభ్రమామి? కమాలాపామి ఉత్తిష్ఠ దేహి మే విలపతః పతివచనం క్వ తన్మమోపరిసుహృత్ప్రేమః క్వహస్మిత పూర్వాభిలాషి ...చ ఇత్యేతాని చ అన్యానిచ విలపంతం కపింజల మశ్రేషమ్.

ఎంతపనైంది! మదన పిశాచమా! ఎంత దుర్మార్గానికి ఒడికట్టా వురా! ఓరీ పాపీ! ఓరీ నిర్దయుడా! ఎంత చేయరాని వని చేసికూచున్నా వురా! ఓసీ పాపాత్మురాలా! మహాశ్వేతా ఎంత దుర్మార్గురాలవే! నీ జాతి ఎంత నీతి లేనిదే! ఓరీ! చంద్రా! ఎంత చండాలుడివిరా! ఓరీ నిర్దయుడా ...క్కడకి పోయావురా! ఓ మందానిలమా! ఇపుడు నీ మనసు శాంతిం ...ందా! నీ కోరిక తీరిందా! ఇపుడు ఏం చెయ్యాలి? ఓ శ్వేతకేతూ: ఇంత ఘోరం జరిగిందని నీకు తెలియదా! ధర్మమా! తగలడిపోయావా? ...పస్సా! నీ కాశ్రయ మెక్కడ? సరస్వతీ! ఇంక నువ్వెక్కడ ఉంటావు! ...య్యో! నువ్వు లేకపోతే లోకం అంతా శూన్యంగా ఉందయ్యా! ఒక్క ...రి కళ్ళు విప్పి నీ స్నేహితుణి చూడవా? నువ్వు చూడకపోతే నేను ...డా నీతో వచ్చేస్తానయ్యా! నేనొక్కణ్ణీ నువ్వు లేందే ఒక్కక్షణమైనా ...క్కడ ఉండలేను. ఇలా పడుకున్నావే! ఎలాగయ్యా నన్ను ఇదివరకు ...డనివాడిలా అపరిచితుళ్ళా ఒక్కమాటే విడిచిపెట్టి వెళ్ళావా! ఇంత ...ఠిన్యం నీకు ఎలా వచ్చి పడింది? నిన్ను బతికించుకోవాలంటే ఎక్క ...డికి వెళ్ళను? ఎవర్ని అడగను? ఈ కళ్ళతో నిన్నుగాక ఎవర్ని చూడను? ... జీవితం నువ్వు లేకపోతే నిరర్థకం నిష్ప్రయోజనం! నేను ఎప్పుడు ఎవరితో తిరుగుతూ ఉంటాను? ఎవరితో హాయిగా మాట్లాడుకుంటాను?

నీ కపింజలుడు ఇంత ఏడుస్తున్నాడే ఒక్కసారి లేచి ప్రతిసమాధాన
ఇవ్వవా! నీ నీ స్నేహం అంతా ఏ గంగలో కలిసింది? చిరునవ్వుల
హాయిగా మాటాడేవాడివి ఆ మాటలన్నీ ఏమయాయి? అని ఈ విధంగ
ఇంకా ఎంతో విలపించాట్ట కపింజలుడు పుండరీకుడ్ని చూసి. ఈలోగా
తరళిక మహాశ్వేతలు ఎంతో గాభరాగా కంగారుతో వచ్చి వద్దారు
కపింజలుడి ఏడుపులో పాలు పంచుకోవడానికి వచ్చారా! అన్నట్టు.

కపింజలుడికి పుండరీకుడి మీద ఎంతటి మిత్రత్వం ఉంది
"విహారం శయ్యా ఆసన భోజనాదుల్లో" వాళ్ళు ఒకళ్ళని విడిచి ఒకళ
ఉండరు. కపింజలుడిదే లోకం పుండరీకుడికి. పుండరీకుడి మీదనే
ధ్యానం కపింజలుడికి. అంత ప్రగాఢమైన స్నేహం ఆ యిద్దరిదీనీ
మిత్రత్వం సాధారణంగా సమాన భావాలూ, సమాన ఆశయాలు ఉంటేనే
ఏర్పడుతుంది. ఆత్మకు సన్నిహితత్వం ఉంటేనే మానవులు స
హితులు కాగలరు. ఈ ధర్మాలన్నీ వీళ్ళ ఇద్దరికీ సమానంగా ఉన్నాయి
కనుకనే అంత ప్రగాఢ స్నేహం యేర్పడింది. సంపద ఉన్నప్పుడు
మాత్రం సన్నిహితంగా ఉండి అది లేనపుడు దూరం అయితే అది
నిజమైన మిత్రత్వం కాదు. సహ అధ్యయనులు సమవయస్కులు
సమాన భావాలు గలవాళ్ళు గనకనే అంతమంచి మిత్రత్వం ఏర్పడింది.
ప్రాణాన్ని ఇచ్చి అయినా మిత్రుణ్ణి రక్షించుకొనే వాళ్ళనే గదా ప్రాణ
మిత్రులంటారు. మన బాణుని కాదంబరిలో కపింజలుడు పాత్ర
కొంచెంగా కనిపించినా పుండరీకుడిపై ఇతనికున్న అభిమానం చెప్ప
లేనంత- పుండరీకుని ప్రాణం పోగానే మహాశ్వేతకంటె ఎక్కువగా
ఇతరులుకూడా కన్నీళ్ళు కార్చేలా విలపించాడు కపింజలుడు. ప్రాణం
పోయాక మనసారా విలపించే ఇంకో ప్రాణి ఉండడం కూడా అదృష్టమే

దా. మతి మహారణ్యమధ్యంలో అర్ధరాత్రివేళ అలా మృత్యువుకి పాల్పడితే ఇక వాడి దురదృష్టాని కేమనాలి. పుండరీకుడికి నిజమైన మిత్రరత్నం కపింజలుడు.

మహాశ్వేత వచ్చేవరకూ ఎంతో ప్రేమగా కాపాడాడు పుండరీకుడ్ని కపింజలుడు.

కపింజలుడు అల్లంతలో మహాశ్వేతను చూశాడు. ఇంకా దుఃఖం సముద్రంలా కట్టలు తెంచుకు ప్రవహిస్తోంది.

మదనతాప జ్వరంతో ఉన్నవాడిని కపింజలు డెన్నోవిధాల కాపాలనుకున్నాడు. ఆ ప్రయత్నాలన్నీ అక్కడ స్పష్టంగా కనిపిస్తున్నాయి. తామరాకులూ, మంచిగంధం తామర పూరేకులూ ఇంకా ఇంకా. పుండరీకుడు శిలాఫలకం మీద పడుకున్నవాడు పడుకున్నట్టే ఉన్నాడు. ముఖం అంతా వళ్ళంతా మంచిగంధం పూసే ఉంది. తామరాకుల్లో పడుకోపెట్టినట్టే ఉన్నాడు. బాధానివారణం అవడంచేత గట్టిగా కళ్ళు మూసుకు పడుకున్నాడా అన్నట్టున్నాడు. కళ్ళు బాగా ఉబ్బిన్నాయి. ఎక్కువగా ఏడవటంచేత బుగ్గల నిండా కన్నీటి చారికలు బాగా స్పష్టంగా కనిపిస్తున్నాయి. మనసా ఇక వేధించకు నువ్వుండు బాబూ! అన్నట్టు రెండు చేతులూ గుండెమీద చేర్చాడు. ప్రకృతినుండి సెలవు తీసుకుంటున్నాయి ఆ జోడించిన చేతులు రెండూ. చంద్ర మండలం ఇతడి ప్రాణం పోయినవైపు నోరు తెరుచుకు చూస్తోందా అన్నట్టుంది.

ఇలాంటి పుండరీకుడిని చూడవలసి వస్తుందని కల్లోకూడా అనుకోలేదు మహాశ్వేత.

ఆ దృశ్యం చూడ్డం ఏమిటి విసురుగా ఉసూరుమని అతడి గుం
మీద వాలడం ఏమిటి. అంతా క్షణాల్లో జరిగింది. "పుండరీకా! ఇ
నిజమా! కలా! నీ శ్వేతని వచ్చా ఒక్కసారి కళ్ళు తెరవ్వా-అయో
ఏవీ నీ సుకుమారమైన చేతులూ ఈ చేతులు నన్ను గగనవీథుల్లో విహ
రింప చేస్తాయని ఎంతగా ఊహించానో నీకు తెలియదు కదా! నాఊ-
లన్నీ ఉప్పెనలా ఉప్పు సముద్రంలో కలిసిపోయాయా! దేవపారిజా-
పూవులతో ఎంతో, నిగనిగలాడే, నీ చెక్కిళ్ళ సౌరు ఈ తీరుగా నీ-
గారిందా! ప్రతీ మాటా తేనె ముంచి మాట్లాడుతున్నావా! అన్నట్టుండే
ఆ తీయని మాటలన్నీ ఏమైపోయాయి. ఇక నన్ను లాలిస్తావనే చెయ్యి
కదలకుండా ఉండిపోతే చూసి ఎలా భరించమన్నావు? అనురాగమనే
అమృతభాండం లాంటి నీ గుండె వట్టి కుండగా అయిపోయిందా
అయ్యో! పుండరీకా ఇక నీ నిండైన నవ్వు మొహాన్ని మరి చూడలేనా
ఓ ప్రకృతీ!- ఓ దేవతల్లారా!- ఓ పంచభూతాల్లారా!- ఓ సూర్య చంద్రు
ల్లారా! - ఓ పార్వతీపరమేశ్వరుల్లారా! - ఓ సీతారాముల్లారా! - ఓ రా
కృష్ణుల్లారా! మీరంతా ఇంత దురంతం జరిగితే ఏం చేస్తున్నారర్రా.
ఇతణ్ణి ఇప్పుడు మీరు బతికించకపోతే ఇక మీ దేవతాత్వం ఎందుకూ!
తగలెయ్యనా? - ఈ స్థితిలో నా ప్రాణానికి ప్రాణం అయిన పుండరీకుణ్ణి
చూసి ఇంకా ఎలా ఉండిపోయానని నా మీద మీ కందరికీ పగగా ఉందా!
ఓ మృత్యుదేవతా! 'దెయ్యం కంటికి పేలగింజలా' నీ కంటికి నా పుండరీ
కుడే కనిపించాడా? కనిపిస్తే పోనీ ఆ చేత్తో నన్నుకూడా తినెయ్యక
పోయావా? పుండరీకుడు లేని మహాశ్వేత ఎలా బతుకుతుందని అను
కుంటున్నావే మృత్యుదేవతా! - నీ కళ్ళకి, మంచి, చక్కనివాళ్లూ,
ప్రాయంలో ఉన్నవాళ్ళూ, అనురాగ జలధిలో, ఆనందంగా కాలం
గడిపేవాళ్ళూ, కనిపిస్తారు - పాపం నువ్వు వాళ్లని కసితీరా పొట్టన
పెట్టేసుకుంటావ్. ఛ, నీ పని ఏంవని చెప్పు - అవును నువ్వు నా కెం

-'కు కనిపిస్తావ్? పాపం నీకు స్త్రీ జాతి అంటే ప్రేమ. అందుకనే
గ్గిరకు రాకుండా తప్పించుకుని తిరుగుతావ్ - మగవాళ్ళంటె ద్వేషమో
మో వాళ్ళని ఇక ఆలోచించకుండా గమ్మున మింగి కూచుంటావ్ -
ఆటలు నా దగ్గిర సాగవులే - అయ్యో తరళికా! ఎంతపని అయిందే!
మొహం ఎలా చూడనే - అని గట్టిగా అపుకుని బోరున ఏడ్చి ఏడ్చి
ంతు రాలు పడేలాగ ఏడ్చి స్పృహతప్పి పడిపోయింది. తరళిక వరు
లు తీసి నీళ్ళు తెచ్చి చల్లి సేదదీర్చింది. మెల్లిగా మెలకువ వచ్చింది.
అమ్మా ఊరుకో అలా అనడానికి కూడా నోరు రావడం లేదు - ఏమి
పం వచ్చిపడిందో నిన్ను చూడలేక పోతున్నాను. నా మాట విను -
మ్మా నాన్నా ఏమైపోతారు? కొంచం స్థిమితపడ్డానికి ప్రయత్నిం
మ్మా - నా మాట విను - ఆ మాటలు శ్వేతకి పదునైన ములుకుల్లా
న్నాయి. తరళికా! ఏం మాటలు అంటున్నావే - లోకంలో నాకు ఎవ
రైనా పుండరీకుడి తరవాతగదా, ఇలాంటి మాటలు చెప్పకు కపింజలు
తో ఎలా చెప్పి పంపాడో ఇతడి వాక్యాలు విన్నావుగదా ఇలా నువ్వు
లా మాట్లాడుతున్నావో చెప్పు. మరేం మాటాడకు. చూడు తొందరగా
తి పేర్చే ఏర్పాటు చేసేసెయ్యి - నా మీద నీకున్న ప్రేమ తెలుసు -
వం కఠినమైన ఆజ్ఞ ఇది. నువ్వు నెరవేర్చడం కష్టం గదా. పోతే
చితి పుండరీకుడి చితి నా చేత్తో నేనే పేరుస్తాను. ఇక నా పుండరీకుడికి
నింతకంటె చేసేదేముంది - ఆఖరుగా ఈ మాత్రం చెయ్యకపోతే ఎలా?
న్ను ఈ పనిమాత్రం చెయ్యమనే భగవంతుడి ఆదేశం! ఏం చేస్తాం -
టూంటే తరళిక ఏమీ అనలేక చెయ్యలేక ఓదార్చలేక ఎటూ తోచక
చాలా బాధపడుతూ ఉంటుంది. నెత్తీ నోరూ కొట్టుకుంటూ పుండరీకుణ్ణి
దుపుతూ మాటాడే ఓపికలేక ఏడుపును ఆపలేక వెక్కిళ్లతో వెక్కివెక్కి
యేడ్చే శ్వేతను ఎలా ఓదార్చాలో తెలియక తరళిక తలకిందులవు
తోంది.

శ్వేత ముఖం తిరిగి స్పృహతప్పి ఆ రాతినుంచి పడిపోతూ ఉం చంద్రాపీడుడు చెయ్యి అడ్డంచాపి పడకుండా చూశాడు. చల్లని నీ తెచ్చి మొఖాన బాగా జల్లాడు - విసరడానికి ఏమీలేక పమిటచెంగుతో మెల్లగా విసిరాడు. కొంతసేపటికి సేదదీరింది. కళ్లువిప్పి చూచిం చంద్రాపీడుడి ముఖంకూడా ఎఱ్ఱగా కందగడ్డలా కంది ఉంది. చె చెమటలూ కన్నీరు స్పష్టంగా కనిపిస్తూ ఉంది. తనబాధలో ఇంత పా పంచుకున్న ప్రాణిని మహాశ్వేత ఇంతవరకూ చూడలేదు. అతణ్ణి చూస్తే ఎంత బాధ పెట్టానో అని తపించింది.

చంద్రా - నిన్ను చాలా కష్టపెట్టేశాను. వెనుకటికథ అడిగి-క్షమిం అమ్మా! ఇక ఈ కథ వినలేను. నరాలు పట్టుతప్పుతున్నాం గుండె సముద్రం అవుతూంది. మహా క్షోభిస్తూంది మన ఇక చాలమ్మా ఇక చెప్పవద్దు - అబ్బా - ఎంతబాధ ఏం గా కాసేపటికి ఇదంతా మరిస్తే అయినా, తెప్పరిల్లుతావు అన్నా

మహా - అయ్యో! అంత ఘోరం చూడగా లేంది అనుభవించగా లే ఇక చెప్పడానికేమయ్యా! ఇంకా విను పూర్తిగా చెప్పందే నా తోచదుగా. అలా తరళిక చితి పేర్చే ప్రయత్నం చేస్తూ ఉం ఎంత విచిత్రం జరిగిందో తెలుసా.

చం - ఇంకా ఏం విచిత్రం కష్టగాథ అయితే మాత్రం మరి వినలే మనస్సు మహా చెదిరిపోయింది. మహాశ్వేతా - మరి నీ కథ నమస్కారం తల్లీ ఇక అపుదుః బాబ్బాబు.

మహా - నువ్వు వినలేనంతటి కష్టగాథ చెప్పాను, కన్నీళ్ళు కార్పించా నిజమే - కాని విచిత్రం అంత నీకు కష్టం కనిపించదు ముందు నేను చెప్పబోయేది. ఆకాశంలోంచి పట్టుబట్టలు క

కున్నాడు. భుజకీర్తులు ధరించాడు. నిండుగా అలంకరించు కున్నాడు ముఖం కళకళ లాడుతూంది. కిందకి దిగి వచ్చేసి పుండరీకుణ్ని రెండు చేతులా జాగ్రత్తగా ఎత్తిపట్టుకుని పోతూ పోతూ - అమ్మా! మహాశ్వేతా - ఏడవకు ఏ దురంతం చెయ్యకు. ఇతడు మళ్ళీ పునర్జీవితు డవుతాడు. సంతోషంగా వీణ్ని కలుసుకుంటావు. నా మాట నమ్ము, ప్రాణం మాత్రం విడిచి పెట్టకు ఇతడు తిరిగి జీవించేదాకా ఏ దారుణం చెయ్యకమ్మా! అంటూ తీసుకువెళ్ళిపోయాడు. మళ్ళీ ఆతడు తిరిగిరావడం కోసమే ఈ ఈశ్వర పూజా, ఈ తపస్సూ ఈ వనవాసమూ ఈ తపోదీక్షా - ఇదీ నా గాథ - పాపం నిన్ను చాలా బాధ పెట్టేశానయ్యా ఈ కథంతా చెప్పి.

చం - నువ్వు చెప్పడం ఏమిటీ - నేనేగా నిన్ను నీ వృత్తాంతం చెప్పు వింటాను మొత్తో అంటే గదా నువ్వు చెప్పావు. ఇందులో నీ తప్పేమీలేదు. నాదే చాలా పొరపాటు - గతించిన ఘట్టాలన్నీ నా ప్రశ్నలచే మళ్ళీ కుళ్లగింపబడ్డాయి. మానుపట్టిన గాయాన్ని రాళ్లలాంటి నా ప్రశ్నలు బాగా రేపేశాయి. ఏం చెయ్యను - నిన్ను చూస్తే అడక్కుండా ఉండలేక పోయాను. అడిగి జరిగిన కథనంతా చెప్పించాను. చాలా ఆవేదన కలగచేశానని అను కుంటున్నాను. మరి శ్వేతా - నీవు తరళిక తరళిక అని ప్రస్తావన వశంగా చెప్పావు గదా! ఆమె ఏదీ!

మహా - ఆ విషయమే నేనూ నీకు చెప్పాలి అనుకుంటున్నాను. మదిరా చిత్రరథులని గంధర్వ దంపతులు. వారి కూతురు కాదంబరి. బంగారు బొమ్మ. అందాలరాసి. సద్గుణాలగని - మహా మంచి మనస్సు - నాకు తనకీ చిన్నప్పట్నించీ చచ్చే స్నేహం -

ఇలా ఉండగా నా కథ ఇలా జరిగింది. అది విన్న దగ్గరనుంచీ నా తల్లీ తండ్రికంటె ఎక్కువగా తల్లిదండ్రులు కూడా చాలా బాధపడ్డారు. వాళ్లకీ ఈ కూతురు ఒక్కర్తే. వివాహం చేసు కోమంటే మహాశ్వేత సంగతి కుదుటపడేదాకా నా విషయాన్ని అస్సలు ఏమాత్రం తలపెట్టడానికి వీల్లేదని నిష్కర్షగా తెగేసి చెప్పేసింది.

చిత్రరథుడు నాకీ విధంగా కబురు చేశాడు. 'అమ్మా మహా శ్వేతా! నీ విషయానికే మేమంతా ఎంతగా బాధపడుతున్నామో ఆ భగవంతుడికే తెలుసు. ఇలా ఉండగా మన కాదంబరి తన వివాహ విషయం తలపెట్టవద్దని గట్టిగా చెప్పేసింది. నువ్వే మార్చాలి దాన్ని మేం ఎవరమూ ఏమీ చెప్పలేక పోతున్నాము' అని.

అప్పుడు నేను తరళికచే కాదంబరికి కబురు చేశాను. నా మాట విని పెద్దవాళ్ళు చెప్పినట్టు చెయ్యమని. గట్టిగా నొక్కిచెప్పి కబురు పంపాను.

అంటూ ఉండగా తరళికా కేయూరకుడూ ఇద్దరూ వచ్చారు.

తరళిక మహాశ్వేత వైపు ఇతడెవరు? అన్నట్టు చూసింది.

మహా - వచ్చావా! తరళికా! రా, రా, వెళ్ళినపని ఏమైంది? నా మాట విందా లేదా! మా చెలి కాదంబరి. అంతా క్షేమంగా ఉన్నారా అక్కడి విశేషా లేమిటి?

తర - వెళ్లాను, వచ్చాను, మీరు చెప్పినట్టే చెప్పాను. కాని నా అక్షరం ఒకటి అయినా ఆవిడ చెవిలో దూరినట్టేలేదు. ఇడుగో ఈ కే యూరకుడిచేత నీకు ప్రత్యేకంగా ఏవో చెప్పమని పంపింది.

మహాశ్వేత - నిట్టూర్చి - సరే - అని చంద్రాపీడుని వేపు చూచి "ఇందాక చెప్పానుగా మా చెలి తరళిక, ఈవిడే అని నీకు తెలిసే ఉంటుంది.

చం - ఇప్పటి మాటల్నిబట్టి ఆ విషయం అర్థం అవుతూంది.

మహా - తరళికా! కళ్లతో ఇందాక ఇతడెవరన్నావు కదూ - ఇతడు ఉజ్జయినీ నగరాన్ని పరిపాలించే తారాపీడుని కొడుకు యువరాజు. పేరు చంద్రాపీడుడు. నువ్వు అటు వెళ్లంగానే పావం తోవ తప్పి దప్పికతో వెతుక్కుంటూ వచ్చాడు. చాలా మంచివాడు. స్నేహ పాత్రుడు - ఉత్తముడు - యువరాజనే అహం ఇతడికి ఏ క్షణంలోనూ లేదనుకో - కష్టాల్లో ఉన్నవాళ్ల కన్నీళ్ళు వంచుకోగలిగే సున్నితం అయిన వెన్నపూసలాంటి మనసు - అన్నట్టు కేయూరకుణ్ని పలకరించలేదే! బాగున్నావా? ఇలారా - ఇతడు పరాయివాడు కాడు - మన ఆత్మీయుడు. తరళికను నన్నూ కాదంబరినీ నువ్వు ఎలా చూస్తావో ఇతణ్నికూడా నువ్వు అలాగే చూడు - అరమరికలు చూపకు. కాదంబరి ఏం చెప్పిందో జంకకుండా చెప్పు దాపరికం అక్కర్లేదు.

కేయూ - చేతులు మోడ్చి అమ్మా మహాశ్వేతా! - కాదంబరి మీ కీ విధంగా చెప్పమంది. సఖీ! శ్వేతా! ఏం కబురు పంపావ్, అయితే నీ ఉద్దేశ్యం ఏమిటి! మనం ప్రాణస్నేహితులం గదా! ఇలాంటి మాట ఎలా పంపగల్గావు. నువ్వు అరణ్యంలో పరితపిస్తూ ఉంటే నేను అంతఃపురంలో ఉన్నందుకు ఒక శిక్షగా పంపావా? నువ్వు చాలా మృదుభాషిణివి గదా! ఇంత కఠినమైన మాట ఎలా పంపావు? నువ్వు గంటకి కడివెడు కన్నీళ్ళు

కారుస్తూ ఉంటే నేను పెళ్ళిచేసుకుని సుఖంగా నవ్వుతూ కేరింతాలు కొడుతూ జీవించమంటావా? నువ్వు నారచీరలూ, విభూది, జపమాలలూ, తీసుకుని ఆశ్రమవాసం చేస్తూ ఉంటే నేను వివాహం చేసుకుని చీనాంబరాలూ, మైపూతలూ, ముత్యాలహారాలూ రత్న స్థగితమైన ఆభరణాలూ అన్నీ అనుభవిస్తూ ఉండు. వివాహం చేసుకో. పెద్దలమాట విను. తల్లి దండ్రులకు బాధ కలిగించ కూడదు - ఏమిటో ఇలా ఇలా చాలా పంపించావ్ - మరి వినలేను బాబూ - ఇంకెప్పుడూ ఇలాంటి సందేశం పంపి నన్ను దుఃఖపెట్టకు. చేతులెత్తి దండం పెడతాను. నేను చేసుకోకపోతే నీ కెంతబాధో నువ్వు నన్ను చేసుకోమంటే అంతకంటె చాలా బాధగా ఉంటుందని నీ కెందుకు తోచలేదు. నాకు ఇలాంటి శిక్ష మాత్రం ఇంకెప్పుడూ విధించకు. నీగురించి నా మనస్సు ఎంత వికలంగా ఉందో ఎందుచేతో నువ్వు కొంచెం కూడా అర్థంచేసుకోలేక పోతున్నావు అని చెప్పి ముగించాడు.

మహా - సరే కేయూరకా! ఇక నువ్వు వెళ్ళు అని ఒకసారి చంద్రాపీడుణ్ని చూసింది. 'చూశావా చంద్రాపీడా! ఎలా ఉందో సంగతి. ఇంతకష్టం అనుభవిస్తూ యెందుకు బతికున్నానా అని ఒకపక్క బాధగా ఉంది. కాదంబరి పంపిన సందేశం అంతకంటె బాగుంది కదూ. అయినా ఏమిటో ఏం చెయ్యాలో అన్నీ ఒకొక్కప్పుడు అయోమయ పరిస్థితులే వస్తూ ఉంటాయి మనం ఏం చెయ్యగలం!

చం - నిజమే. ఈ సంగతులు వింటూ ఉంటే నాకూ ఏమీ బాగాలేదు.

తరళిక పండ్లూ మంచినీళ్లూ తెచ్చింది.

మహాశ్వేత - నిన్ను కథ చెప్పి చాలా కలతపెట్టాను. ఇవి తీసుకో!

చం - నువ్వు బాధ పడలేదూ! పడ్డవాళ్లకంటే వినేవాళ్లకి బాధ ఎక్కువ అంటావా? బావుంది.

శ్వేత - అయితే పుండరీకుడుతో పోకుండా నిజంగా ఇలా ఉండడం మాత్రం చాలా బాధాకరమే.

చం - అలా అనుకుంటే ఎలా? అభిమన్యుడి భార్య ఉత్తర లేదా! మన్మథుడి భార్య రతి లేదా? పాండురాజు భార్య కుంతి లేదా! ఇలా ఎన్నో ఉన్నాయి గదా మన పురాణాల్లో. అయినా ఏవి ఎప్పుడు ఎలా జరగాలో మనకేం తెలుస్తుంది. రురుడనేవాడు తనభార్య ప్రమద్వర పాము కరిచి చనిపోతే తన ఆయుష్షులో సగం ఇచ్చి బతికించుకున్నాడు తెలుసా. ఇంతకీ ఆ గంధర్వుడు పుండరీకుడెప్పుడు బతుకుతాడని చెప్పాడు?

శ్వేత - నిశ్చయంగా ఇన్ని సంవత్సరాలకి అని ఏమీ చెప్పలేదు. బతుకుతాడు అని మాత్రం చెప్పాడు. ఆ మాట పట్టుకుని ఈ కాలమనే సముద్రాన్ని, ఇలా ఇలా ఈదుకుంటూ వస్తున్నా.

చం - తప్పకుండా నీకు ఆ శుభ సమయం సమీపిస్తుంది. ఈ తరళిక నీకు సాయం ఉండడం చాలా సంతోషంగా ఉంది. లేకపోతే నువ్వు ఎంతకని ఇక్కడ ఇలా ఉండి అంత దుఃఖంలో కాలాన్ని గడపగలవు?

శ్వేత - తరళిక లేకపోతే నిజంగా నాకు చాలా కష్టమే. నా కళ్ళని కని పెట్టి సాకుతోంది. పాపం తరళిక. తరళికా!

తర - అమ్మా! ఏం కావాలి?

శ్వేత - కాదంబరికి కేయూరకుడితో వస్తున్నాం అని కబురుచేశాం కదూ. మనం ఒకసారి వెళితే బాగుంటుందంటావా?

తర - చెప్పిచూస్తే సరి. మనం ముందు ఏం చెప్పగలం ఆవిడ మన మనమాట వినేదీ వినందీ. ఈ విషయంలో ఆవిడ చాలా గట్టి పట్టు పట్టి కూచుంది. మనం మార్చడం కష్టమే అనిపిస్తుంది.

శ్వేత - పోనీ వెళదాం కొంచెం అప్రియత్నం చూడు. చంద్రాపీడుని చూసి, నీకు తొందర పనులు లేకపోతే ఇబ్బంది కలగకుండా ఉంటే మాతో ఒకసారి తప్పకుండా రావలసిందిగా కోరుతున్నాను.

ఇక్కడికి ఎంతో దూరం లేదు హేమకూటం. అక్కడ వాతావరణం అంతా బాగుంటుంది. నీ మనస్సూ నా కథ వినడంతో చాలా పాడయింది. కొంచెం శాంతి చిక్కుతుంది ఒకరోజు. మర్నాటికి వచ్చేదువుగాని.

కాదంబరిని నేనూ చూసి చాలారోజులైంది. నిన్ను ఎందుకో విడిచిపెట్టాలి అని అనిపించడం లేదు. ఇంకా ఒకటి రెండు రోజులు నాకూ నీతో గడిపితే సంతోషంగా ఉంటుంది. ఇంత వరకూ నిన్ను ఏడిపించడమే జరిగింది నా నించి. నువ్వు అభిమానంగా అడిగితే చెప్పకుండా ఉండలేక పోయాను. నేను రమ్మంటున్నాను అని వేరేగా భావించకు యువరాజువి ఆజ్ఞాపిస్తున్నాను అనుకోకు.

చం - మహాశ్వేతా! మా బాగా చెప్తున్నావ్. నన్ను ఎవరో పరాయివాడిలా చాలాదూరంచేసి మాటాడితే భరించలేనమ్మా. నన్ను ఆత్మీయుడిగా భావించాను అన్నమాట వెంటనే మరిచిపోయావా! ఆ స్థానం అలా ఉంచితేనే చాలా సంతోషిస్తాను. నాతోరా అంటే వస్తాను ఎందుకంత వినయపూర్వకంగా ప్రాధేయపూర్వకంగా మాటాడుతావు. ఆమాత్రం సన్నిహితం నాకు ఉందనిస్తేనే తృప్తిగా ఉంటుంది.

శ్వేత - అయితే పద. తరళికా! వెళదామా!

*   *   *

కేయూరబాహుడు కాదంబరి మందిరంలో ప్రవేశించాడు.

కాదం - రా కేయూరకా. రా, రా, చెప్పావా శ్వేతతో ఏమంది ఎలా ఉంది? విశేషా లేమిటి?

కే - మీరు చెప్పమన్న వృత్తాంతం యావత్తూ చెప్పాను. ఆ మాటలకి ఆవిడ మనస్సు చాలా కష్టపెట్టుకుంది. మీరు చెప్పమన్నంతగా సరిగా నేను చెప్పలేక పోయాను.

కా - ఏం నువ్వు చెప్పలేక పోవడం ఏమిటి? నయం. మా బాగా చెపుతున్నావ్ నువ్వంటే నేను నమ్మొద్దు.

కే - కాదమ్మా అక్కడ ఒక కొత్తమనిషి ఉంటె ఎలా చెప్తాను?

కా - ఎవరు ఆ క్రొత్త మనిషి ఎలా ఉన్నాడు? శ్వేతతో ఏం మాట్లాడాడు? అక్కడికి ఎలా వచ్చాడు? ఆకారం ఎలా ఉంది? కంఠస్వరం ఎలా ఉంది? మహాశ్వేత అతనితో మాట్లాడే తీరు ఏలా ఉంది? అందరితో కలివిడిగా ఉన్నాడా? మా శ్వేత గౌరవించిందంటే గట్టి వ్యక్తే అయి ఉండాలి. నీకు తెలిసినంతవరకు చెప్పు వినాలని ఉంది.

కే - చూడ్డానికి ఒక మహారాజ పుత్రుడిలా ఉన్నాడు. ఆకారం అంటావా? అపర మన్మథుడే! ఇక అతడి మాటలా వరాలమూటలు. మన మహాశ్వేతగారికి తెలుపులో ఏమీ తీసిపోడు. మంచి వినయసంపద ఉంది. నిగర్వి. మనిషి మంచి నిండుగా ఉన్నాడు. శ్వేత అతణ్ని అతి ఆప్యాయతగా చూస్తున్నారు.

కా - అలాగా ఇంకా అక్కడి విషయాలు చెప్పు చెప్పు.

ఇలా అంటూ ఉండగానే చంద్రాపీడుడు శ్వేత అక్కడికి వచ్చేశారు. దూరం నుంచి చూశాడు చంద్రాపీడుడు. తన విషయం కేయూరకుడు చెపుతూ ఉంటేకూడా సన్నగా విన్నాడు. కాదంబరి వీళ్లను చూడంగానే గబగబా దగ్గరకు వచ్చేసింది. గుమ్మం దగ్గరకు లేచివచ్చి చేతులుచాపి శ్వేతని హృత్తున హత్తుకున్నది. యెన్నాళ్లకి వచ్చావు? నీకు కోపం వచ్చిందనుకున్నాను. పోనీలే వచ్చినందుకు చాలా సంతోషంగా ఉంది. అని ఒక పీఠంమీద కూచోపెట్టి కాళ్ళు కడిగి తన చీర చెంగుతో తడి ఒత్తింది.

శ్వేత చంద్రాపీడునితో

రా! నాయనా! లోపలికి రా!

చంద్రాపీడుడు వచ్చాడు. శ్వేత కాదంబరితో- "ఇతడు ఉజ్జయినీ యువరాజు. దారితప్పి నా ఆశ్రమానికి వచ్చాడు. చాలా సహృదయుడు. నన్ను చూసినంత గౌరవంగా ఇతణ్ణికూడా చూడు. అనిఅని చంద్రాపీడా! నేను నీతో చెప్పిన నా సఖి కాదంబరి అని పరిచయం చేసింది.

చంద్రాపీడుడు కాదంబరిని చూసి నమస్కారం అన్నాడు.

కాదంబరి అతణ్ని చూసి ప్రతినమస్కారం చేసింది.

కాదంబరి పరిచారిక రత్నపీఠం వేసింది. దానిమీద కూచోమంది శ్వేత. కూచున్నాడు చంద్రాపీడుడు. కాదంబరి చెలికత్తె బంగారు పాత్రతో నీళ్ళు తెచ్చి కాళ్ళుకడిగి తడి ఒత్తింది. అతడు యెంత వద్దన్నా వినలేదు.

శ్వేత - కాదంబరీ! యెలా ఉన్నావ్? వీణా అదీ వాయిస్తున్నావా!

కా - నువ్వు అరణ్యంలో ఉంటే నా మనసు వీణమీదకి యెలా వెళ తుందో! చెప్పు!

మహాశ్వేత - మరి ఇంట్లో ఒక్క రాత్రిపి ఏం చేస్తున్నావ్! మనం ఇద్దరం ఉంటే ఏదో ఊసుపోయేది కదా!

కాదంబరి "అలా నిన్ను తలుచుకుంటూ పుండరీకుడు ఎప్పుడు వస్తాడా అని ఆలోచిస్తూ కాలక్షేపం చేస్తున్నాను" అని యేవో మాట్లాడుతోంది. మాటల్లో చంద్రాపీడుని చూస్తూంది. అప్పుడప్పుడు అతడూ కాదంబరీ సౌందర్యాన్ని మెచ్చుకోలుగా చూస్తున్నాడు. ఈ విషయం గమనిస్తూనే మహాశ్వేత మాటాడుతోంది. ఈ లోగా లోపలనుంచి మంచి లేత తమలపాకులు పోకలూ ఉన్న పళ్లెం వచ్చింది. మహాశ్వేతకు వక్కలూ ఆకులూ ఆప్యాయంగా కాదంబరి ఇచ్చింది. "చెలీ! ముందు ఇవి నాకు కాదు ఇవ్వవలసింది ఆ రాకుమారుడికి." అని అంటే ఆమె పరిచారికని ఆకులూ వక్కలూ చంద్రాపీడుడికి ఇమ్మంది.

మహాశ్వేత "అలా కాదమ్మా నీ చేతుల్తో నువ్వే ఇచ్చి అతణ్ణి గౌరవించాలి" అంది. ఆవిడమాట మీరలేక ఇవ్వడానికి ధైర్యం చాలక చాలా తటపటాయించింది కాదంబరి.

మహాశ్వేత ఆ విషయం గమనించి వీపుమీద చెయ్యేసి బుజ్జగించి "నీ చేత్తో నువ్వే ఇయ్యి" అని ధైర్యం చెప్పింది. చెలిమాట తీయలేక చేతిలో ఆకులు ఆతని చేతిలో పెట్టాలని ప్రయత్నించింది. ఇప్పుడు జంకు చంద్రాపీడుడికి వచ్చింది. శ్వేత చిన్నగా నవ్వి, "ఆకులు తీసుకోవయ్యా! ఎందుకలా జంకుతావు? కాదంబరి బంగారు, నువ్వు నాకు ముందే బంగారానివి. మిమ్మల్నిద్దరినీ చూసి సంతోషించడంకంటె నాకుమాత్రం కావలసిందేముంది?" అంది.

చంద్రాపీడుడు ఆప్యాయంగా ఆకులు అందుకోడానికి చెయ్యి చాపాడు.

కాదంబరి అతడి చేతులుకి తాను చేతపట్టినవి, మెల్లిగా అందించింది. ఈ తాంబూలం ఇచ్చాక ఆవిడకు ఎంతో సంతోషం అనిపించింది. నా మనసనే లేత తమలపాకుల్లో ప్రేమ అనే వక్క వేసి అను రాగం అనే సున్నం కలిపి అందిస్తున్నాను.మనసనే లేత ఆకుని నీ ప్రేమ అనే నీళ్ళతో బాగా తడుపుతూ ఎప్పుడూ నవనవలాడేటట్టు చేసుకో అన్న భావం గమ్యమౌతుంది. ఆమె ఆకులు ఇవ్వడంలో.

అంతేకాక ఆకూ వక్కా అందిచ్చుకోవడం జీవితానికి ఒక ప్రమాణికం లాంటిది. అందుకే ఇప్పటికీ తాంబూలాలు పుచ్చుకుంటూ ఉంటారు. అలా పుచ్చుకుంటే వివాహం స్థిరం చేసుకున్నట్లు అన్నమాట. ఆకులు అందించేటప్పుడు ఆ ఉభయులూ కరస్పర్శ సుఖాన్ని చవి చూచారు.

ఆ రోజురాత్రి మణిమందిరంలో చంద్రాపీడుని బస ఏర్పా టయింది.

మరునాడు ఉదయం మహాశ్వేత అనుమతికై చంద్రాపీడుని పంపుతుంది కాదంబరి.

తండ్రి దగ్గరనుంచి జాబు రాగానే చంద్రాపీడుడు సైన్యాన్ని వైశంపాయనుణ్ణి అక్కడే ఉంచి వెళ్ళిపోయాడు.

మరునాడు మహాశ్వేత కూడా తన ఆశ్రమానికి చేరుకొంది. తరు వాత నాల్గురోజులకు ఒకనాడు శ్వేత పండు వెన్నెలలో చల్లదనానికి పడు కుంది. వైశంపాయనుడు ఆమె సౌందర్యాన్ని చూశాడు. మరి అక్కడ నుంచి అతడు కదలలేకపోయాడు. సైన్యం అంతా ఉజ్జయినికి పోతు న్నాం రమ్మనమని అన్నా వెళ్ళలేదు. అక్కడే ఉండిపోయాడు. ఎవరు ఎంత రమ్మన్నా తనపట్టు విడువలేదు.

ఒకనాడు శ్వేతకు దగ్గరగా నిల్చున్నాడు. చూపులతోనే ఆ సౌంద ర్యాన్ని తాగేస్తున్నాడా! అన్నట్టుంది ఆ వ్యవహారం. ఆ భావాన్ని అర్థం చేసుకుంది శ్వేత. "ఏమిరా! దురాత్మా! నీకేం బుద్ధి ఇది? దూరంగా పో! పో!" అని గట్టిగా కసిరింది. వాడిలో ఏమీ మార్పు కనపడలేదు. ఇక చికాకు వచ్చింది. చిలుకవై పొమ్మని శపించింది.

ఎంతకీ వైశంపాయనుడు రాకపోవడంచేత కాదంబరీ వార్తలు అందుతున్నాయి గనుక చంద్రాపీడుడు వైశంపాయనుణి తీసుకొచ్చే నిమిత్తం ప్రయాణం అయ్యాడు.

ఆ విషయం శ్వేతకి చారులవల్ల తెలిసి కబురుపంపింది కాదంబరికి.

పట్టరాని సంతోషంతో అక్కణ్ణుంచి కాదంబరి బయలుదేరింది.

ఇక్కడకు చంద్రాపీడుడు వచ్చాడు. అభిమానంగా గౌరవంగా ఎదురు వెళ్ళింది మహాశ్వేత. అతడికి స్వాగతం చెప్పి లోపలికి ఆహ్వా నించింది.

మహాశ్వేతా! బాగున్నావా? అని కుశలప్రశ్న లడిగాడు చంద్రా పీడుడు. ఇలా వాళ్ళిద్దరూ అరమరికలులేని ఆనందదాయకమైన సంభాష ణలు సాగిస్తూ ఉన్నారు.

మాటల సందర్భంలో శ్వేత చంద్రాపీడునితో "నువు వెళ్ళాక ఒకనాడు వైశంపాయనుడు ఇక్కడకు వచ్చాడు. నన్ను చూశాడు. అతడు మాత్రం నీలాంటివాడు కాడు సుమా! ఆ దృష్టిలో కాముకత స్పష్టంగా కనిపించింది. నాకు చీదరెత్తుకొచ్చింది. "వాణ్ణి నీకిదేం బుద్ధి ? వినాశకాలే విపరీత బుద్ధిః అన్నట్టుంది నీ వరస" అని గట్టిగా మందలిం చినా మనసు మార్చుకోలేదతడు. అందుకని చిలుకవి కమ్మని శపించే

కాను." అంటూండగా ఆమె మాట పూర్తికాకుండానే చంద్రాపీడుడు విఱుచుకుని నేలమీద పడ్డాడు.

మహాశ్వేత పంపినవార్త విన్నాక కాదంబరి చాలా సంతోషించింది. ఆవిడ హృదయానికి చంద్రాపీడుడు అన్నమాటే అమృతవర్షంలా ఉంది. భవిష్యత్తులో బంగారుబాటను భావనలో తీర్చిదిద్దుతూంది. ఆలోచనా తరంగాలు, ఆవిడని ఉక్కిరి బిక్కిరిగా చేస్తున్నాయి. మదలేఖ సహాయంతో మధురమైన తలంపులతో తొందర తొందరగా మహాశ్వేత ఆశ్రమం చేరుకుంది.

ఏముంది! అక్కడ దృశ్యం చూసింది గాలి కల్లాడి కూలిన చెట్టులా కదలాడి కదలాడి నేలపడపోయింది. ఈ ఘట్టం చూడలేక పోయింది శ్వేత. ఏం చెయ్యాలో ఏం చెప్పాలో కూడా ఆలోచనే తట్టడం లేదు. మహాకటకట పడింది. కాదంబరిని ఓదార్చింది. చైతన్యం లేని ప్రతిమలా అలా ఉండిపోయింది కాదంబరి. చంద్రాపీడుడు అలా పడంగానే ఇంద్రాయుధం పత్రలేఖ సరస్సులోకి ఉరికారు.

కాదంబరి ప్రవేశించే దాకానే మహాశ్వేత పాత్ర చాలా పట్టుగా ఉంటుంది.

ఎప్పుడైతే చంద్రాపీడుడుపడిపోయాడో! దాంతో శ్వేత ప్రాధాన్యం తగ్గుతుంది.

బాణుడి చేతిలో ఇంచుమించుగా మహాశ్వేత పాత్ర అయిపోయినట్టే. మిగిలిన కథను అతనికొడుకు భూషణభట్టు రచించాడు.

మహాశ్వేతని బాణుడు మహాద్భుతంగా సృష్టించాడు. మహాకాళేశ్వరుడి గుడిలో ఆమె కూర్చున్న స్థితిని వర్ణించిన తీరు మహా నేర్పుగా

ఉంది. అశ్రద్ధగా పఠనం సాగించినా మహాశ్వేతపాత్ర పఠితల హృదయాల్లో ఉండిపోతుంది.

వివాహం కాలేదు. అయినా మనసారా ప్రేమించిన వ్యక్తికోసం అంత త్యాగశీలిగా ఆవిడను సృష్టించాడు. మహాశ్వేత పాత్రలో సౌశీల్యం, సౌందర్యం, సమత్వం, సహృదయం, సోదరభావం, సమస్త ప్రాణులనూ, సత్ప్రేమతో చూడ్డం అనే సద్గుణాలన్నీ కుప్పతిప్పలుగా కో కొల్లలుగా ఉన్నాయని వర్ణించాడు. మన బాణుడికి స్త్రీలపై ఎంతటి ఉత్తమ ఉదార భావాలున్నాయో మనకి ఈ పాత్ర చక్కగా చెపుతుంది.

ఒక స్త్రీ ఒక యువకుడూ నిర్జనప్రదేశంలో ఒంటరిగా ఒకబండ మీద ఉండి ఒకరాత్రి అంతా ఎంతో పవిత్రవంతంగా గడిపారు.

అంతేకాదు. శ్వేత తన ప్రేమ కథను అతనికి చెప్పడం కూడా చాలా ప్రశంసింవతగ్గ విషయం మహాశ్వేత చెప్పిన తన కష్ట కథనంతా ఎంతో సాదరంగా వింటాడు చంద్రాపీడుడు.

ఒక యువతి తన ప్రేమకథని ఒక యువరాజుకి చెప్పించడంలో బాణుడు ఎంతటి అభ్యుదయవాదో గదా? ఆరవ శతాబ్దికాలంలో (క్రీ.శ. 600 సంవత్సరం క్రిందట) సంఘంలో నైతిక సామరస్యం చాలా తక్కువ. ఆడదానితో మగవాడుగాని మగవాడితో ఒక ఆడదిగాని మాట్లాడితే మరేం ఉంది కొంపలంటు కున్నాయన్నమాటే. కాముకతా దోషాన్ని వాళ్ళకి అంటగట్టి కాకుల్లా పొడుచుకుతింటుంది ఆ నాటినుంచీ ఈ నాటిదాకా ఈ మాయదారిసంఘం.

సంఘాన్ని ఎదురీది మహాశ్వేతా చంద్రాపీడుల పాత్రలను మహోన్నతంగా సృష్టించాడు. ఎంతటి సంస్కారవంతమైన పాత్రలు!

ఆదే మన కవులయితే కాదంబరికి మహాశ్వేతమీద చంద్రాపీడుని మీద లక్షోపలక్షల అనుమానాలూ అవమానాలు వాళ్లనెత్తిన రుద్ది అందరి హృదయాలూ ఖరాబులుచేసి అసహ్యంగా సృష్టించి కథను నానాతిప్పలు పెట్టేసి తద్వారా పాఠకులను గాభరాచేసి నానాచిత్ర కథలూ చేసి ఉండేవారు.

బాణుని చరిత్ర చూస్తే ఆ తరువాత మనం ఆతడి స్త్రీ పాత్రలను పరిశీలిస్తే ఎంత ఉదాత్తత ఆ పాత్రలకిచ్చి పోషించాడో ? ఆశ్చర్యం రాయడానికి సాధ్యం కావడం లేదు. అది సహృదయ సంవేద్యమే.

* * *

## "కాదంబరి"లో కాదంబరి పాత్ర

మన బాణుడు తన పుస్తకానికి పేరే "కాదంబరి" అని పెట్టు కున్నాడు.

మనకి కావ్యంలో చంద్రాపీడుడికి మహాశ్వేతతో పరిచయం ఏర్ప డ్డాక కాని అసలు కాదంబరి పాత్ర కావ్యంలో ప్రవేశించదు. తరళికా కేయూరకుడూ వీళ్ళిద్దరూ వచ్చాక వీళ్ళతో కాదంబరి ఏమంది ? అన్న ప్రశ్నకి వాళ్ళు సమాధానం ఇస్తారు.

ఈ విధంగా పాఠకుడికి కాదంబరి పాత్రతో పరిచయం కలుగు తుంది.

తరువాత చంద్రాపీడుడు మహాశ్వేత హేమకూటానికి వెళతారు కాదంబరిని చూడడానికి.

అప్పుడు కాదంబరి కేయూరకుడితో "నువ్వు చూసిన రాజపుత్రు డెలా ఉన్నాడు? ఏం మాట్లాడాడు?" అని అతి ఆతుత్రతగా అతడిని ఎన్నో ప్రశ్నల వర్షం కురిపిస్తూ ఉంటే ప్రవేశించారు చంద్రాపీడుడు మహాశ్వేత.

చంద్రాపీడుడు దూరంనుంచి చూసిన కాదంబరి ఎలా ఉందంటే

-తనతో సమానమైన సౌందర్యవతులు రాకుమారిక లందరూ ఆవి డిని అతి భక్తి శ్రద్ధలతో సేవిస్తున్నారు.

వాళ్ళందరి మధ్యా చుక్కల గుంపులో చందమామలా ప్రకాశి స్తోంది కాదంబరి.

వాళ్ళందరి మధ్యా ఆవిడ విద్యుద్దీపంలా వెలిగిపోతోంది. ఆమె కళ్ళ అందం చూసి తామరపూరేకులు ఓర్వలేక కళ్ళనీళ్ళు కారుస్తు న్నాయా అన్నట్టున్నాయి. అచటి పరిచారికల చూపులు చూస్తే నేలపై కలువలు పరిచారా! అనే భావన కల్గుతూంది చూపరులకు.

ఆవిడముందు హంసలు నడవడం మానేసి ఒక దగ్గిర అలా కూచుంటాయి. ఆవిడ నడకచూసి వాటికి సిగ్గనిపించిందన్నమాట! బ్రహ్మగారు ఈవిడ విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహించి సృష్టించాడా అన్నట్లుంది. హేమకూటానికే ఆవిడ సౌందర్యం మకుటాయమానంగా ఉంది.

బంగారు బొమ్మ రంగారు కాంతి ఆ దివ్య భవనానికి ఈవిడ రమణీయత, రమణీయం ఇస్తోంది. ఆ భవనంలో వేరే కెంపులూ అవీ స్థాపించ నక్కర్లేదు. ఈవిడ గోళ్ల కాంతులు అక్కడ గోడల్లో ప్రతిబిం బించి మణులు స్థాపించినట్లే ఉన్నాయట.

కాదంబరి అక్కడ కాంతాజనం మధ్య కనకశలాకలా వెలిగి పోతోంది—

చంద్రాపీడుడు వచ్చేసరికి ఆవిడ కేయూరకుడితో ఇలా అంటూంది.

"కోఽసౌ? కస్యవాఽపత్యం? కిమభిదానోవా? కీదృశం తస్య రూపం? కియద్వా వయః? కథంచ అస్య మహాశ్వేతయా సహ పరిచయ ఉపజాతః?"

"ఎవరతను? ఎవరికొడుకు? పేరేమిటి? అతని ఆకారం ఎలా ఉంది? అతడి వయసేమాత్రం? మన మహాశ్వేతతో అతనికి పరిచయ మెలా అయింది చెప్పు! చెప్పు! కేయూరకా!" అంటూండగా దూరంనుంచి ఈమె సౌందర్యాన్ని చంద్రాపీడుడు చూస్తూ ఉంటాడు.

చంద్రాపీడుడు ఈ దృశ్యాన్ని ఈమె సౌందర్యాన్ని చూసి ఒక్కసారి చకితుడయ్యాడు. చకితుడై తనలో తాను చంద్రాపీడుడు

"ఇది భూలోకమా! స్వర్గలోకమా! గంధర్వ నగరమా! ఈ మహాశ్వేత నన్ను ఏ లోకంలోకి తీసుకువచ్చింది. ఈ కాదంబరీ కన్య ఏ అప్సరసయినా అయి ఉండాలి - దేవలోకంలో అప్సరసలు తపస్సంప న్నుల మనో నిగ్రహాన్ని పంటగలుపుతారు! వాళ్ళల్లో బ్రహ్మచర్యా శ్రమ వ్రత సంపన్నులలో ఉండే ముఖవర్చస్సు ఎంత వెదికినా కనపడదే!

పొద్దున్నే చేతులు పడకుండా అప్పుడే విచ్చిన లేత గులాబుల సొబగు సుకుమారాలు, ఈవిడముందు తీసికట్టు. లావణ్యం అంతా లలనలకే ఇచ్చి బ్రహ్మ సృష్టిలో పక్షపాతం చూపిస్తున్నా డనకతప్పదు.

అబ్బా! ఆ బ్రహ్మ మగవాడే గద! సౌందర్యం, లావణ్యం, సుకుమారం, ఇంకా ఇంకా లోకంలో ఉన్న మంచినంతా, సున్నితాన్ని అంతా, అంతా, అంతా ఈ ఆడవాళ్ళకే ఇచ్చేస్తున్నాడు. జాతి అభిమానం అయినా లేదేం పీడికి? మొఱకుతనం! కఱకుతనం, మొదలైనవన్నీ ఇచ్చి ఇంత అన్యాయంగా పురుషజాతిని సృష్టించడం అసలు ఈ బ్రహ్మకి ఏం బాగుందని? ఆ బ్రహ్మే ఎదురుపడితే గట్టిగా ఓ పోట్లాట పెట్టేవాణ్ణి. ఇప్పుడదంతా ఎందుకుగాని ఒక్కసారి అలా కాదంబరిని చూడు అని మనసులో అనుకుని అటు చూశాడు. కొత్తగా వచ్చిన అతణ్ని అదే సమయానికి ఆవిడ చూడ్డం తటస్థించింది. మరొకవైపు ఆ చూపులు మళ్ళడానికి కొంచెం వ్యవధి తీసుకుంది.

మహాశ్వేత ఇతణ్ని పరిచయం చేసినప్పుడు "చూడు కాదంబరీ! ఇతడు తారాపీడుని కొడుకు చంద్రాపీడుడు. దిగ్విజయ యాత్రకు బయలుదేరాడు. నేను ఇక్కడకు రమ్మనమని ఎంతగానో అడిగితే వచ్చాడు. నువ్వూ నీ పరిజనమూ నన్ను ఎంత ప్రేమగా ఆదరంగా ఆత్మీయంగా చూస్తున్నారో అలాగే యితణ్ని చూడండి - నువ్వుకూడా కొంచం సిగ్గు తగ్గించుకుని నాతోలా చనువుగా ఉంటేనే బాగుంటుంది.

ఏష చ, దర్శనాత్ప్రభృతి ప్రకృత్యామే నిష్కారణ బంధుతాం గతః.

సఖీ! నా మనసుకి ఇతణ్ని చూసిందగ్గరనుంచి, ఎప్పటినుంచో, తెలిసిన సన్నిహిత బంధువులా తోస్తున్నాడు సుమా! అందుకని నువ్వు కూడ అలాగే చూడు." అని అంటుంది.

12)

ఒక్కసారి అతనివైపు దృష్టి సారించింది. కాదంబరి "అనూనపి మయా కేయూరకేణ ఆవేదితః" కేయూరకుడు, వర్ణించిన సౌందర్య వర్ణన అంతా అక్షరాలా సత్యమే! అని అనుకుంటూ ఉండగా

మహాశ్వేత కాదంబరితో

'యథామయి తథా అప్రాపి వర్తితవ్యం'

"నువ్వు నాతో ఎలా ఉంటున్నావో ఇతడితో కూడా అలాగే ఉండు!

'ఏషః తే మిత్రంచ. బాంధవశ్చ, పరిజనశ్చ'

ఇతణ్ని నువ్వు మిత్రుడుగా, సన్నిహిత బంధువుగా, స్వజనంలో ఒకణ్నిగా భావించవలసింది" అని ఆజ్ఞాపించింది.

అంతట కాదంబరి ఆమె చెప్పినట్లు అతడికి నమ్రతతో నమస్కారం చేసింది

చంద్రాపీడుడు ప్రతి నమస్కారం చేశాడు.

వక్కలూ ఆకులూ ఇవ్వ వచ్చినవారిని గౌరవించడం ఆనాటి సాంప్రదాయంలా కనపడుతుంది.

ఆనాడేవిటి, ఈనాడు కూడా 'నిశ్చయం' చేసుకున్నాం అనుకోవడానికి తాంబూలాలు పుచ్చుకున్నాం అనే అంటారు.

అందుకని బాణుని మహాశ్వేత చెప్పగా కాదంబరి చంద్రాపీడునికి తాంబూలం అందిస్తుంది.

మన ఆచారాలనూ, సంప్రదాయాలనూ మనకు అవి ఫలానా అని తెలియనట్టుగా ఆ సందర్భాలలో చక్కగా చొప్పించి రచిస్తాడు బాణుడు. రాకుమారుడికి మణిమందిరంలో బస యేర్పాటు చేస్తారు.

చంద్రాపీడుణ్ని జాగ్రత్తగా చూడవలసిందిగా చూపుతోనే ఆజ్ఞాపిస్తుంది మహాశ్వేత.

అర్థం చేసుకున్నట్టుగా కళ్ళతోనే సమాధానం ఇస్తుంది కాదంబరి.

మహాశ్వేత మదిరా చిత్రరథుల దగ్గరకు వెళుతుంది. చంద్రాపీడుడు మణిమందిరంలోకి వెళతాడు.

కాదంబరీ ఆవిడ పరిజనులూ వారి వారి పనులలో మునిగి ఉంటారు.

చంద్రాపీడుడు సాయంత్రం నిర్వహించవలసిన వన్నీ పూర్తి చేసుకుని విశ్రాంతిగా మణివేదికమీద కూచుంటాడు. ఈ లోగా అక్కడకు మదలేఖ వచ్చింది.

ఆవిడ రాకతో ఆ భాగం అంతా ఎంతో వెలిగిపోతోంది. ఏమిటి చెప్మా! ఇంత వెలుగు! అని ఆశ్చర్యపోతున్నాడు రాకుమారుడు. కెంపులు పొదిగిన బంగారు పళ్లెంలో ధగధగ వెలుగులు జిమ్మే మంచి ముత్యాలహారం ఉంది అందులో.

చంద్రా - మదలేఖా! ఏమిటది అంత వెలిగిపోతూంది!

మద - మహారాజా! ఇది మా చెలి మీకు కానుకగా పంపినట్లు చెప్పమంది.

చంద్రా - దీని విశేషం ఏమిటి? నా కెందుకు పంపాలి?

మద - "ఇది పూర్వం సముద్రమథనం అప్పుడు దొరికింది. అన్నీ అందులోంచి వచ్చేశాక ఆఖర్ని వచ్చింది యిది. అందుకని దీనిపేరు శేషహారం అంటారు.

దీన్ని మీరు ధరిస్తేనే దీనికి సార్థక్యం. ఇది మీకు కాదంబరి పంపింది. కాదంటే ఆమెకూ మహాశ్వేతకు కూడా చాలా కోపం వస్తుంది.

మీ మనసు చాలా మంచిది. ఎవరినీ బాధపెట్టరు" అంటూ ప్రతి సమాధానానికి అవకాశం ఇవ్వకుండా ఆ హారాన్ని కంఠంలో వేసింది.

ఆ హారం ధరించేసరికి అతడు ఇదివరకుకంటె కోటిరెట్లు హెచ్చుగా వెలిగిపోతున్నాడు.

అచటి జనం అంతా అతణ్ని చూసి ఆశ్చర్యచకితు లయారు.

మదలేఖ - మహారాజా! ఈ హారంతో మీ కెంతో అందం వచ్చింది' కాదు-కాదు. మీరు దీన్ని మెళ్ళో వేసుకుంటే ఈ హారానికి చాలా అందం వచ్చింది. చాలా బాగుంది. మీ ఆధిక్యతకి ఇదొక పెద్ద బహూకరణ కాదుగా- మీకు ఈ హారం బాగుంటుంది అనే మా చెలి ఉద్దేశం.

చంద్రాపీ - మదలేఖా! బాగా మాట్లాడ్డంలో నీకు మహా మంచి చాకచక్యం ఉంది సుమా!

మద - నాకేం తెలియదు రాజా! మా కాదంబరి, శ్వేతలు చెప్పినట్లు చెయ్యడమే! మీ రనుకొన్న గొప్పతనం నా దగ్గిర ఏమైనా ఉందంటే అది కేవలం మా చెలి చాకచక్యమే.

చం - మీ ఇద్దరి తెలివితేటలూ నా బుద్ధి అనే కొలబద్దకు ఎక్కడా అందడంలేదు. అయితే అది నా అసమర్థతేమో!

మద - ఎంతమాట! ఎంతమాట! మీ రసమర్థులా అలా అంటే అసలే ప్రపంచంలో సమర్థు లెవరు?

పరిచారిక ప్రవేశించి - కాదంబరి పరివారంతో వస్తున్నట్లు చెప్పింది. చంద్రాపీడుడు తప్పక ప్రవేశపెట్ట మన్నాడు ప్రతీహారిని.

కాదంబరి అతి సామాన్యంగా అక్కడకు వచ్చింది. రాజపుత్రికల రాజసాల, జబ్బు ఆవిడకు ఆవేశించలేదు.

స్వభావ సిద్ధం అయిన సౌందర్యంలో ఒక చక్కని విశిష్టత ఉంది.

అదే అంటాడు కాళిదాసు. అభిజ్ఞాన శాకుంతలంలో

"కిమివ హి మధురాణాం మండనం అకృతీనామ్"

సహజ సౌందర్యవతులైన సుదతులకు ఇక అలంకారాలు అనవసరం.

కాదంబరిని ఇక్కడ అదే ఉద్దేశంతో చాలా సర్వ సామాన్య స్త్రీ లాగ సృష్టించాడు బాణుడు.

చంద్రాపీడుడు ఆవిడనుచూసి లేచి సాదరంగా స్వాగత వచనాలు చెప్పి లోపలకు తీసుకువస్తాడు. ఆవిణ్ని ఆ వేదికమీద కూచోమని గౌర విస్తాడు. కాని క్రిందనే ఒకదగ్గిర వినయంతో కూచుంటుంది.

చం - (సాపేక్షగా ఒక్కసారి చూసి) క్రిందకూచోడం బాగాలేదు. ఈ వేదికపై కూర్చోండి.

కా - (తలవంచి అతడు చూపిన గౌరవానికి లోపల సంతోషిస్తూ) ఇక్కడ బాగుంది, ఫరవాలేదు, ఎక్కడయితేనేం?

చం - కింద కూచుంటే నా కెలాగో ఉంటుంది.

కాదం - ఎలాగో ఏమిటి! - నమ్రత నారీలోకానికి చక్కని ఆభరణం. (హృదయాలలో ఉన్నతభావం ఉంటే చాలు బాహ్యంలో ఎలా ఉన్నా. అని మనసులో అనుకుంటుంది.)

చం - (ఆ మాటకు చాలా సంతోషించి) ఇంత విలువైన హారం పంపారు. నాకు తీసుకోవడం అంటే ఆదోలా ఉంది.

కా - మనుషుల విలువల్లో హారం విలువ ఎంత? అది ఎంతో తక్కువ అనే నా ఉద్దేశం.

చం - ఎక్కువ తక్కువలకి హద్దు పద్దులేం ఉన్నాయి? ఇచ్చి పుచ్చుకోవడంలో సహృదయ సామరస్యాలుండాలి కదా!

కా - యువరాజులు మీకు తెలియనివి ఉంటాయా!

చం - ఇందులో మీకుమాత్రం తెలియని దేముంది?

కా - తారాపీడ మహరాజుగారి మనస్తత్వం ఎలా ఉంటుంది?

చం - మనస్తత్వాలు మా కంటే మీరే (స్త్రీలే) బాగా చదవగలరు! నాకేమంత బాగా తెలియదనుకుంటా. అయినా నాకు తెలిసినంతలో మా ప్రజలు మా నాన్నగారిని కన్నతండ్రిలా భావిస్తారు.

కా - విలాసవతిగారి అలవాట్లు అభిప్రాయాలూ ఎలా ఉంటాయో!

చం - ఆవిడ గురించి చెప్పాలంటే, ప్రేమ అనే గుణాన్ని అంతా ఒక్క దగ్గిర చేర్చి దానికి ప్రాణంపోసి, బ్రహ్మ ఆవిడను నాకు తల్లిగా ప్రసాదించాడని అనిపిస్తుంది. నేనింత పెద్దవాణ్ని అయినా సరే ఆవిడ దృష్టిలో మాత్రం నేనెప్పుడూ పసివాణ్ణే - కాస్త కనపడకపోతే కన్నీళ్ళే - కొంచెం తలనొప్పి వస్తే కొంప లంటుకున్నంత బాధ పడిపోతుంది. ముఖంలో కొంచెంకూడా అలసట కనిపించ కూడదు. కనిపించిందా కంగారు. మళ్ళీ నేను బాగా ఉండేదాకా అన్నమూ నీళ్లూ ముట్టదు. ఇదీ మా అమ్మగారి మనస్తత్వం.

కా - అయితే ఆవిడది చాలా సున్నిత హృదయం అన్నమాట. మంత్రి సుకనాసుడి స్వభావం ఎలా ఉంటుంది ?

చం - చాలా మంచివాడు - మా తండ్రిగారూ ఆయనా స్వంత అన్న దమ్ములకంటె సన్నిహితంగా ఉంటారు. వాళ్ళిద్దరిదీ ఒకేమాట ఒకే బాట - నా మీద మా నాన్నగారికి ఎంతదయో అతనికూ కూడా అంతే. నా పట్టాభిషేకానికి ముందు ఎంతో ఉపయుక్తమైన విలువైన రాజనీతి చెప్పాడు. చాలా బాగుంది. మా మంత్రికూడా చాలా సమర్థుడు, సహృదయుడు, సాత్వికుడు.

కా - ఉజ్జయినీ నగరం చాలా బాగుంటుందని విన్నాను.

చం - రాజధానీ నగరం కదా! - చాలా రమణీయంగానే ఉంటుంది. కాని ఈ హేమకూటంలాగా అంత బాగుండదేమో! అనిపిస్తుంది.

కా - ఎవరున్న పట్నం వాళ్ళకి నచ్చకపోవడం సహజమే గదా !

చం - అయితే మీకు ఈ హేమకూటం నచ్చలేదన్నమాట. మీ అభిమాన శాస్త్రం ఏమిటి ?

కా - నా కన్నీ అభిమానం అయినవే - కాని ఒకొక్కప్పుడు ఎందుకో వేటిమీదా ఇష్టం ఉండదు.

చం - ఎప్పుడైనా దేనిమీదా ఇష్టం ఉండకపోవడం సామాన్య విషయమే గదా !

కా - మీకు అసలే ప్రయాణం మూలంగా అలసటగా ఉండి ఉంటుంది. చాలా సేపు మాటల్లో పెట్టి విశ్రాంతి లేకుండా చేశాను. క్షమించండి ఇక ఉంటాను.

అని చంద్రాపీడుడి దగ్గర సెలవు తీసుకుని తన మందిరానికి వెళుతూ కేయూరకుణ్ణి అతనికి నిద్రపట్టేదాకా కాళ్ళు పట్టమని చెప్పి వెళ్ళిపోయింది.

చంద్రాపీడుడు కాదంబరి వెళ్ళినవైపే అలా చూస్తూ కాసేపు ఉన్నాక పక్కమీదకు చేరి పడుకున్నాడు. పడుకుని స్వగతంలో

"చంద్రాపీడా! ఇక్కడకు నువ్వు ఎందుకు వచ్చినట్లు? కేవలం ఈ అతిలోక సౌందర్యరాసి కాదంబరిని చూడ్డానికే వచ్చావు! - అవును చూశావా? ఎంత నమ్రత! - ఎంత శాంతం! ఏమి మాటల్లో నేర్పరితనం! ఈవిడలో విద్యాగర్వం సౌందర్యగర్వం ఐశ్వర్యగర్వం రాజసం ఈ అవలక్షణాలు ఎంత జాగ్రత్తగా వెదికినా కనిపించవు. భవిష్యత్తులో ఈవిడ నా జీవిత భాగస్వామిని అయితే అంతకంటే కావలసిందేముంది! కానీ యేమవుతుందో! కాలనిర్ణయం.

కాదంబరి కన్నుమూసింది. చెవుల్లో, చంద్రాపీడుని ఆప్యాయతతో నిండిన వాక్యాలే, పదే పదే ప్రతిధ్వనిస్తున్నాయి. నిరాడంబరాన్ని ప్రేమించే యువరాజు, కల్మషం లేని కమ్మని హృదయం, ఉద్వేగంలేని ఉత్సాహపూరితంగా ఉండే సంభాషణ. అందరినీ సమానంగా గౌరవించి, ప్రేమించాలనే సహృదయత. అబ్బా! అన్నీ సద్గుణాలే-ఎంత సాత్వికం పుట్టింది రాజకులంలోని మంచితనం అంతా ఈ విధంగా మానవాకృతితో వచ్చిందా? అనుకుంటూ ఉండగానే కాదంబరిని నిద్రా దేవత చల్లగా జో కొట్టింది.

బాణుడి కాదంబరిలో కథానాయిక కాదంబరి. కథానాయకుడు చంద్రాపీడుడు.

మనకి కావ్యంలో చంద్రాపీడుడు తొందరగానే కనపడతాడు గాని కాదంబరి కనపడదు.

బాణుని స్త్రీ పాత్రలు ఘోషా పద్ధతిలో ఉంటాయని అతనిజీవిత చరిత్రలోనే వివరించడం జరిగింది.

రాజకుమారుడు కాదంబరితో మాట్లాడిన విధం పరిశీలిస్తే భార తీయ సంస్కృతీ సంస్కారాలు చంద్రాపీడుడిలో ఎంతగా చిత్రించాడో ఆ పాత్ర పరిచయం ఉన్నవాళ్ళకు తెలుస్తుంది. అతడి చేతుల్లో ఏ పాత్రకి ఆ పాత్ర నిండుగా జీవం పోసు కుంటుంది. నిర్జీవ పాత్ర చిత్రణ, ఇతడి చేతుల్లో చాలా అరుదు. మదలేఖచేత ముత్యాలహారాన్ని చంద్రా పీడుడికి వేయించాడు. అదే వేరే కవులైతే అలా వేయించడానికి హడ లెత్తుతారు. అవసరాన్ని పురస్కరించుకుని సృష్టిస్తాడు సన్నివేశాలు. మహాశ్వేత మొహంతిరిగి పడిపోతూఉంటే ఆధునిక కవులు అలా పడిపో నిస్తారు కాని పడకుండా పరపురుషుడిచేత ఆపించేధైర్యం లేదు.

చంద్రాపీడుడు—అతి జాలిగా లాలనగా చెల్లిగా పడకుండా ఆపి–ముఖంమీద నీళ్ళు చల్లాడు.—తాగడానికి మంచినీళ్ళిచ్చాడు—తాగ లేకపోతే నెమ్మదిగా ఆమెచేత తాగించాడు. నీళ్ళతో ముఖం—తుడిచాడు— చీరచెంగుతో విసినికర్రగా పెట్టి విసిరాడు. సేదతీర్చాడు. గోటితో కన్నీటిని గోముగా తుడిచాడు. అదే ఆధునిక కవులైతే చంద్రాపీడుణ్ణి ఇలా సృష్టించలేరు.

మనవారు పురుషపాత్రలు స్త్రీకి ఏవిధంగా సహకరించినా, కాము కతను మాత్రమే అంటగట్టడంలో, అతి ఘనులూ మహాఘనులూ, అంతే-అంతే-వాళ్ళ సంకుచిత దృష్టి వేళ్ళుపాతుకుపోయింది

మనిషిని ఒక మనిషిగా ఆదరంతో ఆదుకోవడం అతితప్పు. పురుషపాత్రలు ఎట్టి పరిస్థితుల్లో అయినా స్త్రీ పాత్రలకు ఆమడ దూరంలో ఉండవలసిందే. కొంగు తగిలితే కొంపలంటుకున్నంత గోలెత్తుతారు! చంద్రాపీడుడు మహాశ్వేతని అరమరికలు లేకుండా కష్ట సమయంలో అంతగా ఆదుకున్నాడు అన్నాడు బాణుడు.

అంటే అక్కడ చంద్రాపీడుడి పాత్ర కేవలం బాణుడిపాత్ర.

బాణుడు ఆనాటి సంఘాన్ని ఎంతో జాగ్రత్తగా పరిశీలించాడు. సంఘంలో ఉన్న మలినాన్ని రూపులేకుండా తుడిచేసి, ఉన్నతస్థానంలో నిర్మలమైన ప్రేమను నిలబెట్టాడు.

ఇంకా కాదంబరిలో కొన్ని ఘట్టాలు ఈ దృష్టితో పరిశీలిద్దాం. మదలేఖ ముత్యాలహారం అతని మెడలో వేసేముందు పచ్చకర్పూరం కలిపిన మంచిగంధాన్ని అతనికి గౌరవంగా వంటికి పూసిందిట. ఆపైన మాలతీమాల తలమీద చక్కగా అలంకరించింది. పట్టుబట్టలు కట్టుకునేందుకు ఇచ్చిందిట.

రాకుమారుడు ఈ పరిచర్యలు ఏమీ ఎబ్బెట్టుగా భావించలేదు.

పెళ్ళికొడుకుని చేసినపుడు, తల్లి అక్కా తనను అలంకరిస్తే అతడు ఎలా ఉంటాడో మామూలుగా అలాగే ఉన్నాడు మన చంద్రాపీడుడు.

కాదంబరి వచ్చివెళ్ళాక చంద్రాపీడుని కాలక్షేపం కోసం నృత్య వాయిద్య సంగీతాలను ఏర్పాటు చేసింది కాదంబరి. అతడు సంతోషంగా వాటిని చూశాడు.

తరువాత చేయూరకుడు వస్తాడు. అతనితో చంద్రాపీడుడు ఈ విధంగా సందేశం పంపుతాడు.

మహాశ్వేతకు నమస్కారాలు—కాదంబరితో తను నా కళ్ళల్లోనే ఉందని చెప్పు—మదిరా చిత్రరథులకు నా నమస్కారాలు చెప్పు. మదలేఖనిని సాదరంగా వెన్ను తట్టానని చెప్పు, అని ఇలా పంపిస్తాడు. వేరే కవులైతే ఇలా వర్ణించడానికి సాహసించరు

కాదంబరి తన కాబోయే భర్తదగ్గరికి సౌందర్యవతులైన స్త్రీలను నృత్యం చెయ్యమని సంగీతం పాడమని పంపుతుంది.

ఆవిడది ఎంతటి విశాలహృదయం—అన్నవేళకి ఏ పనిమీదైనా మగవాడు రావడం ఆలస్యమైతే అప్పడాల కఱ్ఱలతో సిద్ధమౌతారు ఈనాటి వనితలు.

వైద్యుడుగా గానీ పనిచేస్తే అతడు ఆడవాళ్ళతో మాట్లాడినా, వాళ్ళని చూసినా, తండ్రిలా అపద్ధర్మంగా పరీక్షించినా అతడిమీద ఎన్నో అనుమానాలూ, అభాండాలూవేసి ఆ కుటుంబం అల్లకల్లోలంగా తయారుచేసుకునే ఆడవాళ్ళు ఎంతోమంది వుంటారు.

స్త్రీ, పురుషుడితో మాట్లాడినా ఏమైనా ఇచ్చినా, చూసినా తాకినా—మన మగవాళ్ళు ఆడవాళ్ళని నమిలి మింగి తినేసి ఆవిణ్ని నానాయాతనాపెట్టి అహంకారంతో అనవసరమైన అనుమానాలతో నానా రకాలుగా వేధిస్తారు.

వివాహం అయినదగ్గిరనుంచి, కొంత గీటులోనే నడవాలి, స్త్రీలు గాని పురుషులుగాని. ఆ గిరి దాటితే వాళ్ళ జీవితాలు అగచాట్లపాలే.

ఇవి దృష్టిలో పెట్టుకునే కాబోలు మామూలుగా కవివరేణ్యులు పాత్రలను బహు జాగ్రత్తగా చిత్రిస్తారు—మగవాళ్ళు మగవాళ్ళతోనే మాట్లాడాలి, ఆడవాళ్ళు ఆడవాళ్ళతోటే మాటాడాలి.

ఆడది లేనపుడు కర్మంజాలక ఆ యింటికి ఏ ఆడదైనా వస్తే ఆ మగవాడికి హడలిచచ్చేటంత పని అవుతుంది.

అలాగే మగవాడు ఇంట్లో లేనప్పుడు ఇతర పురుషులు ఎవరైనా వస్తే ఆ ఆడది హడలిచావవలసిందే. ఎందుకు? సంఘం రేపు తెల్లవారితే ఎవిధంగా అద్భుత కథల్లి అగచాట్లపాలు చేస్తుందో అని.

పంధొమ్మిదవ శతాబ్ది ముచ్చటలు ఇవి.

మన బాణుడు 600 శతాబ్దివాడు.

అనాదే తన పాత్రలన సంఘంలో ఉన్న సంకుచిత దృష్టుల్ని, తీసిపారేసి విశాల దృక్పథాన్ని, మానవులకు అలవరచాలనుకున్నాడు బాణుడు. అందుకే చంద్రాపీడుణ్ని అంత హృద్యంగా చిత్రించాడు. మానవుల్లో సమానత్వం చక్కటి ప్రేమ ఉండాలిగాని, సంకుచితాలలో, సంక్షోభాలను రేపకూడదు. స్త్రీ పురుషులు ఇద్దరిలోనూ, పరస్పరమూ విశ్వాసం ఆదరం గౌరవం, ఉండాలి. అన్ని సమయాలలో ఆత్మసాక్షిగా మానవాళి మనుగడ సాగించాలి. అప్పుడే సంఘం పురోగమిస్తుంది.

సంఘాన్ని సరిదిద్దడమే సత్కవుల ధ్యేయం. చంద్రాపీడుడి పాత్రలో, బాణుడు ఎంతో గట్టిగా నిలబడ్డాడు.

---

దూర దూరాలలో నిదురలేక మాగన్నులో ఉన్న చిన్న ఈ యువ జంటను చూసి, ప్రకృతి పాపం, అయ్యో అని బాధ పడిపడి ఇక పడ లేక భళ్ళున తెల్లారిపోయింది.

చంద్రాపీడుడు ఉదయం తను చేయవలసిన పనులను అతి త్వరగా పూర్తిచేసుకున్నాడు.

కాదంబరీ మహాశ్వేతలను కలుసుకునేందుకు వెళ్ళాడు. వాళ్ళని చూశాడు.

వాళ్ళు ముగ్గురూ ఆ సమయానికి తగిన సంభాషణాదులు సాగించారు.

మెల్లిగా మహాశ్వేతని చూశాడు. చిన్న మందహాసంతో మహాశ్వేత కూడా అతణ్ణి చూసింది. అర్థంచేసుకున్నాను అన్నట్లు—

మహాశ్వేత—కాదంబరి—ఇలాచూడ్డం మనచంద్రాపీడుడు, వెళతాను అని చెప్పలేక పోతున్నాడు. పాపం అతనికి చాలా పన్లు ఉంటాయి—వెళ్ళాలి అని అనుకుంటున్నాడు. మనవల్ల అతనికి బాధ కలిగించడం బాగుండదు కదా—మనకి అతడు ఇక్కడ ఉండాలనే ఉంటుందనుకో, కాని మరేం చేస్తాం.

కాదంబరి మహాశ్వేతా చంద్రాపీడులవైపు ఒక్కసారి పాభిప్రాయంగా చూసింది. సరే ఎవరికీ ఇబ్బంది కలుగకూడదు. అతడు వచ్చినందుకే సంతోషం. అతడికి వెళ్ళే ఏర్పాట్లు చేయిద్దాం.

అని కేయూరకుణ్ని పిలిచి—ప్రయాణానికి కావలసిన యేర్పాట్లన్నీ జాగ్రత్తగా చెయ్యమని ఆజ్ఞాపించింది.

చంద్రాపీడుడు ఆ యిద్దరి పవిత్ర స్నేహాన్ని చూసి చాలా సంతోషించాడు.

—

కేయూరకుడు చేసిన ప్రయాణపు ఏర్పాట్లకు చంద్రాపీడుడు చాలా తృప్తి చెందాడు.

తన గమ్యానికి త్వరగా చేరుకున్నాడు. వైశంపాయనుడూ, సైన్యమూ పరివారజనమూ ఇతనిరాకకు ఎంతో సంతోషించారు.

: వి లా స వ తి :

విలాసవతి తారాపీడుని భార్య — అని మన కిదివరకే తెలుసు. ధర్మపత్ని అంటే ఎలా ఉండాలి? అన్న విషయం ఈ పాత్రలో బహు రమ్యంగా చిత్రించాడు మన బాణభట్టు.

తన భర్తకు చిన్నపాప లంటే ఎంత మక్కువో అర్థం చేసు కుంది. అసలు ఆ కోరిక పురుషులకంటే స్త్రీలకే ఎక్కువగా ఉంటుంది.

పురుషులకు వెయ్యి కార్యక్రమాలు ఉంటాయి గనుక పిల్లలు లేరనే చింత అంత పీడించదు.

తల్లికి ఇక వేరే విధంగా కాలాన్ని దొర్లించే మార్గం ఉండడం కష్టం గనక పసివాళ్ళకోసం పరితపిస్తూ ఉండడం సహజ లక్షణంగా కనిపిస్తుంది.

ఆడపిల్లలు ఎప్పుడూ బొమ్మల్తో ఆడుకుంటారు. వాటినే మా అమ్మాయి మా అబ్బాయి అనుకుంటూ వాళ్ళ అల్లరి చేస్తున్నట్టూ వాళ్ళని తను మందలిస్తున్నట్లూ ఇలా ఊహాప్రపంచంలోనే చిత్రించుకుంటూ చిత్ర విచిత్ర కల్పనలు చేసుకుంటూ ఆడుకుంటారు.

వివాహయోగ్యత వచ్చేసరికి చిన్నప్పుడు వాళ్ళు ఆడుకుంటూ ఉన్న బొమ్మకే ప్రాణం పోసేటి భగవంతుడు వాళ్ళకి ప్రసాదించి నట్లుగా పెండ్లి కాంగానే తమ సంతానం చూసుకుని మురిసిపోతూ ఉంటారు సహజంగా స్త్రీలు.

వివాహం అయిన కొన్ని మాసాలనుంచే అందరూ విశేషం ఉందా! అని ప్రశ్నిస్తారు. పడతి సంతానవతి అయితేనే సగర్వంగా చెప్పుకొని సంతోషించగలదు. పాపం విలాసవతికి — ఆ భాగ్యం ఎంతకీ కలగలేదు.

భర్త ఎంత అనుకూలుడూ అనురాగ సముద్రుడూ అయినా చిన్న పాపను కనలేకపోయిన చింత తనకంటె తన భర్తకే ఎక్కువగా ఉంటోంది. ఈ సమస్యా పరిష్కారం ఎలా? గుండెల్లో బాధ లాంటి బండ ప్రవేశించకుండానే ఉండాలి గాని ప్రవేశించిందో అది ఎంతటి మనిషినైనా కొంగతీసే తీరుతుంది.

విలాసవతికి ప్రకృతి అంతా తన్ని చూసి పరిహసిస్తున్నట్టే అనిపించింది. సృష్టిలో పశువులూ, పక్షులూ, పూలచెట్లు, కూరగాయల మొక్కలూ, పండ్లచెట్లూ, ఇలా అన్నీ వాటి ధర్మాన్ని అవి ఎంతో, ఏపుగా పెరిగి వాటి జీవితాలు ముగిసేలోగా కొన్నింటిని తమ ప్రతిరూపాలుగా చిత్రించుకుంటున్నాయి. గాలికి అవి చక్కగా ఊగుతూ వాటి సంతోషాన్ని వ్యక్తం చేస్తున్నాయి. కాలం నడిచినకొద్దీ సృష్టిలో ఏది చూసినా హేళనగా తనని కొట్టవచ్చినట్లుగా గట్టిగా కనిపిస్తూ ఉంటే మరి తట్టుకోలేక తల్లడిల్లిపోయింది.

సంతాన ప్రాప్తికి ఎవరు ఎప్పుడు ఏది చెపితే ఆ క్షణంలోనే అవన్నీ పాటించేది.

యశోద కృష్ణుడికోసం ఎన్నిపాట్లు పడిందో అలాగే ఆవిడా చెయ్యవలసినవన్నీ చేసింది.

కనిపించిన రాళ్ళకెల్లా మొక్కి కన్నారా కన్నతండ్రి అన్నట్లు చివరకు చంద్రబింబంలాంటి చంద్రాపీడుణ్ని కడుపారాకంది.

కుల దీపకుడులాంటి ఒక్క కొడుకే చాలు వజ్రంలాంటి కుఱ్ఱాడు. అందానికి అందం, గుణానికి గుణం, చదువుకి చదువు, బుద్ధికి బుద్ధి - శౌర్యానికి శౌర్యం వినయానికి వినయం. అబ్బా - అన్ని సద్గుణాలూ రాశిగా వచ్చేసి చంద్రాపీడుడిలో గూడుకట్టి కూచున్నాయి.

ఆ తల్లికి అంతకంటె ఇంకేం కావాలి? కొడుకు చదువుకీ, జైత్రయాత్రకీ వెళితే మళ్ళీ చూసేదాకా కళ్ళుచెమ్మగిల్లుతూనే ఉండేవి.

వైశంపాయనుణ్ని తేవటానికి చంద్రాపీడుడు వెళతానంటే ఆవిడకు ఏమాత్రం ఇష్టం లేకపోయింది.

మహాశ్వేత వైశంపాయనుడికి చిలుకవైపో అని తను శాపం ఇచ్చాను అని చెప్పంగానే చంద్రాపీడుడు విలవిల్లాడి పడిపోయాడు.

ఆ వార్త వింది ఆ తల్లి. కొడుకుకోసం గోలుగోలున ఏడ్చింది. అరణ్యంలోకి వచ్చింది. బంగారపు బొమ్మలా ఉన్న కాదంబరిని చూచింది. కదలికలేని కొడుకుని చూచింది. ఈవిడ వస్తూన్న సంగతి విని కాదంబరి కళ్ళు తిరిగి పడిపోయింది. తారాపీడుడి ఆదేశంచేత స్పృహ తప్పిన కోడల్ని ఉపచారాల్తో సేదతీర్చింది. ఆప్యాయంగా దగ్గరకి తీసుకుంది "అమ్మాయీ నీ పుణ్యమా అని మళ్లీ నా కొడుకుని చూసుకుంటాననే ఆశ వచ్చిందమ్మా మళ్ళీ మా ప్రాణాన్ని నిలబెట్టావు" అని ఎంతో ఆదరించింది.

ఇప్పటి కాలపు అత్తల్లా నా కొడుకు ప్రాణానికి నువ్వు ఎక్కడ వేదాపురించా శనిగొట్టా! అని తిట్టుకోలేదు సరికదా కాదంబరి కళ్ళల్లో ఉన్న బాధసంతా వెయ్యికళ్లతో కనురెప్ప పాటులో వేచదిసింది.

ఆ పిల్ల తన కొడుకును సేవిస్తున్న విధానం అంతా చూసి ఆశ్చర్యచకితురాలైంది.

శుకనాశుడు 'ఏడవకండమ్మా! దేవతాపూజలు చెయ్యండి చంద్రాపీడుడు జీవిస్తాడని' చెప్పిన మాటలమీద ఆదరం ఉంచి అలాగే చేస్తూ వచ్చింది.

శాపావసానం అయి కొడుకు జీవించాక, ఎంతో సంతోషాన్ని పొందింది.



రతీ మన్మధుల్లా సీతారాముల్లా చిలకా గోరింకల్లా ఉన్న ఆ కొడుకునీ కోడల్నీ చూసుకుంది. తనివితీరా! ఎప్పుడూ వాళ్ళు అలాగే ఆనందంగా హాయిగా ఉండాలని దీవించింది.



కళ్ళ వేడుకగా, వాళ్ళ వివాహం చూసుకుంది. ఇక తనకి కావలసిందేముంది ?



తనకి ఆడపిల్లలులేని చింత తీర్చింది, కాదంబరి కన్నకూతురిలా, కంటికి రెప్పలా చూసే కోడలు రావడం కంటె ప్రపంచంలో ఆడవాళ్లకి మరి కోరతగిందేమీ ఉండదు.

ఇలా విలాసవతీదేవిని భారతీయ మహిళగా, ప్రేమమూర్తిగా, అపర అరుంధతిలాగా సృష్టించాడు. తారాపీడుడి పాత్రకి ఏమాత్రం తీసిపోనిపాత్ర విలాసవతిపాత్ర. బాణునిచేతిలో పాత్రలు పఠితల హృదయాల్లో చిరస్థాయిగా చెరగని ముద్రల్లా ఉంటాయి. బాణుని పడతుల చిత్రణ బహు ప్రశంసాపాత్రం.

: బా ణు ని సూ క్తు లు :

స్వస్యైన అవినయస్య ఫలం అనేన అనుభూయతే

అది చేసిన ఆ తెలివితక్కువకు ఫలితం అదే అనుభవిస్తూంది.

జాబాలి వైశంపాయనుణ్ణి చూడంగానే అక్కడ మునులతో ఇలా చెప్పాడు.

"కిమి వహి దుష్కర మకరుణానాం

కరుణా విహీనులకు చేయలేని పనేముంది.

"అపుత్రాణాం కిల గతిర్నాస్తి"

పుత్రులు లేనివారికి సద్గతులు లేవుగదా !

"శూన్యమేవ మే ప్రతిభాతి జగాత్"

సంతానం లేకపోవడంచేత నాకు ఈ జగత్తంతా శూన్యం కనిపిస్తోంది.

"అహో కళ్యాణపరం పరా సత్యోయం జనప్రవాదోయమ్ ద్విద్విపద్ సంపత్సంపదమను బధ్నాతి"

విపత్తులమీద విపత్తులూ, సంపదలమీద సంపదలూ పరంపరగా వస్తూఉంటాయి అన్న జనవాక్యం సత్యంగా కనిపిస్తూంది.

"అహో ప్రభావో మహాత్మానామ్"

మహాత్ముల ప్రభావం చాలాగొప్పది గదా !

"నాస్తి జీవితా దస్య దన్యభిమతం ఇహ జగతిహి సర్వజంతూనాం

ప్రపంచంలో తమ జీవితంకంటె తమ జీవితాశ కంటె ఇంకొకటి ఏ విలువైంది కాదు.

"అతి కష్టాసుదశాస్వపి జీవిత నిరపేక్షా నభవంతిఖలు జగతి ప్రాణినాం ప్రవృత్తయః"

జగత్తులో ఎంతెంతటి కష్టాలు ప్రాప్తమైనా ప్రాణి అను వించడానికే ఇష్టపడుతుంది, కాని ప్రాణాన్ని పరిత్యజించడం అం ఏమాత్రం ఇష్టపడదు.

"ప్రాయేణ అకారణ మిత్రాణి అతికరుణార్ద్రాణి సతాం ఖలు సదా చేతాంసి".

సత్పురుషుల హృదయాలు అతి దయార్ద్రములూ ప్రతిఫలాపేక్ష రహితములూ అకారణ మిత్రాలూగా ఉంటూ ఉంటాయి.

"అతి కృపణాః ఖలు అమీప్రాణాః."

ఈ ప్రాణాలు తండ్రిపట్ల చాలా విశ్వాసఘాతుకమైనవి గదా!

"జగతి జన్మనో వయసః ఆకృతేర్వా సదృశమాచరన్నవచనీయ తామేతి"

జన్మమునకు వయస్సునకు ఆకృతికి అనుగుణ్యంగా ప్రవర్తించు వా డెవ్వడూ నింద్యుడు కాడు.

"ధర్మపరాయణానాం హి సదా సమీప సంచారిణ్యా కల్యాణ సంపదో భవంతి".

కళ్యాణ సంపదలు ఎల్లప్పుడూ ధర్మాచరణ బద్ధులగువారి సమీపంలో సంచరిస్తాయి.

"అవితథ ఫలా హి ప్రాయోనిశావసాన సమయే దృష్ట్వా భవంతి స్వప్నాః"

తెల్లవారుఝామున వచ్చిన స్వప్నాలు సత్యంగా జరుగుతా యంటారు పెద్దలు.

: తా రా పీ డు డు వా త్ర :

రమణీయం అయిన ఉజ్జయినీ పట్నాన్ని తారాపీడుడు అనేరాజు పరిపాలిస్తూ ఉండేవాడు.

అతడు సర్వసద్గుణ సంపన్నుడు, యావత్ప్రజానీకానికీ కన్న తండ్రిలా ఉండేవాడు-రాజు అంటె ప్రజలకు ప్రధానసేవకుణ్ణి అన్న మాట ఎప్పుడూ అతడు మరచిపోలేదు.

అతడికి సర్వవిద్యా సంశోభితుడైన మంచి మంత్రి ఉన్నాడు– అతడి పేరు శుకనాసుడు. మంచి రాజనీతి గలవాడు, అనుభవజ్ఞుడు.

తారాపీడుడికి లేంది ఏమీ లేదు, అన్నీ ఉన్నాయి. సమస్త సుఖాలూ సంతోషంగా అనుభవిస్తున్నాడు. అయితే ఎంత కాలానికీ ఇతడికి సంతానంమాత్రం కలగలేదు. పున్నమచంద్రుడు లాంటి పుత్రుడిముఖం చూడాలని, పున్నామనరకంనుండి రక్షించే పిల్లవాడు లేడే అని తహతహ లాడేవాడు. సృష్టిలో ప్రాణికోట్లు తమ జీవిత సార్థక్యం తమ్ము తాము ప్రతి సృష్టి చేసుకుని తమ ముఖాలని అద్దంలో చూసుకున్నట్టు పాపల కనుపాపలలో తమని తనివితీరా చూసుకుంటూ అలవిగాని ఆనందాన్ని అనుభవిస్తూ ఉంటారు.

గోవుకూడా తన లేగదూడను ఎంతో గోముగా కన్నకడుపు తీపిని దాచుకోలేక నాలుకతో గుండెలో తీపిని ఆకంఠ కందిస్తూ నాకుతూ ఉండడం మనం చూస్తూనే ఉంటాం. తారాపీడుడూ రాజకీయ కార్యక్రమాలతో తల వేడెక్కినప్పుడు విశ్రాంతికోసం అంతఃపురానికి వెళుతూ ఉంటాడు. విలాసవతి అతడికి అన్నివిధాలా తగిన భార్య—సుఖ దుఃఖాలు పంచుకొనే జీవిత భాగస్వామిని.

అందుకని ఆనందంకోసం ఆవిడ అంతఃపురానికి వెళ్ళాడు.

అనురాగం అనే అమృతకాంతులతో పూర్తిగా నిండిన పూర్ణ చంద్రబింబంలా ఉండే భార్య ముఖమండలాన్ని చూసి, కన్నారా చూసుకు ఆనందించేందుకు, ఒక కనుకున్న చిన్న నలుసులేదే అని కనలి, కనలి కుములుతున్న కలువా! అన్నట్టున్న ముఖంతో మన భూకాంతుడు—కాంతాముఖావలోకనంతో కాస్త తృప్తి చెందాలని అడుగు పెట్టాడు. అంతఃపురంలో—

వాతావరణం అంతా చాలా నిస్తబ్ధంగా ఉంది. ఎక్కడా ఉత్సాహ సంతోషాలు ఆ మందిరంలో మచ్చుకైనా కనపడ్డంలేదు.

శుక శారికాదులు కూడా మౌనం వహించాయి. పరిచారికలు ఇతణ్ని చూసికూడా తలలువంచి తలుపులపక్కకి తొందర తొందరగా తప్పుకుంటున్నారు. చిన్న మందహాసంతో ఏ ఒక్కముఖం తన రాకకి స్వాగతం పలకడమే లేదు. ఎందుకు వచ్చాడా! ఇతను అని చేతనా అచేతనాలన్నీ కూడబలుక్కుని కూచున్నట్టు మౌనముద్రలో ఉన్నాయి. పక్షులైన చిలుకలే పలుకరించకపోతే ఇక మనుషులమాట చెప్పే దేముంది? అసలే పిల్లలు లేరనే ఆరాటంతో ఎంతో తపనగా ఉంది అతని హృదయపద్మం. మంచుతునకల్లా ఉన్న మనుష్యులు, దుఃఖమనే పొగమంచు అంతటా ఆవరించి ఉందా అన్న వాతావరణం. దాంతో మనోపద్మం ముకుళించుకుపోయింది. ఇంటిలో ప్రతి ఇటికలో అదే భావం ప్రస్ఫుటంగా కనిపిస్తోంది.

ఏ విశ్రాంతికోసం — ఏ ఆనందంకోసం — ఏ ఆప్యాయతకోసం ఏ అనురాగం కోసం ఎంతో ఎంతో ఆశించి ఆశించి వచ్చాడు మన తారా పీడుడు ఇక్కడికి.

మానవుడు పుట్టిందగ్గరనుంచీ కోరేది తన ఏడుపుని ఓదార్చాలనీ, తన నవ్వుల్ని పంచుకోవాలనీ, తన విద్యలుచూసి అంతా సంతోషించాలనీ, తానూ అందరిలో పాలల్లో నీళ్ళల్లా కలిసి ఉండాలనీ. కొలతకు విలువలు అందని మానవ హృదయాల్లోంచి ఆప్యాయతా అభిమానాలనే అమృతాన్ని అపరిమితంగా ఆస్వాదించాలనీ, అభిలషిస్తూ ఉంటాడు. ఏది కోరతాడో మానవుడు అది మృగ్యం అవుతూ ఉండడం కూడ సహజమే గదా!

కొండంత ఆశతో వచ్చాడు—తనయుడికోసం తను పడే తపనని చల్లార్చుకుని సేదదీరాలని—

కాని ఏంలాభం. ఇక్కడ పరిస్థితి చూస్తూఉంటే ఆ నీరవ వాతా వరణం ఇతణ్ని నీరుగారేటట్లు చేస్తూంది. గుండెలు పిండుతూన్నట్టుంది బాధ—కమలిన కమలంలా ఉంది, ముఖం. కుములుతూనే కులకాంతను ఒక్కమాటు ఎంతో సాదరంగా కన్నెత్తి చూశాడు.

ఆవిడ కళ్ళల్లో నీళ్ళు సుళ్లు తిరుగుతూ ఉన్నాయి. పలకరించాలని వచ్చిన భర్తని కన్నెత్తి చూడలేకపోయింది. పన్నెత్తి పలుకరించలేదు సాదరంగా చేయిచాపడానికి కూడా చెమటలు పట్టాయి. విశాల విశ్వంలో ఉన్న శోకం అంతా ఎత్తివచ్చి ఈవిడనెత్తిన కూచుందా! అనిపిస్తూంది. ఏ ఆనందం విశ్రాంతీ ఆశించి వచ్చాడో అది ఆవగింజంతైనా అందుకో లేకపోయాడు.

అడుగు ముందుకీ పడదు, వెనక్కీ పడదు. ఉండలేదు, వెళ్ళి పోలేదు, ఆ వాతావరణాన్ని చూడలేదు, మానలేదు, అందరినీ సాద రంగా పలకరించలేదు, పడతుల్లా పరదాల్లోకి పరిగెత్తలేదు, తనబాధని అర్థం చేసుకొనే ప్రాణి, ఒక్కటైనా లేదే ఇలా బిక్కమొహంతో క్షణ మొక యుగంగా, సంతోషం అనేది ఎక్కడా ఒకలేశమైనా దొర క్కుండా ఉంది. గుండెల్లో బాధ ద్విగుణీకృతమైంది.

ఎలాగో మొత్తానికి—కులవర్ధన అనే పరిచారిక రాజుగారికి రాణీగారికి కూడా చాలా సన్నిహితంగా ఉంటుంది. ఆవిడని అడిగాడు ఇలా ఉండడానికి హేతువేమిటి? నేనూ నా సేవకులూ ఎవరూ రాజ్ఞి పట్ల ఏ అనుచితాలూ చెయ్యలేదు గదా అన్నాడు.

కులవర్ధన సవినయంగా తలవంచి నిట్టూర్చి "మహారాజా ఎవరూ ఆవిడపట్ల ఎలాంటి అవిధేయతా చూపలేదు. మీరు కల్లో అయినా కష్టం కలిగించనే కలిగించరు. అసలు ఇంతకూ ఈ సంత కంతటికీ కారణం

విలాసవతీదేవిగారు, దేవాలయానికి వెళ్ళారు. ఇవాళ అక్కడ పురాణంలో "అపుత్రస్య గతిర్నాస్తి" అని చెప్పారు. పుత్రులు లేకపోతే గతులుండవు అన్నమాట ఆమెకు పదునైన శూలంలా హృదయంలో సూటిగా గాఢంగా నాటింది. అప్పట్నించి అన్నం నీళ్ళు తాకనే లేదు. ఆభరణాలు ధరించదు—ఒకటే కన్నీళ్ళు తలదిండ్లు అలా తడిసి పోతూనే ఉన్నాయి. ఆవిడకు ఉత్సాహం లేకపోతే మేమంతా ఇలా నీళ్ళుగారి పోతున్నాము——ఈ విషయం ఏం సంతోషమని మీకు చెప్పం"—అంది.

అన్నీ విన్నాడు రాజు విలవిల్లాడి పోయాడు. చల్లగా విలాసవతి శయ్యదగ్గరకు చేరుకున్నాడు. ఒక తట కన్నెత్తి ఆవిణ్ణి చూడ్డానికి కూడా జంకి కూచున్నాడు—ఎవరినుంచైనా ఓదార్పు వస్తుందనేసరికి ఉన్న దుఃఖం ఒక్కసారి పెల్లుబుకుతూ ఉండడం కూడా సహజమే అందులోనూ అణువు అణువునా అనురాగం నిండిన రాజు ఓదార్చబోతున్నాడంటే ఇక ఆవిడ దుఃఖానికి అవధులే లేవు. కట్టలు తెంచుకు ప్రవహిస్తోంది. గోముగా తల నిమిరి ఎందుకు ఇంత ఏడుస్తావ్? మనం ఏం చెయ్యగలమో చెప్పు నీను చి ఊరట పొందాలనే వచ్చాను. నిన్ను ఊరడించాల్సి వచ్చింది. ఈ బాధ మనిద్దరికీ సమానమే. నువ్వెంత బాధ పడుతున్నావో నేనూ ఊహించగలను నువ్వు పైకి బాధపడుతున్నావు. నేను లోలోపలే కుములుతున్నాను. నాకుమాత్రం కోరికగాలేదూ చెప్పు? నీవు గర్భవతిగా ఉంటె చూసి సంతోషించాలనీ నీకు కావలసిన వన్నీ ఏర్పాట్లు చేయించాలనీ—ఆపై నెత్తురు కందను ఎత్తుకు బాలింతగా నువ్వుంటే కళ్ళారా చూసుకుందామనీ — ఆ పిల్లవాడి ఏడుపు వింటూ ఆనందించాలనీ బొద్దుబొద్దుగా ఉండి బోసినవ్వులతో ఇల్లంతా నింపితే చూసుకోవాలనీ ఆటలాడుకువస్తే వాడి వంటిధూళిని ప్రేమతో నా బట్టతో తుడిచి ఎత్తుకు లాలించాలనీ తనివితీరా తనయుణ్ణి హృదయానికి హత్తుకుని ఆదరించుకోవాలనీ ఎన్ని ఎన్ని కోరికలున్నాయో నీకు చెప్పలేను.

అసలే నువ్వు బాధపడుతూంటే నేను ఏం చెప్పుకోను—నా భావనలో ఎలా ఎలా ఊహించుకుంటూ ఊరట చెందుతున్నానో తెలుసా! ఉంగరాలు ఉంగరాలు తిరిగిన ఒత్తుగా నల్లగా ఉన్న జుట్టు అర్ధ చంద్రుడులాంటి నుదురు అందం అయిన చెవులు—చక్కగా తీర్చిదిద్దిన సోగలైన కను బొమ్మలూ తామర రేకులకంటె అందమైన కళ్ళు—అబ్బా ఆ కళ్ళు ఎంత బాగుండాలంటె ఎప్పుడూ అందరి కళ్ళూ ఆ కళ్ళమీదే పడాలి. అన్నమాట చిక్కతే పాలుగారే చక్కని చెక్కిళ్ళు ముద్దులు మూటకట్టే ముక్కు— మూడేళ్ల ప్రాయంలో ముద్దు ముద్దుగా నడుస్తూ ఉంటే ఇంటికి ఎంత శోభగా ఉంటుందో చెప్పు. ఒక్క పిల్లవాడైనా వందలాది అద్దాలలో ఆముద్దుల నాన్నను వందరూపాలుగా చూసుకోవాలని ఉంది. వజ్రాల మందిరంలో లేత గులాబిరంగులో ఉండే బాబుని గోడల్లో ప్రతిబింబించే రూపం చూసుకు మురిసే సుదినానికి నోచలేదా? వాడి తామర రేకులలాంటి కళ్ళు ఈ మందిరంలో ప్రతిబింబించి తామరరేకుల తోరణాలా అన్నట్టుండాలి. పిల్లవాడి నవ్వులుచూచి చందమామ సిగ్గుతో మేఘాలచాటుకి పారిపోవాలి—అరవిందం లాంటి పాదాలతో ఇంట్లో చిన్న చిన్న అడుగుల్తో నడుస్తూ ఉంటే ఇల్లంతా మెట్టతామరలు పరచారా అన్నట్టుండాలి. చిన్నారినాన్న నవ్వుతూ ఉంటే ఇల్లంతా ఆ నవ్వుల పువ్వులు జల్లులు చూసి నా హృదయం చల్లబడే దెప్పుడో? ఇలాంటి తపనతో వేగిపోతున్నాను. నువ్వైనా కళ్లకి నిండుగా లేకపోతే నేనేం చెయ్యగలను.

ఇంతకీ మనం దేనికీ కర్తలం కాం. విధివిలాసాన్ని ధిక్కరించడం ఎవరికీ సాధ్యం కాదు కదా! మనం మనసా దేవతల నారాధిద్దాం. ఋషులను సేవిద్దాం, మహర్షుల అనుగ్రహం ఉంటె అసాధ్యమైంది ఏముంటుందో చెప్పు ఋష్యశృంగుడి దయవలన దశరథుడూ చండకౌశికుడి మహిమచేత బృహద్రథుడూ పిల్లలని కనుక్కున్నారు. తప్పకుండా మనకికూడా ఆ కోరిక నెరవేరుతుంది అంటూ ముఖం పన్నీ

టితో కడిగి కళ్ళు తుడిచాడు—లే, లేచి, సింగారించుకో విధి విహితమైన పన్నీ, నిర్వర్తించు—మన మనోరథం నెరవేరుతుంది అంటూ అతి ప్రేమగా ఆవిణ్ని లాలించాడు—కొడుకు లేడనే వేదనతో కుమిలిన కలువలా ఉండే ఆవిడ హృదయోత్పలాన్ని ఆ రాజు అనురాగపు పన్నీటి జల్లులతో తడిపి తడిపి మెల్లగా సేదదీర్చాడు.

బాణుడి చేతిలో తారాపీడుడి పాత్ర నిజంగా తారామండలాన్ని అందుకుంది. చంద్రాపీడుడు పుట్టాక చదువు సంధ్యలు పూర్తి అయాక పట్టాభిషేకం చేశాడు. కొడుకు దిగ్విజయ యాత్ర సాగించాడు—అతడికి మధ్యలో మహాశ్వేత తటస్థపడింది తరువాత కాదంబరిని చూస్తాడు—తండ్రి అనతిమీద ఇతడు రాజ్యాన్ని పరిపాలిస్తున్నాడు.

వైశంపాయనుణ్ని తీసుకురావాలని వెళ్ళాడు వైశంపాయనుడు చిలుకయిన సంగతి శ్వేత చెప్పంగానే పడిపోయాడు.

రూపంలో మన్మథుణ్ని మించాడు. పరాక్రమంలో రాముడు పరశురాముడు, అర్జునులకు ఈ చంద్రాపీడుడు తీసిపోడు. సమస్త విద్యలతో సంశోభిస్తున్నాడు.

అలాంటి కొడుకుని తనివితీరా చూసుకున్నాడు తారాపీడుడు. ఎంతసేపు చూసుకున్నా తృప్తి అనిపించదు—అట్టై గట్టిగా చూసుకుంటె కొడుక్కి దిష్టి తగుల్తుందేమో అని జంకుతాడు. విలాసవతితో అంటాడు.

కొడుకుని చూసుకు మురిసిపోతూ ఉండడమేనా మంచికోడల్ని గురించి ఏమీ ఆలోచించవు? ఎందుచేత అంటాడు.

చంద్రాపీడుడు ఇప్పుడె కాదంబరి విషయం చెప్పెయ్యాలి అని అనుకుంటాడు—ఎందుకైనా మంచిదని తటపటాయించాడు. చెప్పలేదు.

కాదంబరి వచ్చింది. ఆ తరువాత ఇతడి దేహాన్ని గ ర్వుడు తిరిగి జీవిస్తాడు నీ చేతుల్లో అమృతం ఉంది. పీణ్ని రక్షిస్తూ ఉ డు అం టాడు. తరువాత శూద్రకుడే చంద్రాపీడుడవుతాడు. కాదంబరిని వివాహం చేసుకుంటాడు.

అయితే ఈ కొడుకు కోసం తారాపీడుడు రాజ్యాన్ని వదిలేసి అరణ్యంలోకే వచ్చేస్తాడు. కోడలు కాద బరిని చూసుకుని నిర్జీవుడు స జీవుడుగాని కొడుకుని చూసుకున్నప్పుడూ అతని ఆవేదన అపారం.

మళ్లీ కాదంబరి చేతిలో కొడుకు సజీవుడయిందాకా విలవిల లాడాడు. అన్నీ పరిత్యజించాడు జీవచ్ఛవంలాగే ఉన్నాడు. కాదంబరి సంరక్షణలో. నాయకుడు చంద్రాపీడుడే అయినా భట్ట చేతిలో కొంత కాలం ఇతడు చైతన్యంలేని స్థితిలో ఉండిపోయాడు—గనుక కొన్ని నాయక లక్షణాలు ఇతడిలో మనకి కనిపిస్తాయి.

'ధార్మికత్వంచ'

కులవర్ధన విలాసవతి గర్భవతి అన్న విషయం చెప్పంగానే ఎంతో సంతోషంతో తన ఆభరణాలన్నీ ఆవిడకు బహుమానంగా ఇచ్చేశాడు.

సర్వాతిశాయి సామ్రాజ్యం మహాభాగ్యము దాహృతమ్ శత్రు శేషంలేని మహాసామ్రాజ్యం పరిపాలిస్తే మహాభాగ్య మంటారు.

తారాపీడుడు రాజ్యాన్ని అలా పరిపాలించాడు గనుక ఈ పై లక్షణం తారాపీడుడికి చంద్రాపీడుడికీ కూడా వర్తిస్తుంది.

కపింజలుడు మహాశ్వేతతో పుండరీకుడు మహాశ్వేతమీద మోహా వేశాన్ని తట్టుకోలేక తల్లడిల్లుతున్నాడు. చంద్రకిరణాలు అతడికి అగ్

కోలేనంత వేడిని నిచ్చాయి. అది భరించలేక—సుప్వా నాలాగే ప్రేమించిన స్త్రీ కోసం జన్మజన్మల్లో ప్రాణాలు విడిచేస్తావని శపించాడు. తను స్వదోషంచేత తనబాధను తట్టుకోలేక నాకు శాపం ఇవ్వడం ఏమిటిది? అని నాకేశాపం ఇచ్చావో ఆ సుఖదుఃఖాలూ నువ్వు నాతో సమానంగా అనుభవిస్తావు సుమీ అని అతడు ప్రతిశాపం ఇచ్చేశాడు.

నిదానంమీద మహాశ్వేత ప్రేమికుడు పుండరీకుడని తెలుసుకున్నాను. చాలాబాధపడి ఆ పుండరీకుణ్ని దేవలోకంలోకి తెచ్చి కాపాడుతున్నాను. చంద్రాపీడుడికీ పుండరీకుడికీ ఈ శాపాల్లోనేగాక జన్మలు ఏవైనా అతి సన్నిహితం మాత్రం ఎప్పుడూ ఉంటుంది. అందుచేతే శూద్రకుడూ వైశంపాయనుడూ, చంద్రాపీడుడూ శుకనాసుని కొడుకు వైశంపాయనుడుగా ఉంటూ వచ్చారు.

మహాశ్వేత ఎప్పుడైతే వైశంపాయనుణ్ని చిలుక అయిపోమని శపించిందో ఆ వార్తవిని ఆపైకొన్నిక్షణాల్లోనే చంద్రాపీడుడు కూడా నిర్జీవంగా పడిపోయాడు.

కాదంబరి ఇక్కడికి వచ్చి దృశ్యం చూచి అంతిమ సందేశాలూ అప్పగింతలూ అన్నీ మదలేఖతో చెప్పి అగ్ని ప్రవేశానికి ఏర్పాట్లు చేయించమని తనవాళ్ళకి ఆజ్ఞాపించింది.

ఈ తెంపుచూసి ఆకాశంలోంచి ఒక చల్లనిమాట వినపడింది. చంద్రాపీడుడిలోంచి ఒక దివ్యకాంతి పైకి వెళ్ళిపోయింది.

"అమ్మాయీ కాదంబరీ—నువ్వు ఇప్పుడు ఏ ఘోరమైన సాహసానికీ ఒడిగట్టకమ్మా ఇతడు శాపంచేత మాత్రం ఇలా అయాడు తిరిగి శాపానంతరం తప్పక జీవిస్తాడు సుమా? నీకు నమ్మకం కోసమే ఇక్కడే ఉంచేశాను—ఇతణ్ని—పుండరీకుడు శరీరం మా దగ్గర మహ

జాగ్రత్తగా ఉంది. కనుక ఖంగారుమాని నిదానంగా ఇతడికి సే
చేస్తూ ఉండు. నీ చేతుల్లో అమృతం పర్షిస్తుంది, అందుచేత ఆశరీర
మృతం కాదు. నీ ధైర్యం సేవా, తపస్సు ఫలిస్తాయి నీ మనోభీష్ట
నెరవేరుతుంది. అన్నమాటలు కాదంబరీ అక్కడి వాళ్లంతా విన్నా
విస్మయంతో తలమున్కలై పోయారు.

ఈ విషయం తారాపీడ మహారాజుకి అందింది. ఇక అతని వేదన
ఇంతా అంతాకాదు. కానక కానక కనుక్కున్న నలుసు—వాణ్ని చూస
కునే సంతోష సాగరంలో ఒలలాడుతున్నాడు పూర్ణ చంద్రోదయం
అనగా పౌర్ణమికి అబ్ధి ఎంత ఎత్తున సంతోషాన్ని అణుచుకోలేక కెరటాల
ధ్వనులతో కేరింతాలు కొడుతూ ఉంటుందో అలాగే జీవితం అనే సాగ
రంలో చంద్రాపీదుడు అనే పూర్ణ చంద్రబింబాన్ని చూసుకుని తారా
పీడ విలాసవతులు నిత్యం సర్వం పర్వదినంగా భావించి ఆనందంతో
హాయిగా జీవిస్తున్నారు.

ఒకనాటి ఉదయం అచ్ఛోద సరస్తీరం నుంచి ఒకవార్త
వచ్చింది.

వాడిని పిలిపించారు లోపలికి—వాడు తల నేలకు వ చేశాడు.
కనురెప్పలు అసలు ఎత్తడమే లేదు—ముఖం పూర్తిగా ముడుచుక
పోయింది. ఎండ తాకిడికి వాడిపోయిన కలువలా! ఊర్పులు ఉండి ఉండి
వినపడుతున్నాయి. ఏదో చెప్పలేనంత మహా విషాదవార్త మోసుక
వచ్చాడని వాడిముఖం చెప్పకుండానే చెపుతోంది.

విలాసవతి ఒకసారి చూసింది వాడివైపు—ఆకళింత అయింది.
వాడితో నాయనా! నిన్ను చూస్తేనే తెలుస్తోంది—ఇక్కణ్నించి వెళ్ళిపో
ఏదో దురంతవార్త తెచ్చావ్—ఇక వినలేను చూడలేను — అని చాలా వి
విసలాడుతోంది.

తారాపీడుడు_విషయం తెలుసుకోందే విషాదంలో మునగడం దేనికి? అని ధైర్యంచేసి దగ్గిరకు పిలిచి, వీపుతట్టి ఎలాంటి మాట వినాలో అని గుండెలు దడదడలాడుతూ ఉంటే .చెప్పు ఏమిటో బాధ పడి నువ్వూ మేమూ మాత్రం చేసేది ఏముంది అన్నాడు.

వాడు చిన్నగా జరిగిన సంగతి చెప్పలేక చెప్పలేక చెప్పాడు చంద్రాపీడుడు రాలేదు, రాడు. ఇంతలో రాబోడు_అని ఆ మాట విన్నారు వారు, హృదయాలు కుతకుత ఉడుకులెత్తాయి — నోట వ లేదు. చూపులు స్తంభించాయి. ముఖాలు కందగడ్డల్లా మారాయి గ డెల్లో బరువు, రెప్పలకి రాళ్లు కట్టారా అన్నట్టు అవి పైకి అసలు లే: డమే లేదు. నెత్తిన నీటిముంతలు ఒలికినట్టు కళ్లనీళ్ల ధారలు అలా జాలువారిపోతున్నాయి. ఈవిడకంటె వెయ్యిరెట్లు వేదనతో నిండి ఉంది తారాపీడుని గుండె. తరుణుల హృదయాలు పూతీగెలకంటె చాలా సున్నితాలు. పురుష హృదయాలు చెట్లకొమ్మల్లా రవంత రాటుదేరి ఉంటాయి. అందుకనే తారాపీడుడు విధిలేక విలాసవతి నీ విధంగా ఓదారుస్తాడు. "విలాసవతీ_విషాదమైన విషమఘట్టాలు సంప్రాప్తమై నపుడు విచారించడం విజ్ఞుల లక్షణంకాదు_కష్టాలు రావడమనేది మన చేతుల్లోలేదుకదా. చూడు ఇంతవరకు మనం అనుభవించని సుఖ సంతో షాలు ఏం ఉన్నాయి గనుక. విధివైపరీత్యానికి ఎంతటి వాళ్ళయి: తలవంచక తప్పదు. దుఃఖం తట్టుకోలేక మనం ఎంత నెత్తీ నోర మొత్తుకున్నా సాధించగలిగిందేమీ లేదు. తపస్సులు ధారపోయ అవి ఫలించి కంటబడ్డాడు_పసి నిసువు దగ్గర్నించీ ప్రౌఢుడు అయేదా అన్నీ చూసుకు సంతోషించాం, విద్యాబుద్ధులూ, బలపరాక్రమ చూసుకున్నాం_యువరాజ్య పట్టాభిషేకం_దైత్రయాత్రా విషయా విన్నాం_అంతా పూర్తిచేసుకు వచ్చిన కొడుకు పరాక్రమం వినా ఇక మిగిలింది వివాహం, రాజ్యభారం పూర్తిగా అప్పగించడం —

అయితే హాయిగా వానప్రస్థానికి వెళ్లవచ్చుతే అనుకున్నాను, కాని ఏం చెయ్యగలం చెప్పు. అయినా అక్కడివార్త ఏమిటో మనకి అందటి అసలు అచ్ఛోదన సరస్సుదగ్గిర చూసివచ్చిన వారున్నారట. ఆ సేవ కుణ్ణి, తీసుకురమ్మని చెప్పాడు—తీసుకువచ్చా డతణ్ణి సేవకుడు వాడు సరోవరం దగ్గిర జరిగిన విషయాలన్నీ చెప్పాడు – ఆ మాట అత డికి ఈటెపోటుకంటె గాటంగా అనిపించింది. వెంటనే ఆ తీరంలోనే తనకుకూడా సముచిత రీతిని చితి పేర్చమన్నాడు – దుఃఖాన్ని భరించ లేక ఎంతగానో దురపిల్లుతూనే ఉన్నాడు.

మెల్లిగా వచ్చిన కుల్లూడు—మహారాజా – విచారం మానండి నా మాట నిదానంగా వినండి—చంద్రాపీడుడు ప్రాణం విడిచాడని అంటు న్నారేగాని నిజానికి అది మృతస్థితి కాదు. కాదంబరి చేతిలో అమృతం ఉందట. ఆమె హస్త స్పర్శచేత అతడు నిద్రపోతున్నట్టె ఉంటాడు గాని నిర్జీవస్థితిలో ఉండడు—శరీరకాంతి తగ్గదు. ముఖం కొంచెంకూడా వసివాదదు. మిసిమి తగ్గదు. కళ్లు మూసుకు నిద్రపోతున్నట్టె ఉం టాడు. ఆలాగే ఉన్నాడు. నేను కళ్ళారా చూసివచ్చాను నా మాట నమ్మండి—

తరువాత జీవించడం సంగతి ఎలా ఉన్నా ఇప్పుడీమాట వినం గానే—తారాపీడుడు గుండెలు ఒక్కమాటు కుళ్లగించినట్లయింది. వెయ్యి గునపాలు ఒక్కమాటు గుండెల్లో దిగవేసినట్లయింది—ఆ బాధను భరించే కంటె జీవితం త్యజించడమే హాయి అనుకున్నాడు.

భటులని పిల్చి ఈవిధంగా ఆజ్ఞాపించాడు. "మహాకాళేశ్వరుడి ఆలయందగ్గిర అన్ని యేర్పాట్లు చేసెయ్యండి.

తను ఎవరికోసం ఇదంతా శ్రమపడి సంపాదించాడో అంతా నిరర్థకం కనుక ఆ డబ్బు దస్కం సమస్తం అందరికీ దానధర్మాలు చేసెయ్యమన్నాడు.

తనతోటి సామంతరాజు లందర్నీ వారివారి ప్రదేశాలకు వెళ్ళిపో మన్నాడు—

ఇక తనకి మరణమే శరణ్యం అనుకున్నాడు. మంత్రి శుక నాసుడు మహారాజా విలపించకండి ధైర్యంతో దైవకార్యాలూ ప్రార్థనలు చెయ్యండి తప్పక చంద్రాపీడుడు కాదంబరిని వివాహం చేసుకుంటాడు. మనం ఆనందంగా విధిగా వాళ్ళని ఆశీర్వదిస్తాం నా మాట వినండి అని ఓదార్చాడు.

శాపావసానం అయింది. చంద్రాపీడుడు జీవించాడు—ఈ వార్త మదలేఖ తారాపీడుడికీ విలాసవతికీ చెప్పింది — వైశంపాయనుడుకూడా జీవించాడంది. సుంగంధంలో తడిపిన మల్లెలజల్లులా అనిపించింది. ఆనందాన్ని పట్టలేక పోయాడు—మంచివార్త తెచ్చిన మదలేఖను ఎంతో. ఆదరంగా అభిమానంగా, ఆనందంగా, చేతులుచాపి గట్టిగా అప్పు కున్నాడు వెన్ను మీద తట్టాడు— అలకలు సవరించాడు—బుగ్గలు పుణికాడు తల్లీ మదలేఖా నా పాలిట అమృతవల్లివి. ఎంతమంచిమాట చెప్పావు— మళ్ళీ నా చంద్రాపీడుడు లేచాడా? నన్ను చూస్తాడా? మేం మళ్ళీ ఆనందంగా ఉంటామా? నా కలలన్నీ ఫలించాయా? నా కన్నారి నాన్న కళ్యాణం చూసుకునే అదృష్టం ఇన్నాళ్ళకి ఈ కళ్ళకి లభిస్తోందా? పద పద వెళదాం అంటూ ముందు విలాసవతిని చూశాడు ఆవిడని ఆనంద పారవశ్యంతో గాఢంగా ఆశ్లేషం చేసుకున్నాడు. అతడి ఆనంద పారవశ్యం ఆవిడికి ఊపిరాడనివ్వలేదు—పట్టరానంత ఆనందం అనిపించి కొడుకుని చూడాలని దడదడ అడుగులువేస్తూ తొందరగా నడక సాగించింది

అల్లంత దూరాన కన్నతండ్రిని చూసి పరుగులుతీసి వచ్చి ఒక్కసారి ఎంతో నమ్రంగా భక్తిగా తండ్రిపాదాలు పట్టుకున్నాడు. ఒక్కసారి రెండు చేతుల్తో కొడుకుని లేవనెత్తి అలా తనచేతుల్లో ఇముడ్చుకున్నాడు — ఆ తండ్రీ కొడుకుల తన్మయిత్వాన్ని చూసి ఒక్కసారి ప్రకృతి అంతా పులకించింది—ఇక దుఃఖం మీ దగ్గిరకి చేరదన్నట్లు మంచిగా మందమారుతం వీచింది .. ఈ దృశ్యాన్ని చూసి అలరి అలరి అక్కడ పూతీగెలు విరుల వర్షాలు కురిశాయా? అన్నట్లు పన్నీటి జల్లులా వాళ్లమీద జడివానలా పూలవర్షంకురిసింది.

కాసేపటికి ఆనందతన్మయత్వం నుంచి తేరుకున్నాడు రాజు.

కొడుకు చుబుకం చేత్తో నిమురుతూ 'నాయనా ఇలా నిన్ను చూసుకొందుకు ఎంత అదృష్టం చేసుకున్నానో—ఎంతటి మహనీయుడవో ఏ శాపవశంచేతో నువ్వు నాగర్భవాసాన జన్మించావు? దైవ అంశ సంభూతుడివి—ముల్లోక మూర్ధాభిషిక్తానికి తగినంత సద్గుణ సంపత్తి కల వాడివి ఇపుడీ రాజ్యానికి నేతవు నా ప్రాణదాతవు—వయసులో చిన్నవాడ వైనా గుణాలలో నువ్వు చాలా గొప్పవాడవయ్యా నీ యోగ్యతకి నమస్కారం, నమస్కారం అంటూ చేతులు జోడించాడు. అప్రయత్నంగా చిత్రరథుడూ తారాపీడుడూ సహృదయులుగా వియ్యంకులుగా ఎంతో ఆనందంగా స్నేహపూర్వక పరస్పర గౌరవ సంతోషపూర్వకంగా అలా సంభాషించుకున్నారు—చిరంజీవుల కళ్యాణ వేడుకను చూసుకున్నారు.

తారాపీడుడిపాత్ర ముగిసింది.

: శుకనాశుడు పాత్ర :

తారాపీడుని మంత్రి శుకనాశుడు—మంచి మనస్తత్వం గలవాడు. వీళ్ల రాజూ మంత్రుల్లా కాకుండా, సాక్షాత్తూ అన్నదమ్ముల్లా ఉండేవారు.

వాళ్ల హృదయాలు స్వచ్ఛమైన అద్దాల్లా ఉన్నాయి- వాళ్లది ఒకటేమాట ఒకటే బాట.

ఇతడికి కూడా ఎంతకాలం అయినా పిల్లలులేరు. దాంతో చాలా తపించాడు. తపస్సుల ఫలితంలా తెలతామర పువ్వు తన భార్య ఒళ్ళో పడట్టు కలవచ్చింది తనకి. తత్ఫలితంగా ఆమెకు పుత్రుడు పుట్టాడు. అతడిపేరు వైశంపాయనుడు. ఇతడే పుండరీకుడు మహాశ్వేత భర్త.

అతడికి తనకంటె తన పిల్లవాడిమీద కంటె రాజుమీద రాజ్యం మీద ఎంతో శ్రద్ధ ఉంటుంది.

చంద్రాపీడుడికి చక్కని రాజనీతి ఉపదేశిస్తాడు, అందులో శుక నాసుని మనస్తత్వం, ఎలాంటిదో మనకి స్పష్టంగా కనిపిస్తుంది.

"నాయనా చంద్రాపీడా నువ్వు రేపు పట్టాభిషిక్తుడివి అవు తున్నావ్.

మనుష్యుల్ని అధోగతిలోకి ఈడ్చెయ్యడానికి వయస్సేచాలు. దానికితోడు డబ్బు, చక్కదనం, చదువు, రాజ్యం ఇవన్నీ ఉంటే అడి గావా? అనర్థ పరంపరలకి అంతే ఉండదు. నీ మీద అభిమానం గౌర వాలు ఉన్నట్టు నాటకాలు ఆడతారు, నీ అంతటివాళ్ళు లేరని చప్పట్లు కొడ తారు. ఇచ్చరపుమాట లాడతారు. అమాయకులూ ధర్మాత్ములూ నిష్క పటులమీద లేనిపోనివెన్నో కల్పించి నీ చెవికి గట్టిగా పట్టేటట్లు చెవుతూ ఉంటారు. నీ చేత తమకు కిట్టనివారి కీడుకు కీళ్ళు చేయించా లని వెయ్యికళ్ళతో సమయంకోసం నిరీక్షిస్తూ ఉంటారు.

మనకి లోకంలో స్వప్రయోజన పరులూ, కుటిలాత్ములూ, అసూయాపరులూ; ఎంతోమంది కనిపిస్తారు. నిజాయితీ వర్తనులూ, నిష్కపటులూ, చాలా తక్కువగా కనిపిస్తారు. అసలు అలాంటివాళ్ళు చాలా దూరంగా ఉంటారు. సాధారణులకి అందనే అందరు.

ఎవరు ఎలాంటివాళ్ళో మంచి వివేకం ఉంటేగాని తెలుసుకోనలేం.

ఇక నీ చేతికి రాజ్యలక్ష్మి వచ్చిందే అనుకో-ఇక అడిగావా! ధనలక్ష్మి సముద్రంలో పుట్టిందిగదా! పుట్టింటి గుణాలు ఆవిడక్కి గట్టిగా పట్టేశాయి.

కౌస్తుభంలో కాఠిన్యాన్ని అలవరచేసుకుంది. ఉచ్చైశ్రవం అనే గుఱ్ఱంనుంచి అతి తొందరపాటు వచ్చింది—వేదాలూ, శాస్త్రాలూ, పురాణాలూ చదివినవాళ్ళంటె ఆవిడకి తలనొప్పి. పరాక్రమవంతు డంటేనే పరమ అసహ్యం. ధర్మాత్ములంటే ఒళ్ళుమంట, ఆచార వంతులంటే మహా ఆగ్రహం, విద్వాంసులంటె అతి విసుగు.

చూశావా ? లోకంలో వ్యక్తుల్ని నిశితంగా చదవాలి. ఇంత వరకూ గ్రంథాన్ని చదివావు — విలువిద్యలు నేర్చుకున్నావు గాని జీవితంలో మనుష్యులను జాగ్రత్తగా పరిశీలించాలి. అతి నిదానంగా ఆలోచి చి మాట్లాడాలి. తొందరపాటు ప్రపంచంలో అన్ని అనర్థాలకి మూలం.

అందులో ఇంకా చిన్నవాడివి. లోకజ్ఞానం మానవుడికి చాలా అవసరం నోరు మాటాడుతూ ఉంటె నొసళ్ళు వెక్కిరిస్తూ ఉంటాయి.

డబ్బున్నవాడి చుట్టూ చేరి డప్పులు వాయించే దబ్బారాయిళ్ళు కంకరరాళ్ళల్లా లెక్కలేనంతమంది.

నీ దగ్గర డబ్బు నపహరించడం కోసమే చేరతారు వాళ్ళు. గరేలా ఒక్క చూపులో మనుష్యుల అంతరాంతరాలలో నరనరాలలో ఎలాంటి ఉద్దేశ్యా లున్నాయో తెలిసికోవడం చాలా అవసరం.

నీ కింతవరకు ఇలాంటి అవసరం లేకపోయింది. నువ్వు సింహా సనంమీద కూచున్నాక ఇంత చనువుగా నేను చెప్పడం బాగుండదు. ఇప్పడున్నంత వినయవిధేయతలు నీకు ఉండకనూ పోవచ్చు.

నాయనా రాజధర్మం, సాధు సంరక్షణ, అబలారక్షణ, అనాధ రక్షణ, ఆర్త రక్షణ, ముఖ్య కర్తవ్యాలు.

మనకు అధికార బలం అర్థబలం ఉన్నందుకు నిజాయితీకీ, న్యాయా నికీ, సద్వినియోగం చెయ్యడమే సార్థక్యం.

ఈ చెప్పినవి కొన్నయినా ఆదరించు, ఆచరించు—నాయనా. పెద్దవాళ్ళ మాటలు పెడచెవిని పెట్టేవాళ్ళు పెద్దగా లోకంలో జీవిం చరు. రాణించరు. పెద్దని పెద్దగాచూస్తే వాళ్ళు జీవితాంతం ఆలా పెద్దగానే వెళ్ళిపోతారు.

పై నీతి కేవలం చంద్రాపీడుడికే కాదు. యువకులకూ, ధనికు లకూ, యువరాజులకూ యువతలకూ అందరికీ బాగా ఉపకరిస్తుంది.

మంత్రిచేత పలికించిన పలుకులన్నీ ఒక్కొక్కటి ఒక్కొక్క వజ్రపు తునక అన్నమాట.

బాణుడు పైన మంత్రిచే చెప్పించిన వాక్యాల్లో అతడికి సంఘంలో ఉన్న సంకుచితాలూ స్వార్థాలూ ఎంత గట్టిగా ఉన్నాయో ఎంతనాటయో వ్యక్తమౌతున్నాయి.

ధనం దగ్గిర ఉండేసరికి మనిషిని ఎంతగా మార్చేస్తుందో మాన వులమీద జాలి ప్రేమ ఇలాంటి గుణాలు లేకుండా ఎంత కర్కశంగా స్వార్థంగా తయారుచేస్తూ ఉంటుందో మహబాగా నిరూపించాడు.—

సంఘాన్ని ఎంత నిశితంగా జాగ్రత్తగా పరిశీలిస్తాడో ? పరిశీ లించినదాన్ని తాను సృష్టించిన పాత్రలలో ఎంత సముచితంగా ఇముడ్చి వర్ణిస్తాడో అని ఆశ్చర్యం కలుగుతుంది.

బాణా ! ఎంతటి సర్వతోముఖ విజ్ఞానివయ్యా.

: బాణుడు ఖగోళము :

భూగోళానికి ఖగోళానికి చాలా సన్నిహిత సంబంధం ఉంది.

ఖగోళంలో నక్షత్ర గమనాన్ని పట్టే భూగోళంలో మనం జరుపుకునే ప్రతి పండుగ ఏర్పాటు చేశారు మనపెద్దలు.

భాద్రపద మాసంలో శుక్లపక్షమి చవితినాడే విఘ్నేశ్వర చవితి, అని విఘ్నప్పని భక్తితో అష్టాదివర్ణం పూజిస్తుంది.

ఆనాడే ఎందుకు చెయ్యాలి, సంవత్సరంలో, 24 చవుతులు వస్తూ ఉండగా, అంటే

సూర్యోదయాత్పూర్వం, ఆకాశ రంగంలో, సప్తర్షి మండలానికి ముందు, మూషికవాహనంతో, విఘ్నేశ్వరుడు కనిపిస్తాడు గనుక.

అలాగే, ఋషిపంచమివ్రతం కూడా, ఏర్పాటుచేయబడింది.

విజయదశమి ఉత్తర, ఫల్గుణ నక్షత్రం, ఉదయించేసరికి, గోవధి అనే నక్షత్రాలు అస్తమిస్తాయి. అర్జునుడు ఉత్తర గోగ్రహణం, విజయం సాధించడం మన కందరికీ తెలిసిందే.

కార్తీకమాసంలో కృత్తికా నక్షత్రానికి ప్రధానం అంతేగాకుండా ఆరుద్రా నక్షత్రం రుద్రో దేవతా; అది ఆ రోజుల్లో గగనంలో చక్కగా ప్రకాశిస్తుంది.

అందుకే ఈశ్వరప్రీతిగా కార్తీక సోమవారాలూ అవీ మనం చేస్తూ ఉంటాము.

మార్గశిర మాసంలో, మాసానాం, మార్గశీర్షోహం, నగంపరకు రథంమీద కృష్ణుడు అర్జున సారథ్యంలో మనకి నక్షత్రరూపేణ కనిపిస్తాడు, గనుక ఆ మాసానికి ప్రాధాన్యం ఉంది.

పుష్యమాసంలో, భోగి, సంక్రాంతి,—పుట్టింటికి స్త్రీలను, పండుగకు తీసుకువస్తూ ఉంటారు ఎందుకంటె ఆకాశరంగంలో, చెఱకు, విలుకాడు విశ్రాంతిగా ఉంటాడు గనుక.

అదీగాక సూర్యుడు మకరరాశిలో ప్రవేశిస్తాడు, ఉత్తరాయణ పుణ్యకాలం మనకి చాలా ముఖ్యం.

మాఘమాసం సూర్యునికి ప్రీతి—అందుకే మాఘ, పాదివారాలు అవీ చేస్తాం.

ఫాల్గుణమాసంలో లక్ష్మీనారాయణుల దృశ్యం, స్పష్టంగా ఆకాశంలో కనిపిస్తుంది. అందుకే మనవాళ్ళు దేవుళ్ల కళ్యాణాలూ, సాధారణంగా, వివాహముహూర్తాలు పెట్టి శుభకార్యాలు చేస్తూ ఉంటారు.

చైత్రమాసంలో గౌరీదేవివ్రతం ప్రధానంగా చేస్తుంటారు. గౌరి ఆ మాసంలో చాలా ప్రకాశవంతంగా కనిపిస్తుంది.

వైశాఖమాసం—వసంతఋతువు ప్రారంభం మన్మధుడూ వసంతుడూ దేదీప్యమానంగా కనిపిస్తారు.

జ్యేష్ఠమాసంలో—వృశ్చికరాసి దేదీప్యమానంగా ఉంటుంది. అందుకని ఆ రోజుల్లో మనకి శూన్యమాసం—మంచిపనులేవీ చెయ్యకూడదంటారు.

శ్రావణంలో మహలక్ష్మిని పూజిస్తారు. లక్ష్మీదేవి ఆకాశంలో ప్రధానంగా ప్రకాశిస్తూ ఉంటుంది గనుక —

ఇలాగా ప్రతినెలకీ, ప్రతి పండుగకీ మనకి చాలా సంబంధం ఉంది. ఖగోళ భూగోళాలకి— ఈ విషయాలన్నీ చక్కగా గమనించాడు బాణుడు. బాణుడు జ్యోతిశ్శాస్త్రవేత్త, నక్షత్రశాస్త్రవేత్త.

ఆకాశమున వృశ్చికరాశి పశ్చిమ దిక్కునకు జారుతూంది. దాని ప్రక్కనున్న కుజగ్రహము యెఱ్ఱని నక్షత్రము కనపడుతుంది. వృశ్చికమునకు పార్శ్వమున కుజగ్రహ మొక చిత్రమగు భయమును గొల్పుచుండెను.

ఎట్టి విచిత్రయోగము వృశ్చికరాశియందు కుజుని సంక్రమణము వలన ధరిత్రి రక్తముచే తడిసి అటుపై జారుచుండునని సంహితలలో చెప్పబడినది.

ఇలాంటి సమయాల్లోనే యుద్ధాలూ, రక్తపాతాలూ జరుగుతూ ఉంటాయని మనకి తోస్తుంది.

కాదంబరిలో తరుచుగా నక్షత్ర ప్రశంశ బాణుడు చేస్తూనే ఉంటాడు.

## మచ్చుకు కొన్నిటిని చూద్దాం

"నక్షత్రమాల యేవ హారతలయా, కృతముఖ పరివేషమ్".

మెడలో ధరించిన ముత్యాలహారం నక్షత్రమాలలాగా ఉందిట

"రవి రథమివ దృఢని య మిత అక్ష చక్ర".

సూర్యుని రథానికి కట్టబడినట్టుగా.

ద్రోణిరివ కృపానుగతః నక్షత్రరాశి రివ చిత్ర మృగ కృతికా శ్లేష ఉప శోభితః

ద్రోణాచార్యులు కృపిని అనుసరించినట్టుగా.

ద్రోణుని భార్య పేరు కృపి.

నక్షత్రరాశి రివ — నక్షత్ర సముదాయంలాగ ఈ అరణ్యం ఉందన్న మాట.

నక్షత్ర అర్థంలో చిత్ర నక్షత్రం, మృగశిర నక్షత్రం కృత్తిక ఆశ్లేష.

అరణ్య అర్థంలో చిత్ర మృగము—లేళ్ళు.

కృత్తికాశ్లేష—చెట్టు పట్టలను గట్టిగా పట్టుకున్నవి.

అనవరత భ్రమిత తారకాచక్ర మపరధృవం.

ధృవ నక్షత్రాన్ని అనుసరించి ఎప్పుడూ తిరిగే తారకాచక్రం లాగ.

సప్తర్షి మండలా ధ్యుషితం అరుంధతీ సంచరణ పవిత్రం అప హిత ఆషాఢం అలక్ష్యమాణ మూలం ఏకాంతస్థిత చారు తారక మృగం అమరలోక ఆశ్రమ మివ గగన మమృత దీధితిః అధ్యతిష్ఠత్.

ఆకాశం సప్తర్షి మండలానికి నివాసమైంది. అరుంధతీ నక్షత్రంతో అది మరీ పవిత్రమైంది.

ఉపహిత ఆషాఢం.

నక్షత్ర పర గా ఆషాఢ నక్షత్రంతో కూడియున్న.

ముని పక్షంలో—మోదుగ దండముతో ఉన్న

అలక్ష్యమాణ మూలఁ—న, ప. మూలానక్షత్రంలో
ఋషిపక్షంలో—వృక్షమూలమందున్న

అరణ్య పక్షంలో చారు తారక మృగం—చారు—సౌందర్యవంత
మైన—తారక—మృగ, రాక్షసులతోను మృగములతోనూ కూడియున్న—

చారు—సౌందర్యవంతమైన మృగ మృగశిర నక్షత్రము—ఇంకను
అనేక నక్షత్రములతోను. ఒప్పియున్న

అమరలోక ఆశ్రమ మివ—
అమర లోకమునకు ఆశ్రమము వలె
గగనమ్—ఆకాశము
అమృత దీధితి—అమృతపు కాంతులతో
అత్యతిష్టత్—ఒప్పి ఉన్నది.

"గ్రహాణాం తులారోహణం అగస్త్యోదయే విష విశుద్ధి; శశినో
జ్యేష్ఠాతిక్రమణమ్."

గ్రహములకు మాత్రమే తులారాసిని దాటుట యున్నది.
వర్తకులు చాలా న్యాయపద్ధతినే తూస్తారు.
అగస్త్యోదయే విష విశుద్ధిః
అగస్త్య నక్షత్రం ఉదయించినప్పుడు నీళ్ళు స్వచ్ఛంగా ఉంటాయి.

అగస్త్య—అంటె—మహర్షి ఒకర్థం. అవిసెచెట్టు మరొక అర్థం.
అవిసెచెట్టు ఉన్నట్లయితే విషజంతువులు రావు అని మన పెద్దల
విశ్వాసం.

శశినో జ్యేష్ఠాతిక్రమణమ్—చంద్రుడు మాత్రమే జ్యేష్ఠా నక్ష
త్రాన్ని దాటగలడు.

శశినో జ్యేష్ఠాతిక్రమణమ్.

చంద్రుడు మాత్రమే జ్యేష్ఠానక్షత్రాన్ని దాటగలడు.

కాని అన్నగారి మాట దాటడం అనేది అచటి ప్రజలకు లేదు.

తారకా పంక్తి రివ నభసః హంస మాలేన మానస్య ఫణామణి శిఖేన శేషస్య.

ఆకాశంలో నక్షత్రరాజు లాగా మానస సరోవరంలో హంసల లాగా పడగలతో ఒప్పియున్న పాముపలె.

ఉడు నికర మధ్యవర్తి న మివ, పౌర్ణమాసీ, శశినం.

ఉరగరాజ ఫణామణి సహస్రాంతరాళ స్థిత మివ నారాయణం.

నక్షత్ర సముదాయము మధ్యనున్న పూర్ణ చంద్రబింబము వలె వేయి పడగలు గల ఆదిశేషువుపై పరున్న నారాయణునిలా ఉన్నాడట.

జ్యోతిష మివ గ్రహ మోక్ష కలా భాగ నిపుణం.

జ్యోతిష శాస్త్రంలో ఏ గ్రహాలు ఎప్పుడు విడిచిపెడతాయో లెక్కించి చెప్పునట్టుగా.

కళూ కాష్టలు కాల విభాగమునకు పేర్లు.

కాదంబరిలో ఉపమానాలూ ఉత్ప్రేక్షలూ వర్ణించే పక్షంలో బాణుడు విధిగా నక్షత్రాలని తీసుకుంటూనే ఉంటాడు. సప్తర్షులను ఎన్నిసార్లు వర్ణించినా అతడికి తృప్తి తీరదు.

## : బాణుడు - విజ్ఞాన శాస్త్రము :

శూద్రకుడు రాజైనా తన దినచర్యలో ఎక్కడా సోమరితనం కనపడదు.

తనతో సమానమైన వయస్సుగల రాజపుత్రులందరితో ప్రతి రోజూ బాగా వ్యాయామంచేస్తూ ఉండేవాడట. శరీరం అంతా బాగా

చమటలు పట్టేలాగ. చమట పూర్తిగా ఆరితేనేగాని వెనువెంటనే స్నానం చేయడం మంచిదికాదు అని నేటి శాస్త్రజ్ఞులు చెపుతున్నారు.

మన బాణుడు 600 వందల సంవత్సరాల క్రితమే ఈ విషయాన్ని గమనించి శూద్రకుడి పాత్రలో మనకు చెప్పాడు. వ్యాయామం మానవా రోగ్యానికి ఎంతో అవసరమని అందరకూ తెలిసిందే.

సామాన్య మానవులు వ్యాయామంమీద శ్రద్ధ చూపవచ్చు. రాజ్య పాలనచేస్తూ రాజు ఈ ఆరోగ్య సూత్రాలని పాటించాడంటె చాలా మెచ్చుకోవచ్చు—

యద్యదా చరతి శ్రేష్టః తత్తదేవ ఇతరే జనాః

సయత్ప్రమాణం కురతే లోకస్తదను వర్తతే—

ఉన్నతస్థాయిలో మనుష్యులు ఏం చేస్తారో తక్కువ స్థాయిలోవాళ్ళుకూడా అవే పనులు చేస్తూ ఉంటారు.

యధారాజా తధా ప్రజా అని కూడా అంటారు.

రాజే యే యే పనులుచేస్తే ప్రజలుకూడా తప్పక వాటిని అనుకరించడానికే ప్రయత్నిస్తారు.

"వార విలాసినీ కర మృదిత సుగంధామల కోపలిప్త శిరసోరాజః రాజు శిరస్సునకు సుగంధముతో కూడిన ఉసిరిగనూనె వార కాంతలు అతని శిరస్సునకు రాసి మర్దించేవారట"

"అమలకం సర్వదా పథ్యం కదళీ నకదాచన"

ఉసిరికాయ మానవులకు ఎంతో మంచిది—అరిటి అంత మంచిది కాదు"

ఉసిరిగ మనకెంతో మేలు చేకూరుస్తుంది. మెదడుకి మంచి చల్లదనాన్ని ఇస్తుంది. ముఖ వర్చస్సు జీర్ణశక్తిని ఇది ఇస్తుంది. గుండెకు

బలం నేత్రాలకు దీప్తి ఇస్తుంది. చర్మవ్యాధులు రానివ్వదు. రక్తపోటు ఉద్ధృతాన్ని తగ్గిస్తుంది. ఇంకా ఇలాంటి లాభాలు ఆ ఉసిరిగాయకు ఎన్నెన్నో ఉన్నాయి.

అందుకే మనవాళ్ళు ఉసిరిగ పచ్చడి సంవత్సరం ఉండేటట్లు పెట్టుకుంటారు. అది వేడి అన్నంలో నిమ్మరసంతో నెయ్యి వేసుకుని మొదటగా తిన్నట్లయితే పైత్యాన్ని హరిస్తుంది. నోటి అరుచిని పోగొడుతుంది. ఏదైనా అతి సర్వత్ర వర్జయేత్ అన్నారు గదా। పెద్దలు. రుచిగా ఉంటుందని మనం ఏదీ అతిగా తీసుకోకూడదు.

ఏకాదశి ఉపవాసం చేస్తేమాత్రం ఏ రోజు అయినా తినవచ్చును. అది కాకపోతే ఆదివారము శుక్రవారమూ మాత్రం తినకూడదంటారు

ఈ విషయాలన్నీ బాణుడు బాగా జీర్ణించచేసుకున్నాడు. అందులే శూద్రకుని పాత్రలో సుగంధామల, కోప లిప్త శిరసోరాజః అని వర్ణించాడు.

ఆ నాటి రాజలోకానికి వేట అనేది ఒక వినోద కార్యక్రమంగా ఉండేది.

సామాన్య మానవులు తీర్థయాత్రలు చేస్తూ ఉండేవారు. ఎందుకోసం ఈ ఏర్పాట్లు నిర్ణయించారంటె మన పెద్దలు ఆ యా చెట్ల నీడల్లో మనం కొంతకాలం సంచరించినట్లయితే_వాటిగాలిని పీల్చుకుంటాం—అది మనలో ఎన్నో రుగ్మతలను నాశనం చేస్తుంది.

మనం విడిచిపెట్టే బొగ్గుపులుసు వాయువును చెట్లుతీసుకుని మనకి కావలసినంత ప్రాణవాయువును అందిస్తాయి.

అందుకే కొంత వయస్సు మళ్ళాక వానప్రస్థ ఆశ్రమం అన్నారు. మన పెద్దలు.

మనకు బలంతగ్గి రుగ్మతలు రాకుండా కాపాడే శక్తి అడవిలో ఉన్న వృక్షాలకి వుంది.

మనం సాధారణంగా ప్రతీ పండుగలకీ గడపలకి పసుపు రాయడం గుమ్మాలకి మావిడాకులు కట్టడం చేస్తూ వుంటాము.

వేసవిలో గడపలకి తోరణాలుగా నీరుల్లిపాయలు కడతారు.

పసుపుకి సూక్ష్మ విషక్రిములను సంహరించే శక్తి ఉంది. మామి డాకులు మనకి కావలసినంత ప్రాణ వాయువు ఇస్తుంది.

ఉల్లిపాయలు మశూచి, ఆటలమ్మ, పొంగు మొదలైనవి రాకుండా రక్షిస్తుంది.

పెండ్లి పందిళ్ళలో ఎక్కువగా మామిడాకులు కట్టడం—ప్రాణ వాయువును సమృద్ధంగా ఉంచుకోండుకే.

ఇప్పుడు లేదుగాని పాతికి ముప్ఫయి సంవత్సరాల క్రితంవరకూ ఆడవాళ్ళందరూ పసుపుపచ్చని చీరలు పసుపు చీరలు అంటారు—వాటిని కట్టుకొనేవారు.

అవి చాలా ఆరోగ్యదాయకం—

మన ఆయుర్వేద శాస్త్రజ్ఞులు ఒల వెంట్రుకను నిలువునా వేయి ముక్కలుగా ఛేదించగలిగేవారట.

ప్రమాదవశాత్తూ కాళ్ళూ చేతులూ విరిగితే కొన్ని ఆకులూ వేర్లూ గట్టిగా కట్టినట్లయితే అవి కొన్ని గంటల్లో అతుక్కొనేవట.

తారాపీడుని భార్య విలాసవతి గర్భవతి అయినప్పుడు ఆ యిం టిని బాణుడు వర్ణిస్తాడు.

ఆ వర్ణన జాగ్రత్తగా పరిశీలిస్తే గర్భస్థ శిశువును కాపాడే ప్రక్రియలన్నీ, అచటి వాటికి ఉన్నాయని అనిపిస్తుంది.

"భూతి లిఖిత పత్ర లతాకృత రక్షా పరిక్షేపం శయన
శిరోభాగ విన్యస్త రత్న ధవళ నిద్రా మంగళ కలశమ్"
ఆబద్ధ వివిధ ఓషధీ మూలమంత్రమ్, అవస్థాపిర రక్షా
శక్తి వలయమ్ ఇత స్తతో విప్రకీర్ణం గౌరసర్షపమ్ ఆవలం
బిత బాలయోక్త్ర గ్రథిత లోహిత పిప్పల పత్రమ్ ఆసక్త
హరితా రిష్ట పల్లవం, ఉత్తుంగ పాదపీఠ ప్రతిష్ఠితమ్, ఇందు
దీధితి ధవళ ప్రచ్ఛద పటలం అచల రాజ శిలా తల విశాలం
గర్భోచితం శయనతల మధిశయానం, కనక పాత్ర పరిగృ
హీతైః అవిచ్ఛిన్న పేరకావస్థిత దధిలప్తైః జల తరంగ తరళ
సిత శాలి సిద్ధ సికరైః ఆగ్రథిత కుసుమాంజలి సనాథైః
పూర్ణ భాజనైః అఖండిత తానన మత్స్యపట లైశ్చ ప్రత్యగ్ర
పిశిత పిండమిః అవిచ్ఛిన్న సలిలధారా గమ్య మానమా
గైః పటలక ప్రజ్వలితైశ్చ శీతల ప్రదీప్తైః గోరోచనా మిశ్ర
గౌర సర్షపైశ్చ సలిలాంజలి భిశ్చ ఆచార కుశలేన అంతః
పుర జరతీ జనేన క్రియ మాణ అవతారణ మంగళాం
ధవళాంబర వివిక్త వేషేణ ప్రముదితేన ప్రస్తుత మంగళ
ప్రియా లాపేన పరిజనేన ఉపాస్యమానాం ఉపారూఢ గర్భ
తయాంతర్గత కుశ శైలా మివ క్షితిం సలిల నిమగ్నైః
ఐరావత మివ మందాకినీం గుహాగత సింహ మివ గిరిరాజ

మేఖలాం జలధర పటలాంతరిత దినకరమివ, దివసశ్రియం
ఉదయగిరి తిరోహిత శశి మండలా మివ విభావరీమ్.

విలాసవతి పడుకునే పలదిక్కున విభూతితో కొన్ని చిత్రాలు చిత్రించారు. కొన్ని ఆకులూ లతలూ ఆమె గర్భరక్షణకై అక్కడ వుంచారు. రత్నాలు స్థాపించిన మంగళ కలశాన్నికూడ పలవైపున ఉంచారు. అనేక మంత్రాలచే మంత్రింపబడిన ఓషధీలతలు అక్కడ ఉన్నవి. వలయాకారంగా కొన్ని తీగెలతో తయారుచేసి వుంచారు. అక్క. దక్కడ తెల్లని ఆవాలుజల్లి ఉన్నాయి. లేత పిప్పలి ఆకులను గూర్చిన గుత్తి అక్కడ వుంది. అరిష్టములను హరించే, లేత పసుపు ఆకులను అక్కడ వుంచారట. తెల్లని వస్త్రము, పైన భాందినిగా కట్టి దానికి ముత్యాలూ, రత్నాలూ గుచ్చి వ్రేలాడదీశారట.

ఒక బంగారు పళ్లెంలో కడిగిన బియ్యం, పెరుగు. ఆవాలూ, పూవులు, తలలు నరకని చేపలూ, మాంసపు ముద్దలూ ఉంచి ఆమెకు దిష్టి తీస్తున్నారు.

అనుభవము గల పెద్దలైన స్త్రీలు గోరోచనా మిశ్రితమైన అంచు గల తెల్లని చీరలు ఆమెకు కట్టినారట.

అయిరావతము లోపల మునిగి ఉన్న మందాకినీ నదిలాగా సింహంలోపల వున్న గుహ వలెనూ, దట్టమైన మేఘాలమధ్య నున్న సూర్యునివలె కుమారుని గర్భమందుంచుకొన్న విలాసవతి కనిపిస్తూంది.

మనకు 108 ఉపనిషత్తులలో విభూతిని గూర్చి ప్రత్యేకమైన ఉపనిషత్తు వున్నది.

విభూతి అన్న పదానికి రెండర్థాలున్నాయి. ఐశ్వర్యము అని ఒకర్థము—ధరించే విభూతి అని ఒక అర్థము. విభూతి మనకు విచిత్రితి

విచిత్రమైన సంఘటనలు సమకూరుస్తున్నది. అంతఃకరణకు పవిత్రత్వాన్ని ఇస్తుంది. ఇహలోక ఇష్టార్థాలన్నీ ఇస్తుంది. కావలసినవన్నీ ఇవ్వడమేగాక శాశ్వతమైన మోక్ష సామ్రాజ్యాన్ని ఇస్తున్నది.

అనర్థాలనీ, అరిష్టాలనీ మనదరి జేరనివ్వడు. అందుకని విలాసవతి గదిలో విభూతితో చిత్రాలు నిర్మించినట్లు చెప్పాడు. చంద్రుడు ఓషధీతతులకు నాధుడంటారు. వృక్షజాతికి నిష్పక్షపాతముగా తన కిరణాలద్వారా అమృతాన్ని వర్షిస్తాడు. అందుచేత చెట్లజాతుల్లో వున్న మహత్తర శక్తి తెలుసుకోవడము చాలా కష్టము.

పిప్పలి చిగుళ్ళూ, మఱ్ఱి చిగుళ్ళూ రావి చిగుళ్ళూ, లెల్లఆవాలూ వాంత ప్రకోపాన్ని రాకుండా కాపాడగలవు.

సూతికావాతమని ఒక జబ్బు ఉంది. దానికి నల్ల ఉప్పు, ఎఱ్ఱ కసింద, చిట్టి గుమ్మడి పీటి వేళ్ళ పొరలని జాగ్రత్తగా తీసి; సమ పాళాలుగా తూచి పండు తమలపాకు, వగాగ్రహపు చెక్కలుకూడా వాటితో సమానముగా తూచి, మెత్తగానూరి మాత్రలుగా చేసి అవి వాడితే పీధిలో పదేసిన బాలెంతలు కూడా బ్రతుకుతారు

పైన చెప్పిన ఆకులు ఆ గదిలో ఉంచితే వాటి గాలిని పీల్చడము చేత ఆవిడకు ఆరోగ్యము కలుగవచ్చును.

ఈ రచనపట్టి ఆకులలో ఏ వస్తువులలో ఎలాంటి శక్తి ఉన్నదో ఇతనికి బాగా తెలుసు.

శుకనాసుణ్ణి తీసికొని తారాపీడుడు పురిటిగృహములో కొడుకుని చూడాలని వచ్చాడు.

ఆ పురిటిగ్రృహము ఎలా ఉన్నదంటే—

“మణిమయ మంగళ కలశయుగళా శూన్యేన ఆసక్త బహు
పుత్రికాలంకృతేన వివిధ నవ పల్లవ నివహ నిరంతర నిచితేన సన్ని
హిత కనకమయ హలముసల యుగేన విరళగ్రథిత సిత కుసు
మ మిశ్ర దూర్వాప్రవాళ మాలాలంకృతేన ఆలంబితా విరళ వ్యాఘ్ర
చర్మణా వందన మాలాంతరాళ ఘటిత ఘంటా గణేన ద్వారదేశేన
విరాజమానం ఉభయ తశ్చ ద్వార మర్యాదా నిపుణేన గోమయీభిః
ఉత్తాన వినిహిత వరాటక ప్రకర దంతురాభిః అంతరాబద్ధ వివిధవర్ణ
రాగ రుచిర కార్పాస కుసుమ లేశ లాంఛితాభిః కుసుంభ కేసర, లవా
శ్లేష లోహితాభిః లేఖాభిః ఆలిఖిత స్వస్తిక భక్తి జాల ముపర
చయతా హరిద్రాద్రవ విచ్ఛురణ పరిపింజరాంబర దారిణీం భగవతీం
షష్ఠీదేవీం కుర్వతా వికచ పక్ష పుట వికట శిఖండి పృష్ఠ మండలాధి
రూఢ మాలోల లోహిత పట ఘటిత పతాక ముల్లసిత శక్తి దండ
ప్రచండ కార్తికేయం సంఘట్టయతా విన్యస్త అలక్తక పాటల మధ్య
భాగౌ సూర్యచంద్ర మసౌ నా బధ్నతా కుంకుమ పంక పింజరీకృతాన్
ఊర్ధ్వపోత్రిత కనకమయ యవని కరకంటకి తామ విరళ లగ్నగౌర
సిద్ధార్థక ప్రకరతయా కాంచన రసఖచితా మిప మృణ్మయ గుటికా
కదంబ మాలాం విన్యస్య తాచ చందన జల ధవళి తేషు భిత్తి శిఖర
భాగేషు పంచరాగ విచిత్రచేల చీర కలాప చిహ్నాం ఆ పీత పిష్టాత
క సంకాంకి తాం వర్థమానక పరంపరాం అన్యాసిచ ప్రసవగృహ
మండన మంగళాని సంపాదయతా పురంధ్రీ వర్గేణ సమధి ష్ఠితం
ఉపద్వార సంయుత వివిధ గంధ కుసుమ మాలాం ల కృత
క్నత జరత భాగం ఆఖిల వేశ్మహి మధ్యా వస్థితార్య వృద్ధా ధ్యాసిత

శయన శిరోభాగం అనవరత దహ్యమాన అజ్యమిశ్రి భుజగ నిర్మోగ
మేష నిషా క్షేపం అనల ప్లుష్యమాన అరిష్ట తరు పల్లవోల్లసిత
రక్షా ధూమగంధం అధ్యయన ముఖర ద్విజగతి విప్రకీర్యమాణ
శాంత్యుదక లవం అభినవ లిఖిత మాతృపట పూజా వ్యగ్రధాత్రీజనం
అనేక వృద్ధాంగనారబ్ధ సూతికా మంగళగీతికా మనోహరం అప
పాద్యమాన స్వస్త్యయనం క్రియమాణ శిశురక్షాబలి విధానం ఆబ
ధ్యమాన కుసుమదామపరిగతం అవిచ్ఛిన్న పఠ్యమాన నారాయణ
సహస్రం అమల హాటక యష్టి ప్రతిష్ఠాపితైః అంతస్స్ఫుట శతానీవ
నిశ్చల శిఖైః ధ్యాయద్భిః మంగళ ప్రదీపైః ఉదాసితం ఉత్ఫాతాసి
లతా సనాథ పాణిభి పర్యాప్తో రక్షా పురుషైః పరిష్కృతం సూతికా
గృహా మపశ్యత్.

పై సంస్కృతమునకు భావార్థము.

ద్వారానికి రెండువైపులా మణిమయమైన కలశములపై మంగళ దీపాలు ఉంచారు. కన్యలుగా ఉండే దేవతా చిత్రాలను చిత్రించారు. అనేక రకాల చిగుళ్ళు, తీగలు మొదలైనవి వున్నాయి. ఒక బంగారు రోకలి, నాగలి ఆ గుమ్మంముందు పెట్టారు. పవడపు చిగుళ్ళ దూర్వాలు ద్వారానికి గుచ్చి వుంచారట. పెద్దపులి చర్మాన్ని అట వేలాడదీశారు. ద్వారానికి రెండువైపుల మంగళకర గంటా నాదములు వినపడుతున్నాయి.

ద్వారానికి రెండు వైపులా గోమయంతో మనవాళ్ళు గొబ్బెమ్మ' క్రొత్తెమ్మ అని రెండు బొమ్మలను రాసి అడుగున ఊక రాసిపోసి, అందులో గుగ్గిలము మొదలైనవి వేసేవారు. తొమ్మిదిరోజుల తరువాత వాటిని తీసేసేవారు.

పులగం వండి వాటికి నివేదనచేస్తూ ఉండేవారు.

పై వచనంలో ఇది లేదు.

గోమయంతో, లిఖించాక గోమయపు ఉండలు కూడా చేసి దానికి పువ్వులూ, గవ్వలూ గుచ్చి వుంచారు. పాము కుబుసము, వేపఆకులు, పొగగా వేసేవారు, పసుపురంగు వస్త్రముతో అలంకరించి పార్వతీదేవిని పూజిస్తున్నారు. ఒకచేత్తో ప్రచండమైన దండాన్ని మరొక చేతిలో, ఎఱ్ఱటి పతాకను ధరించి రెక్కలు విప్పికొని వున్న నెమలిపై కుమార స్వామి కూర్చుని వున్నట్లు రచించారు. జేగురు రంగుతో సూర్య చం ద్రుల బొమ్మలను చిత్రించారు. ఎఱ్ఱటి తాడు గుమ్మానికి కట్టారు. యవలు, ధాన్యము, బియ్యపుపిండి ఉండలూ దిగతుడిచి వేశారు.

గుమ్మానికి పసుపులో ముంచి తరువాత సున్నంలో తడిపితే ఆ తాడు ముదురుపసుపు రంగులో ఉంటుంది. ఆది బాలెంతరాలు వున్న గుమ్మానికి కట్టినట్లయితే-రోగాలు రావడానికి కారణమైన విషక్రిములు రావు. గుమ్మాలు చందన జలంతో కడుగుతారు. ద్వారానికి రెండు వైపులా కుండ. మూకుడులకు పచ్చని దారాలుకట్టి నవ ధాన్యాలు పోసి పెంచుతారు. పసుపు గుడ్డలను గుమ్మాలకి రెండు వైపులా మామిడి ఆకు లతో సహా కట్టి వుంచారు.

పురుడు వచ్చిన తరువాత మూడవరోజు, అయిదవరోజూ, తొమ్మి దవరోజూ, ఎన్నెమ్మ గండపురోజులు అని పెద్దలంటారు.

ఆ రోజులలో మేకను, కోడినీ దిగతుడిచి అమ్మవారి కోవెలలో బలి ఇవ్వడంకూడా సాంప్రదాయం. అందుచేత ఒక పెద్ద మేకను పూలమాలలతో అలంకరించి వుంచారు — వేప చిగుళ్ళు గుమ్మాలకు ముందు పెట్టడం కూడా ఉండేది

బ్రాహ్మణులు శాంతి భద్రతలకై మంత్రాలను చదువుతూ ఆ నీళ్ళను అంతటా జల్లుతున్నారు. దేవీ పాదాలను చిత్రించి పూజిస్తారు.

వృద్ధ పురంధ్రులు తల్లీ పిల్లవాని క్షేమంకోసం అనేక రకములైన మంగళ గీతములు పాడుతున్నారు. సుస్వరంగా కొందరు బ్రాహ్మణులు విష్ణు సహస్రనామం అలా అహర్నిశలూ పారాయణ చేస్తున్నారు.

ఇందులో మనకి కావలసినవి—గోమయం, తెల్ల ఆవాలూ, రావి చిగుళ్ళూ, మఱ్ఱి ఆకులూ, వేప ఆకులూ, పోతుమేక కొమ్ము చూర్ణము, పాము కుబుసము గుమ్మానికి ముందు గోమయంతో బొమ్మలు—సిందూరంతో చంద్ర సూర్యులను చిత్రించడం పార్వతీదేవిని పసుపువస్త్రంతో అలంకరించడం.

ఇవన్నీ ఒక్కొక్కటీ వస్తుగుణ దీపిక పరిశీలించినట్లయితే వాటిలో గుణగణాలు చక్కగా తెలుస్తాయి. వీటివల్ల సూక్ష్మక్రిములు లోనికి చొరవు.

కనుక మన బాణుడు ఈ విషయములు సమగ్రంగా వ్రాశాడంటె పూర్తిగా వాటి విషయాలు తెలిసే వ్రాశాడు. ఇతడు వైజ్ఞానిక శాస్త్రవేత్త అనడానికి సందేహం లేదు.

## : చరిత్ర – బాణుడు :

సంస్కృత వాఙ్మయంలో చరిత్రకు శ్రీకారం చుట్టినవాడు బాణుడు మాత్రమే

ఇతనికి ఛాందు ఎందుచేతనో ఎవరూ చరిత్రదరికి వెళ్ళలేదు.

అసలు మనవాళ్ళకి అందిన సాహిత్యాన్ని ఆనందంగా చదువు కోవడమే గాని రాసిన కవి ఎవరూ? అతడి విశేషాలు ఏమిటి? అతని చరిత్ర ఎలాటిది? అనే జిజ్ఞాస ఏ మాత్రమూ ఉండదు.

మన దుస్థితి ఎలా ఉండేదంటే ఇతర దేశాలనుంచి వచ్చి మన దేశ ఔన్నత్యం సాహితీ సంపదా చూసి ముగ్ధులైన వాళ్లెందరో వున్నారు.

సుయాన్‌చ్వాంగ్ చైనా దేశస్థుడు మన దేశానికి వచ్చి మన చరిత్ర వ్రాశాడు, ఫాహియాన్ వీళ్ళు రాసేదాకా మనవాళ్ళకు చరిత్ర వైపే దృష్టి వెళ్ళలేదు.

మన బాణుడు హర్షుని ఆస్థాన కవిగా ఉండేవాడని మనకు తెలుసు.

తన రాజుమీద వున్న ప్రేమ ఆదరాలు శాశ్వతంగా నిలపెట్టు కోవాలనే సదుద్దేశంతో హర్ష చరిత్ర వ్రాశాడు.

ప్రభాకర వర్ధనుడి కొడుకు హర్షుడు. కుమార్తె రాజ్యవర్ధనుడు రాజ్యశ్రీ—ఆవిడను గ్రహవర్మకిచ్చి వివాహం చేశాడు తండ్రి. కాని అనతికాలంలోనే దేవగుప్తుడు—గ్రహవర్మను చంపి రాజ్యశ్రీని చెర సాలలో ఉంచాడు.

అక్కడ ఈవిడ చాలా కష్టాలు అనుభవించింది. గోరుచుట్టుమీద రోకటిపోటులా, తండ్రి పోయినందుకే బాధగా వున్న హర్షుడికి చెల్లెలి భర్తను చంపడమే గాకుండా ఆవిడకు బంధించడం చాలా బాధ అని పించింది.

అల్లారు ముద్దుగా ఇంట పెరిగిన చెల్లిని శతృవు చెరలో పెడితే కాపాడలేక పోయానే అని హర్షుడు కంటికి కడివెడుగా నీళ్ళు కార్చి కుమిళ్ళి కుమిళ్ళి ఏడ్చాడు.

చెల్లిని విడిపించలేకి జీవితం ఏం జీవితం ఇదొక జీవచ్ఛవం అని తపించిపోయాడు.

చెల్లిని వెదకడం ఆరంభించాడు—చెట్లూ, చేమలూ, కొండలూ, గుట్టలూ ఇవీ అవీ ఏమిటి ఆ నాడు సీతను రామలక్ష్మణులు వెదకినట్టు వెదికాడు. కారాగారంలోంచి చెల్లి పారిపోయిందన్న వార్త చారుల వలన విన్నాడు గనుక.

చాలా దూరంలో అగ్ని మంటలు వేస్తున్న దృశ్యం ఆ తరువాత అందులో ఎవరో దూకపోతున్నట్టూ కనిపించింది. వెంటనే ఎవరో పడ బోయే మనిషిని బయిటికి తీసినట్టుకూడా కనిపించింది. ఆ యిద్దరి పెనుగులాట స్పష్టంగా తెలుస్తూంది.

హర్షుడు ఇదంతా దూరంనుంచి చూశాడు. ఒక్క పరుగులో అక్కడికి చేరుకున్నాడు—ఆ ఆపదనుంచి ఆమెను రక్షించాడు, తరు వాత ఒక్కసారి ఆవిడను గట్టిగా తేరిపార చూశాడు—

లోతుకి పోయిన కళ్ళూ చెక్కిళ్ళనిండా కన్నీళ్ళూ కారిస కారు తున్న జాడలూ, ముఖం అంతా ఎంతో పీక్కుపోయి వున్న ఆ భిక్షు కుని ఒక్కసారి చూచుకోంగానే తన చెల్లెలే.

అలాంటి స్థితిలో ఆవిడను చూసేసరికి గుండె చెఱువై బావురు మన్నాడు—హర్షుడు అమ్మా చెల్లీ ఎంతవనిచేదాం అనుకున్నావ్— నేనొకణ్ణి ఉన్నానే — నేను లేననుకున్నావా? అందుకవి ఇంతవని చేదామనుకున్నావా? చెల్లీ నువ్వు ఈ నిప్పుల్లో దూకితే ఈ అన్నయ్యను ఏంచేసి పోదాం అనుకున్నావ్ సరియైన సమయానికి చూసి నిన్ను రక్షించుకోగలిగాను.

ఇంత సాహసంగా ప్రాణాల్ని విడిచిపెట్టను అని ఈ అన్నమీద ఒట్టేసి చెప్పవా? నా చిన్నారి ముద్దు చెల్లీ అంటూ ఒక్కసారి దగ్గరకు తీసుకున్నాడు—

ఈ ఘట్టాల్ని చిత్రించడంలో కూడా బాణుడు తనకూ తనకూ ఆప్యాయిత ఉన్న ఒక అక్క ఒక చెల్లీ ఒక అన్నా—తమ్ముడూ ఎవరైనా తన కష్టాల్ని పాలు పంచుకొనేవాళ్ళు గాని సంతోషంలో బాగస్వాములుగా గాని సాదరంగా సాపేక్షగా ఒక చిన్న నవ్వుతో అయినా ఆదరించేవాళ్ళు గాని, లేక తన దుర్భర జీవితాన్ని ఆ యా ఘట్టాలలో అతి రమణీయంగా అభివర్ణిస్తూ ఉంటాడు.

హర్షుని ఆస్థానంలో ఇతనికి ముందు ధావకుడను కవి ఉండేవాడు.

అతని తరువాత బాణుడు ఆస్థానంలోకి వచ్చాడు—హర్షుడు ఇతణ్ని తరువాత వచ్చినా ప్రతిభను పట్టి ప్రధాన స్థానం ఇచ్చి గౌరవించాడు అయినా ధావకుడికి మాత్రం ఇతడిపై అసూయా ద్వేషాలు లేవు. సరిగదా ఇద్దరూ మంచి స్నేహంగా ఉంటూ ఉండేవాళ్ళు.

హర్షుడు శతృవులను జయించాడు. శుటప్రదారు లందరినీ కూకటి వేళ్ళతో పెల్లగించి పారేశాడు. కన్యాకుబ్జాడికి, రాజ్యశ్రీని పట్టాభిషిక్తురాలని చేశాడు.

తాను స్థాణేశ్వర సింహాసనాన్ని అధిష్టించాడు. తాను రాజ్యశ్రీని రాజ్ఞనిచేసి, చేతుల జోడించి రాజులందరి సమక్షంలో నేను ఈ నాటి నుండి ఈవిడకు సామంతరాజుని — మీ రందరూ కూడా విధేయులై ఈవిడ ఆజ్ఞాపాజ్ఞలలో ఉండాలి—అని ఆదేశించాడు.

ఇవి చూసి భండి మొదలైన వాళ్ళందరికి లోలోన ఒళ్ళు మండింది. గుండెలలో కుళ్ళు పెరిగింది అంతర్గతంగా అసూయా ద్వేషాలనే దుష్ట రక్తం నరనరాలలో వరవళ్ళు తొక్కింది.

ప్రజానీకం అంతర్గతం ఏమో ఈ కాల వైపరీత్యం కన్యాకుబ్జ సింహాసనంమీద ఒక్క స్త్రీ కూచుని పరిపాలిస్తుందా? అందులోనూ విధవ! ఎంతటి అమాయిత్యం ఎంతటి అఘాయిత్యం—

హర్షుడికి ఆవిడమీద ఎంతో అభిమానం ఉండవచ్చు గాని ఇలా నవ్వులపాలయేటట్టు సామ్రాజ్ఞిగా ప్రకటిస్తాడా! అనాధ రాజ్యపాలన చెయ్యడం లోకానికి అనర్థం కదూ—ఇంతటింతటి మగవాళ్ళం పౌరుషం చంపుకొని తలచెడినదాని దగ్గర తలవంచడం నిజంగా మనకి, తలకి తగని తలపంపు—అయినా, హర్షుడు ఎదురుగా ఏం అని నోరెత్తడం నోరు మూసుకోవడమే ప్రస్తుతానికి శరణ్యం.

అలా ఉండేది ఆనాటి లోకం.

మన బాణుడు సమయం వస్తే సమరం చేస్తాడు గుబ్బపుస్వారి వచ్చు. పరశురాముడిలా 'శాపాదపి శరాదపి' అన్నట్లు శపించగలడు శరాసనం తీసి శత్రు సంహారం చెయ్యగలడు. 'పప్పు బ్రాహ్మడు' అని కేవలం పప్పుసుద్ద లాంటి దద్దమ్మ కాడు—రాజకీయ వేత్త ఎప్పుడు ఏ పావుని ఎలా నడపాలో తెలిసిన చదరంగ వేత్త. రాజకీయాలను కూడా సమర్థవంతంగా నడిపే మంత్రిగా కూడా ఉండగలడు.

అందులో హర్షుని ఆస్థానంలో అంతరంగికుడిలా, మంత్రిలా, ఆస్థాన కవిలా, రాజు కుడిభుజంలా ప్రవర్తిస్తూ వచ్చాడు.

ఆ అభిమాన గౌరవాలకు చిహ్నంగా శాశ్వతంగా హర్షరాజ్యశ్రీ—హర్ష చరిత్రను మహా సమర్థవంతంగా రాశాడు అందులో కాదంబరి అంత ఎక్కువగా వర్ణనలు లేవు.

మంచి చరిత్ర కారుడుగా కూడ బాణుడు రాణించాడు. ప్రాశస్త్యం వుంది.

మన దుస్థితి ఎలా వుందంటె ఇతర దేశాలవారు మన దేశానికి వచ్చి ఇచటి ఔన్నత్యం సాహితీ సంపద చూసి ముగ్ధులైన వాళ్లెందరో ఉన్నారు.

ఫాహియాన్, హుయాన్‌త్సాంగ్ మొదలైనవారు ఇక్కడకు వచ్చి మన సంపదను చూసి మన చరిత్రను వ్రాశారు. ఆ యా చరిత్రలే మనవాళ్ళ చరిత్ర రాయాలి అనేవాళ్ళకు ఆధారం.

కవుల చరిత్రలు రాసినవాడు కందుకూరి వీరేశలింగం పంతులుగారు.

అది కూడా అసమగ్రమే.

కవి—నియోగా? వైదికా? పశ్చిమగోదావరి జిల్లా? లేక కృష్ణా జిల్లా. ఇలాగ్గా కవి చరిత్ర రాసినవాడు నియోగి అయితే ఆ కవులంతా నియోగులు కావలసిందే.

కవి చరిత్ర రాసినవాడు వైదికైతే, కవికూడా వైదికె కావలసిందే. చరిత్ర రచించిన కవి వైష్ణవుడైతే వాడి చేతిలో కవులంతా వైష్ణవులే.

చరిత్ర రచించిన వాడు శైవుడైతే అతని చేతులో కవులంతా శైవులు కావాలి.

కవుల చరిత్ర వందా—కవి నియోగా వైదికా, ఏ జిల్లావాడు? ఏ శతాబ్ది గ్రంథాలు మచ్చుకి రచనలో రెండు పద్యాలు మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు సంస్కృత కవుల చరిత్ర ఇంతకంటె కొంత నయం.

మన చరిత్రను ఆంధ్రులకు అందివ్వడంలో మహనీయులు మల్లంపల్లి సోమశేఖర శర్మగారు చాలా కృషిచేశారు. శాసనాల ప్రమాణి

కంతో సహా ఆయన కాల నిరూపణ గణనీయంగా చేసి నిరూపించారు. మారేమంద రామారావుగారు చరిత్ర శోధకులలో గట్టిగా పనిచేశారు.

మామిడిపూడి వెంకట రంగయ్యగారు చరిత్ర రాశారు గాని ఇతర దేశీయులు అందించినంత మాత్రమే గాని దేశ చరిత్ర దేశ ప్రజలకు అందివ్వాలి అన్న తపన అంతగా కనపడదు. తెలియని మహనీయు లెందరో వుండవచ్చును.

మన చరిత్ర మన ప్రజలకిస్తే భావిభారత ప్రజలు మనీషావంతులై మన తెనుగుతల్లి సేవ చేయగల్గుతారు. ఎంతో ఉత్సాహంగా ఆంధ్రులు పూర్వ చరిత్రలో శోభించినట్లె భవిష్యత్తులో శోభిస్తారుగాక.

## : వ ర్ణ న లు :

### విం ధ్యా ట వీ వ ర్ణ న

( బాణుని ప్రతిభ )

పూర్వ పశ్చిమాలకు మధ్యగా వింధ్యారణ్యం ఉంది.

అడవి యేనుగుల సమృద్ధమైన మదజలంచేత అచటిచెట్లు ఏపుగా పెరిగాయి. ఎత్తైన వృక్షాలపై దట్టంగా వికసించిన పూవులశోభ నభోరంగంలో ప్రకాశించే నక్షత్రాల్లా అతి రమణీయంగా ఉన్నాయి.

మదించిన ఏనుగు గున్నలు, మిరియపు చిగుళ్లూ, తమాలకిసలయాలూ చిందర వందర చేయగా అది అరుణరాగంతో ఉందిట, ఎలాగ అంటె కేరళ స్త్రీల బుగ్గలలో లేత ఎఱుపురంగులాగ—వనదేవత సంచారం చేస్తూ ఉంటే ఆమె పాదాల అత్తుక ఎఱుపు ఈ పల్లవాలకి తాకి

వుందా ? అన్నట్టు కనిపిస్తూంది. చిలుకలు ఎక్కువగా ఎప్పుడూ ఎఱ్ఱ దానిమ్మ గింజల్ని తింటూ వుండడంచేత అవనం అంతా ఆ గింజలరసం చేత చెమ్మ చెమ్మగా ఉంది. చపలత్వానికి నిలయమా ? అనే కోతులు చెట్లను ఎప్పుడూ కదుపుతూ వుంటాయి. అందుకు ఆ ప్రదేశం అంతా కొమ్మలతో ఆకులతో తీగలతో కాలినడకతో వచ్చే మనుష్యుల శ్రమ తీర్చడానికి శయ్యలా ఇవి అన్నట్లు అలరారుతూ వుంటాయి. చిగుళ్ళ మీద పుప్పొడి అక్కడక్కడ పడి పాంధులకి పచ్చటి అక్షితలు జల్లి ఆహ్వానిస్తోందా ? అన్నట్లుగా వుంది కొబ్బరి చెట్లూ గన్నేరు చెట్లూ పొగడచెట్లూ మొగలిచెట్లూ ఎంతో ఏపుగా పెరిగి వున్నాయి. కొబ్బరి చెట్ల సంతానం లాగ పోకచెట్లూ చాలా అందంగా వ్యాపించి వున్నాయి. వాటినిండా ఎక్కడా ఎడం లేకుండా తమలపాకుల తీగెలు అల్లుకుని సూర్యరశ్మి చొరనంత దట్టంగా ఉన్నాయి ఆకులతో, నిండివున్న ఆ లతా మండపాలు, వనలక్ష్మికి నివాస భవనాలలా చాలా కమనీయంగా ఉన్నాయి.

ఏలకుల తీగెలు ఎక్కడ చూసినా అల్లుకున్నాయి. మదగజాల చెక్కిళ్ళనుంచి జాలువారే నీరు వాటిని తడుపుతూ వుండడంచేత పరిమళాలు దిగంతాలు నింపుతూన్నాయి.

అక్కడ లతలు అతిగా అల్లుకున్నాయి గనుక గాఢాంధకారంగా వుంది. ఆ ప్రదేశం అంతా.

శబరులు అహర్నిశలూ అక్కడకు వచ్చి సింహాలని వేటాడుతూనే ఉంటారు. ఎందుకంటే మదగజ కుంభస్థలాలలో ఉండే మంచి ముత్యాలు సింహపు పంజాలలో ఇరుక్కొని పట్టలేనన్ని ఉంటాయి గనుక. ఆ ముత్యాల సంపాదన కోసం ప్రాణంమీద తీపిని విడిచిపెట్టి ఆ సింహా

లని అసంఖ్యాకంగా చంపుతారు. యమధర్మరాజు వట్నంలా భయం కర, మృత్యువు సమీపించి ఉంటుంది.

యముడివాహనం దున్నపోతు. ఈ అరణ్యంలో అడవి దున్నలు అసంఖ్యాకంగా వున్నాయి.

యుద్ధ సన్నద్ధమైన సైన్యం బాణాలతో సింహనాదాలతో పతాక లతో అలరారుతూ వుంటుంది.

ఈ అరణ్యం కూడా దట్టంగా పెరిగిన వెదుళ్ళతో, సింహాలతో, వృక్షాగ్రాలనే పతాకలతో ఒప్పి వుంది.

అచల రాజతనయ, రక్త చందనాన్ని, మేపూతగా నలంకరించు కొని, చేత ఖడ్గము శిరమున చంద్రవంక కర్ణాలకు కర్ణికార పుష్పాలూ, తిలక వృక్షాలనే తిలకాన్ని పెట్టుకుని అక్కడ ప్రత్యక్షంగా వుందా? అనిపిస్తూంది.

అరణ్యంలో-

సదా సమరం చేసే శబరులూ, చెట్లచివరి కొమ్మలనే పతాకలూ ఖడ్గమృగాలూ, రక్తచందనపు వృక్షాలూ, కొండగోగుపూల అరుణ రాగమూ, చెవులపిల్లులు, లెక్కకు మిక్కిలిగా సంచరిస్తూ ఉన్నాయి.

ప్రపంచ లయ సమయంలో పరమశివుడు ప్రళయ తాండవం చేస్తున్నాడా? అన్నట్లు నెమళ్లు రమణీయంగా పురివిప్పి నృత్యం చేస్తు న్నాయి. ఎఱ్ఱటి చిగుళ్ళ కాంతి వ్యాపించిందట—ప్రళయ తాండవం చేసే ఈశ్వరుడి నేత్రాలుకూడా ఎఱ్ఱబారి ఉన్నాయి.

అమృతం కోసం వాసుకి తాడుగా మందర పర్వతం కవ్వంగా తీసుకుని దేవదానవులు పాల సముద్రాన్ని మథించగా—అందులోంచి

అమృతమూ, లక్ష్మీదేవి, కల్పవృక్షం, ఉచ్చైశ్రవమూ, కల్లా కూమి ఉద్భవించాయి.

అరణ్య పక్షంలో తేనె, వనలక్ష్మి—మంచిగంధపు చెట్లూ, మంచి గుత్తాలూ, కల్లా పీటి అన్నిటితోకూడి ఉంది.

ఎప్పుడూ కారుమబ్బులు కమ్మి ఉన్నాయా ? అన్నట్లు అనేకమైన చెట్లు దట్టంగా ఉండడంచేత గాడాంధకారంగా కనిపిస్తుంది. అక్కడ కొలకులు నీటిపల్లాలు ఆన్నాయి. ఎలుగుఅంట్లు, లేళ్లూ అలా తిరుగుతూ ఉంటాయి.

వనదేవతకు విశ్వాసంగా వింజామరలు వీస్తున్నాయా ? అన్నట్లు చమరీమృగాలు తమ తోకల కుచ్చులతో గాలివీస్తూ ఉంటాయి. అడవి ఏనుగులూ, సింహాలూ సంచారం చేస్తూ ఉంటాయి.

శబరసైన్యం తూటాలకు ముట్టించే జానకితాడు — (నిప్పు ముట్టించే తాటిని జానకి తాడు అంటారు) తీసుకుని బయలుదేరుతుంది— ధర్భలు అతి ఏపుగా పెరిగి ఉన్నాయి.

అరణ్యంలో సీత కుశుని కన్నది, కున్నంది అది చిహ్నంగా ఆనందంతో కుశలు, (ధవలు) ఎంతో ఏపుగా పెరిగాయా ? అన్న ట్టుంది.

వనదేవత అనే విరహిణ్నికి శీతలం అందించాడానికా అన్నట్టు చందనమూ, కస్తూరి మొదలైనవి ఘుమఘుమ లాడుతున్నాయి. ఆవి దకు పరిచారికలు ఉపచారం చేస్తున్నారా ? అన్నట్లు గాలికి పల్లవాలు మెలగా కదలాడుతున్నాయి.

ఆకులు కనిపించనంత దట్టంగా అడవి అంతటా పువ్వులు చక్కగా విచ్చి ఉన్నాయి.

ఆ అరణ్యమంతా తేనెపట్టులు ఎక్కువగా ఉండడం చేత తెల్లని మైనం అక్కడక్కడా పడివుంది. అది కల్లు అంగడేమో అనేభావన కలుగుతూంది.

అక్కడ అడవి పందులు కోరలతో భూమిని పెళ్లగించగా పెద్ద పెద్ద గుంటలు పడివుంది. ఆ ప్రదేశం అంతా నిశాచరులు — రాత్రి చరించేవారు (రాక్షసులు) ఒక అర్థం. క్రూర జంతుజాలాలు — 2వ అర్థము. రావణుని లంకా రాజ్యంలో కోతిమూకలు సాలవృక్షాల కొమ్మలు ఊపుతూ ఉంటాయి.

పచ్చని కుశలు ఎఱ్ఱని మోదుగ వృక్షాలతో నిండివున్న అరణ్యం చక్కని వివాహ మండపమా? అన్నట్లుంది. సింహాలు గర్జిస్తూ ఉంటే ఆ ధ్వనులకు అడవి భయంతో రోమాంచమై ఉందా? అన్నట్లు అచటి ముళ్ళు నిక్కపొడుచుకు నుంచున్నాయి.

కోకిలలు కుత్తుకదాకా మద్యాన్ని త్రాగి అది ఇచ్చినందుకు ఆ అరణ్యానికి ధన్యవాదా లర్పిస్తున్నట్లు తెగ కూస్తూ ఉంటాయి.

తాటిచెట్లు గాలికి రాపాడుతూ ఉంటె ఆ తాటి కమ్మల గల గల ధ్వనులు వినపడతాయి. వెదురుచెట్లు బారులు తీర్చి ఉండగా చూపరులకు సైన్యము ఉందా అని అనిపిస్తు గాలికి అల్లాడే ఆకులమధ్య సూర్య రశ్మి అరణ్యం అంతా అక్కడ అక్కడ తెల్లగా కనిపిస్తూ ఇంద్రుడి వేయికళ్ళా ఇవి అన్నట్టుంది. ఆ అరణ్యం అంతా చీకటి వృక్షాలు నిండి ఉండడంచేత నీలమేఘ శరీరుడైన విష్ణువు ఇదంతా వ్యాపించాడా అనే భావం కలుగుతుంది.

పార్థుడి పతాకంపై కపి ఉంటుంది. అందు కతడు కపి ధ్వజుడు.

ఈ అరణ్యంలో కూడా కోతులు సంచరిస్తూ ఉంటాయి. రాజు గారి ద్వారమా అన్నట్లు అనేకంగా వెదురుకఱ్ఱలు పెరిగి వేత్రహస్తులతో నిండి వుండి ఇంకెవరూ ప్రవేశించడానికి వీలులేకుండా ఉంది.

విరాటుడి నగరంలో కీచకు డున్నాడు. ఈ మహారణ్యంలో వెదుళ్లు నిండి ఉన్నాయి.

ఆకాశరంగంలో మృగవ్యాధ రుద్రుడున్నాడు. ఇక్కడ చాలా మంది వేటకాండ్రున్నారు.

ప్రకాశవంతంగా ఉండే మృగశిరా నక్షత్రాలతో నభోరంగం కాంతివంతంగా ఉంది.

అరణ్యంలో మంచి మంచి లేళ్ళు సంచరిస్తున్నాయి. అరణ్యమనే స్త్రీ తపోవేషాన్ని ధరించిందా అన్నట్లు దర్భలనే జడలు వల్కలాలనే నారచీరలు ధరించి ఉంది,

విరోధాభాస

బహుళపత్ర సంచయాపి స ప్తవర్ణ భూషితా.

ఏడు ఆకులే కలిగినపుడు అనేకమైన ఆకులు ఎలా కలిగి ఉంటాయి ?

ఏడాకుల అరిటిచెట్లతో చాలా ఆకులతో నిండివుంది. క్రూర సత్వాపి, మునిజన సేవితా.

క్రూర మృగాలంటే మహర్షులతో ఎలా సేవించబడుతుంది ?

మహర్షుల తపోశక్తిచేత అచటి మృగాలు, సాత్వికంగా ఉంటాయి.

పుష్ప పత్యసి పవిత్రా—

పుష్పవతులయిన వారు పవిత్రంగా ఎలా ఉంటారు? అరణ్య మ్ంతా ఎన్నో పుష్పాలచేత పవిత్రవంతంగా ఉంది.

ఇలా ఉందిట వింధ్యారణ్యం.

దండకారణ్య

తండ్రి దశరథుడి ఆజ్ఞ ప్రకారం రాముడు సీతా లక్ష్మణులతో సహా ఈ అరణ్యానికి వచ్చాడు—పంచవటిలో వారు పర్ణశాలను వేసుకున్నారు.

అక్కడ అగస్త్యుని పూజించారు—ఇంద్రుడు ప్రేరణ చేయగా, సప్త సముద్రాలూ, పుడిసిటపట్టి త్రాగిన ఘనుడాయన.

వాతాపిని తినేసి మరుక్షణంలో జీర్ణం చేసుకున్నాడు—ఆ అరణ్యానికే వాతాపి ఇల్వలుల బాధను తొలగించాడు. అగస్త్యుని భార్య లోపాముద్ర—అచటి వృక్షాలన్నిటినీ ఆమె నీళ్ళుపోసి చక్కగా పెంచింది.

రామ లక్ష్మణులు—కబంధుడి చేతులు నరికేశారు—అందులో ఒక చెయ్యి ఇతని పాదాలదగ్గిర పడింది. అది చూసేవాళ్ళకు అజగరమా? అనే భావన కలిగిస్తోంది.

ఇతడు ఒక్క హుంకారంతో సహురుషుణ్ని భూమిమీద పడేటట్టు చేశాడా? అనిపిస్తుంది.

ఇప్పటికీ ఆ అరణ్యంలో ఉన్న చెట్ల పొదలలో ఉన్న పావురాలు ఎగురుతూ ఉంటె ఆ నాటి మహర్షుల హోమధూమమా? అనే భ్రమ కలుగుతుంది.

ఒకపుడు సీత లేతమామిడి చిగుళ్ళ కంటె కోమలంగా ఎఱ్ఱగా ఉన్న తన చేతుల్తో ఆ చెట్లని పెంచిన కారణంచేత ఆ గుణము ఈ చెట్లకు గట్టిగా పట్టిందా? అన్నట్లు అక్కడి చిగుళ్ళన్నీ ఇప్పటికీ చాలా ఎఱ్ఱగా ఉన్నాయి.

అగస్త్యుడు తను తాగేసిన సముద్రాన్ని తిరిగి ఇలా ప్రవహింప చేశాడా? అన్నట్లు అక్కడ చిన్న చిన్న చెఱువులు నీటి పల్లాలు కన పడతున్నాయి.

లెక్క లేనంతమంది రక్కసులను అక్కడే చంపాడు రాముడు— ఆ రక్తపాతం చేతనే కాబోలు అక్కడి చెట్లన్నీ ఎఱ్ఱటి చిగుళ్ళు కలిగి చూపరుల నాకర్షిస్తున్నాయి.

వర్షాకాలపు ఉఱుములు వింటే ఇప్పటికీ అక్కడి ప్రాణులకు రాముడి ధనుష్టంకారమే జ్ఞాపకం వస్తుంది.

అక్కడ లేళ్ళు చాలాకాలం మళ్ళినవై ఉన్నాయి. కొమ్ములు కూడా విరిగిపోయాయి. కళ్లూ కాళ్లూ నిస్సత్తువగానే ఉన్నాయి.

వాటిని అవనిజ అతి ఆదరంతో అనాదు సాకింది. ఈ శబ్దం విన్న లేళ్లు ఆవిడ జ్ఞాపకం రాగానే శూన్యంలోకి చూస్తూ గడ్డిపరకల నైనా కొరకడం మానేసి కన్నీళ్ళు కారుస్తూ ఉంటాయి.

రాముడు కాలక్షేపానికి వేటాడుతూ చాలా లేళ్ళని చంపాడు — అది క్షత్రియ ధర్మం గనా?

షూ వని సరి. కాని ఈ ఆశ్రమంలో అంటే తపోధనుల హృదయాలు జీవకోట్లను ప్రేమిస్తూ వుంటాయి. వారి ప్రేమామృత వర్షం ఎప్పుడూ అకారణంగా అన్ని కాలాలలోనూ, అన్ని జీవులమీద వర్షిస్తూ వుంటుంది. వారి హృదయ ఉత్పలాలు ఎప్పుడూ వుత్ఫుల్లంగానే వుంటాయి. అని గొంతెత్తి చెపుతున్నాయా? అన్నీ అన్నట్లున్నాయి. కొలను నిండా వున్న ఆ పూవుల పరిమళాలు దిగంతాలు వ్యాపిస్తూ మకరందం మస్తుగా వుందని ఆళులను ఆహ్వానిస్తున్నాయా అన్నట్టుంది.

తేనె సోనలు మిక్కుటంగా వుండి ఆ నీళ్ళల్లో అర్థచంద్రాకృతితో అందరికీ ఆనందాన్ని కలిగిస్తున్నాయి. హంసలు అన్ని వేళలా అక్కడ అవాసం ఏర్పాటు చేసుకున్నాయి ఎందుకంటె ఆహారానికి అటమటించక్కర్లేదు గనుక. తుష్టిగా పుష్టిగా తూండ్లు తిని మత్తెక్కి అవి జీర్ణం అయేదాకా, హాయిగా కలకల ధ్వనలు చేస్తూ వుంటాయి. లోపల జలచరాలు వాటి రెక్కల నీడల్ని చూసి అవేవో తమకు ఆహారంగా వచ్చాయని ఆ నీళ్లన్నీ కల్లోలితం చేస్తున్నాయి.

మహర్షులు తమ అహ్నికాదులకోసం కమండలాన్ని నీళ్ళలో నింపుకుంటూ వుంటారు. ఆ చప్పుళ్ళకు అందులో చేపపిల్లలు చెదరి చెదరి తల్లి చేపలను కఱుచుకుపోతూ వుంటాయి. కావితాల్పులు తమ కాషాయ వస్త్రాలను ఉదికి ఉదికి ఎండ వేసుకుంటూ వుంటారు — వాటి రంగు ఆ నీటిలో ప్రతిబింబించి బంతిపూవు రంగు కలిపిన నీళ్ళా! అన్నట్లు శోభిస్తు వుంది.

పుళింద రాజకుమార్తెలు అక్కడకు స్నానానికి వస్తూవుంటారు. వారి మేపూతల ఘుమఘుమలు ఆ నీళ్ళకు గట్టిగా పట్టి పన్నీరుకొలనా! ఇది? అనే భ్రాంతిని కలిగిస్తుంది పాంధులకు.

ఆ సరోవరం చుట్టూ వృక్షాలు పరివేష్టించి వుంటాయి — పెకెటి వృక్షాలు—పగలే చీకటి అనే భ్రాంతి గొల్పేటట్లున్నాయి— వృక్షాల చెట్లుకూడా చాలా వున్నాయి. మొగలిరేకుల పుప్పొడి, పసుపు ఒలక పోసిన ఇసుక తిన్నెలా అన్నట్లుంది; పూల పరిమళాలతో ఆ టి తుంపర లతో చల్లనిగాలి వీస్తూ వుంటుంది.

ఋష్యమూక పర్వతం ఆ సమీపంలోనే వుంది. వాలితో పడక సుగ్రీవుడు అక్కడే ఉంటూ పళ్ళు తింటూ వుండడంచేత చెట్లన్నీ కట్టివైపోయాయి. మహర్షులు దేవుడిపూజకు పూలుకోసూ వుంటారు. పూలులేని పూ మొక్కలు పిల్లలులేని తల్లుల్లా తలలువంచి వున్నాయి.

నెమళ్లు ఆ లతా మండపాలలో పురివిప్పి సంతోషంగా నృత్యం చేస్తున్నాయి. ఆ సరస్సులో అలలు మృదంగాల ధ్వనులు కోకిలమ్మ పాటలు ఆ నృత్యానికి గానం చేతనా అచేతనాలన్నీ ప్రేక్షక సము దాయం.

ఏనుగు గున్నలు హాయిగా తిరిగి తిరిగి బురదలో పొర్లాడిపొర్లాడి అలసి సొలసి, వచ్చి ఆ సరస్సులోకి దిగి నీళ్ళు తాగుతూ వుంటాయి— దూరంనుంచి ఈ దృశ్యము తూస్తుంటే మానస సరోవరం నీ ముందు ఎందుకూ పనికిరాదు—మేం నీ దగ్గరకే వచ్చి నీళ్ళు తాగుతాం అని కారు మేఘాలు గుంపులు గుంపులుగా వచ్చి ఆ నీళ్ళు తాగుతున్నాయా ? అనే భ్రాంతిని కలిగిస్తున్నాయి. ఆ అరణ్యానికి అంతటికీ అందాన్నిస్తూ అల రారుతోంది——ఆ పంపా సరోవరం.

: శాల్మలీ వృక్షము వర్ణన :

అ పంపా సరోవరానికి పడమటి దిక్కుగా ఒక పెద్ద బూరుగు వృక్షం ఉంది——ఆ చెట్టు వయిస్సెంతో మనం చెప్పలేము. కాని దానికి

దగ్గరలోనే శ్రీరాముడు వాలిని చంపడానికి ముందు ఒక్క బాణంతో ఏడు తాటిచెట్లని కొట్టేసిన తాటితోపు ఉంది.

ఆ చెట్టు మొదట్లో ఒక పెద్ద కొండ చిలువ వుంటుంది. అది ఆ చెట్టును ఎప్పుడూ చుట్టేసుకుంటూ వుంటుంది. అందుకని ఆ చెట్టు మొదలు అంతా చాలా పెద్దగా గొప్ప తవ్వారా అన్నట్టు వుంటుంది. మంచి మదపుటెనుగు తొండం కంటె కూడా ఈ పాము చాలా పెద్దది.

ఆ చెట్టు కొమ్మలమీద మంచి నాగుపాముల కుబుసాలు గాలికి రెవ రెపలాడుతూ వుంటాయి—వృక్షం అనే స్త్రీకి. దాని కొమ్మలనే కూతుళ్లు—ఈ పాము కుబుసాలనే మేలైన పట్టుబట్టల్ని కట్టుకుని—గాలికి అవి అల్లాడుతూ వుంటే దేవలోకంలోని గంధర్వ స్త్రీలను—ఇక్కడికి రండరాి అని ఆహ్వానిస్తున్నాయా అన్నట్టుంది.

ఆ సమీపంలో వుండే జీవకోట్లను శబరులనే యమదూతలు ఏ క్షణంలో వచ్చి పొట్ట పెట్టుకుంటారో ఎప్పుడు వాటి ప్రాణాలకి మహా ప్రళయం సంభవిస్తోందో చెప్పలేం. అందుకని ఆ చెట్లకొమ్మలు సుదూరం వ్యాపించి గాలికి అవి కొట్టుకుంటూ వుంటాయి.

ఆ దృశ్యం ఎలా ఉందంటె పరమశివుడు కోపించి ప్రళయ తాండవం చేస్తున్నాడా జడలు విరపోసుకుని అన్నట్లు కనిపిస్తుంది. ఆ చెట్టు ఆకాశాన్నంటుతూంది. నన్ను కిందపడకుండా ఓ దేవతల్లారా పట్టుకోండి అన్నట్టుంది.

కొమ్మలు ఆకాశాన్నంటుతూ వృక్షమూలం నేలకి తాకుతూ ఉంటె భూమ్యాకాశాల నిడివిని కొలిచె కొలబద్దలా కనిపిస్తుంది.

ఆ చెట్టు నిండా ఎన్నో రక రకాల తీగెలు వ్యాపించి వున్నాయి. అవి మన దేహం అంతా నిండివున్న రక్తనాళాలా! అన్నట్టు ఆ చెట్టు

నిండా దట్టంగా ముళ్ళున్నాయి— ముసలితనంలో శరీరంమీద అక్కడక్కడా మచ్చలు వ్యాపించినట్టుగ ; మేఘ పంక్తులు ఆ చెట్ల కొమ్మల్లో దోబూచులాడుతున్నాయా ? అన్నట్టు కనిపిస్తున్నాయి. పక్షులు ఆ కొమ్మలలో దాగి వున్నట్లుగా వినపడుతున్నాయి.

సూర్యరథం తొందరగా నడునూవుంటే దానికి కట్టిన గుర్రాల నోటిలోంచి చిమ్మిన నురుగులు ఆ చెట్టంతా నిండి వున్నాయా అన్నట్టు బూరుగుదూది పింజలు పింజలుగా ఆ చెట్ల ఆకులనిండా ఉంది.

ఆ చెట్టు పట్ట అతి గటుకుగా వుంది. అడవి ఏనుగులు వాటి చెక్కిళ్లకు తీటగా వుంటే ఆ మాన్నుకి ఆన్చి రాపాడి రాపాడి దురద బాధని పోగొట్టుకుంటాయి. వాటి మద జల సుగంధానికి నల్లని తుమ్మెదలు బారులు బారులు తీర్చి అక్కడకు వస్తూంటె ఆ చెట్టు పెద్దదైంది గనుక పడకుండా ఉండాలని ఇనుప గొలుసులతో బిగించి పట్టుతున్నాయా అనే భావం తోస్తుంది.

దాని కొమ్మలు గాలికి కదలాడుతూంటె ఆ తొఱ్ఱలలో ఆశులు అవిరామ గా రొదచేస్తూంటే సజీవం సచైతన్యం గల వ్యక్తి ఏమో ఇది అని అనిపిస్తుంది. చెట్లకు మనుష్యుల లాగే ప్రాణం వుందని విషాద సంతోషా లుంటాయని జగదీశ చంద్రబోస్ నిరూపించాడు.

దుర్యోధనుడికి అతని మేనమామ శకునిమీద పక్షపాతం ఉంది.

దుర్—యోధ—చెడ్డపనులు చెయ్యడంలో ఘనుడు. దుర్యోధనుడు.

దుర్—యోధ కుటిలంగా పెరిగి వున్న వృక్షము.

శకుని—పక్షులతో కూడి ఉన్న—పక్షులపై ఈ చెట్టుకు పక్షపాతము.

తులసీవనమాల విష్ణుమూర్తికి ప్రీతి, ఈ వృక్షమున్కు అచటి వనాలంటె చాల ఇష్టము. వనదేవత లోకాన్నంతా చూడాలనే ఉద్దేశంతో ఆకాశాన్నంటె ఈ చెట్టు అనే భవనాన్ని నిర్మించుకుందా! అన్నట్టు కనిపిస్తుంది.

దండికారణ్యాని కంతటికి ఇది మహారాజాధిరాజు అక్కడి చెట్లన్నిటికి ఇది పెద్దన్నయ్య. వింధ్య పర్వతంతో సమానమైనంత, అంతకంటె గోరంత ఎక్కువే, తక్కువకాదు. ఇది అటిడికి ఇను మిక్కిలిగా, నెమ్మినిచ్చె నెచ్చెలికాదు. ఈ చెట్టు అనే చాన సుదూరం వ్యాపించిన తని కొమ్మలనే చేతులతో అరణ్యమనే రాజును గాఢాశ్లేషం చేసి అతణ్ని సమ్మానిస్తోందా అన్నట్లుంది.

ప్రకృతిని వర్ణించడంలో మనకవి సిద్ధహస్తుడు. అతి నిశితంగా ప్రకృతి పరిశీలనాశక్తి వుంటేనే గాని సామాన్యులు రసవంతంగా ప్రకృతి వర్ణనలు చెయ్యలేరు.

మనం ఎన్నో చెట్లని, గుట్లని, నదుల్ని, సరస్సుల్ని, మేఘాల్ని చూస్తూనే వుంటాం—ఈ కళ్లతో మామూలుగా చూసి ఆనందించే శక్తే మనకి లేదు—కవి దృష్టిలో అందును బాణుని చేతిలో అలువమైన పేలగింజ ఒక మంచి చక్కని రజత పర్వతమై కూచుంటుంది.

బాణా నువ్వు తల్లిని పసితనంలోనే విడిచినా ప్రకృతిమాతను ఎంతగా వర్ణించుకున్నావయ్యా. కన్నతల్లి ఋణం తీర్చుకోలేకపోయినా ప్రకృతిని ప్రతి అణువు వర్ణించి వర్ణించి ఆ విధంగా సేవించుకుని ధన్యతముడవయ్యావు.

బాణా నీ జన్మ చరితార్థం.

: సూర్యోదయ వర్ణన :

ఆకాశం అంతటా లేత పసుపు ఛాయతో అందంగా వుంది— సూర్య చంద్రులు ఇద్దరూ తండ్రి ఆస్తికోసం పోట్లాడుకున్న పరోధు ల్లాగ అంటారేమో! అన్నగారి ఢాకకు ఆగలేక తమ్ముడు గబగబ పరుగులెత్తి పశ్చిమకాంతా సమిట మఱుగులోకి జారిపోతాడు.

తామరపూల తేనె సోవలలో తడిసి తడిసి ఆ రంగు రెక్కలకు పట్టగా స్వర్గలోకం లోంచి వస్తున్న ముసలి హంసలాగ వున్నాడు, సూర్యుడు తూర్పుటాకాశంలో సూర్యకిరణాలు ఏనుగురక్తంతో బాగా తడిసి సింహపు జూలులాగ మెరిసిపోతున్నాయి.

మరి కాసేపటికి ఆ కిరణాలకు ఎఱ్ఱ రంగుగా విచ్చి అవి సన్నగా కాల్చిన ఎర్రని లక్కతీగెల సముదాయమా? అన్నట్లుంది.

సప్తర్షులు ఉదయవేళలో నిర్వర్తించవలసిన సంధ్యావందనాది కార్యక్రమాలు పూర్తిచేసుకోవడం కోసం మానస సరోవరానికి పోతు న్నారా? అన్నట్లు పశ్చిమదిశకు ప్రయాణం సాగించారు.

మంచు బిందువులు ఆకుపచ్చని నేలమీద దట్టంగా వర్షించాయి. ప్రభాకరుడు వస్తున్నాడని ప్రకృతి—ఆకుపచ్చని తివాసీ పఱచి—అందు మీద అలంకారార్థం మంచి ముత్యాలు వెదజల్లి ఉంచిందా! అన్నట్టు కనిపిస్తోంది. నెమ్మది నెమ్మదిగా నెమళ్ళు కళ్ళు తెరుస్తున్నాయి. ఆవ లింతలు నిద్రమత్తు వదలలేదు సింహాలకి. ఉదయభాస్కరుడు ఉద యాద్రిలో ఉదయిస్తూ నిద్రాణమైన జీవకోట్లను ఉపలాలిస్తున్నాడా తన కిరణాలతో అన్నట్టుంది ప్రకృతి అంతా.

రాత్రి అంతా మంచుతో తడిసిన ఆకులూ, తీగెలూ, పువ్వులూ అన్నీ నవ నవలాడుతూ వున్నాయి—పిల్లగాలులు వీస్తూ వుంటె పూలు జలజల రాల్తున్నాయి. ఉషఃకాంత దినకరుడికి లతలనే దోసిలితో పూలను పాదాలపై ఉంచి పూజిస్తోందా ఇన్నట్టుంది ఆ దృశ్యం.

మహర్షుల హోమధూమం చెట్లచివర భాగాలపై ఎక్కువగా వ్యాపిస్తోంది. ఇంతింత పొగ గుప్పు గుప్పున పైకివస్తూ ఉంటె పాపు రాలు గుంపులు గుంపులుగా బయలుదేరుతున్నాయా అని చూపరులకు తోస్తోంది.

గాలి లెమ్మెరలు పూల పరిమళాన్ని నింపి వీస్తూవుంటె పగటి రేడుకి పన్నీటి జల్లులతో పటీరాన్ని కలిపి వింజామరలు వీస్తున్నాయా? అన్నట్టుంది అచటి హంసల కలకల ధ్వనులు స్వాగత గీతాలతో, సూర్యుణ్ని సత్కరిస్తున్నాయా అన్నట్లుగా కనిపిస్తోంది. ఆకుపచ్చని చెట్లు అచ్చటచ్చట దట్టంగా విరియపూసిన రంగు రంగుల పూలు ఆకు పచ్చని శాలువమీద పూలు గుత్తులు గుత్తులుగా చిత్రించి దానిని బం గారు కిరణాలతో ప్రకాశించే ప్రభాకరుడికి కానుకగా ఇస్తున్నట్లని పిస్తుంది.

చంద్రుడు పూర్తిగా అస్తమించడంతో పాపం కలువలు ముకుళిం చుకుపోయాయి విరహంతో.

అంతపరకూ ఆకాశాన్నంతా వజ్రాలు తాపించిన ముఖమల్ ఛాందినీలా మెరిపించే రిక్కలన్నీ దిక్కుతోచక సూర్యునివైపు కోర చూపులు చూస్తూ చల్ల చల్లగా మెల్లి మెల్లిగా మటుమాయ మయాయి.

తారను విడిచిన సుగ్రీవుడులాగ ఉంది ఆ ప్రకృతి, తండ్రి దూర దేశానికి వెళ్ళి తిరిగి వస్తే పిల్లలు ఎంత సోముగా నిద్దరలోంచి లేచి

ప్పి నవ్వుల పువ్వులతో స్వాగతం ఇస్తారో, అలాగే లేడి పిల్లలు భానుడి రాకకు సంతోషిస్తూ విశాలమైన వాలుచూపులనే పూలమాలలు వేసి ఆనందపారవశ్యంతో చెంగు చెంగున గంతులు వేస్తూన్నాయి అతడు తన కిరణాలనే చేతుల్తో ఆప్యాయంగా వాటిని స్పృశిసూ ఆనం దిస్తున్నాడా? అన్నట్టుగా వుంది.

చిన్న వర్ణనలైనా బాణుడు బహు రమణీయంగా వర్ణిస్తాడు. అతని వర్ణనా చాతుర్యం అనితర సాధ్యం—ఎంతటి నిశితమైన భావనాశక్తో నిజంగా మన బాణునిది—ఆహా.

## శబరసైన్యం - శబర సేనాపతి వర్ణన :

వైశంపాయనుడనే చిలుక చిన్నతనంచేత ఒక పెద్ద కోలాహలం వినపడంగానే గూట్లోంచి తలపైకిపెట్టి గుడ్లు మిటకరిస్తూ చూస్తోంది శబర సైన్యాన్ని.

ఆరులా ఉ దిట :—

సహస్ర బాహువులున్నాయి కార్తవీర్యార్జునుడికి—అతని చేతుల క్రిందనుంచి ఉరవడిగా ప్రవహించే నర్మదానదీ ప్రవాహంలాగ శబర సైన్యం వచ్చేస్తోంది. ఆవి నల్లటి కృష్ణపక్షపు రాత్రిలన్నీ కట్టకట్టుకుని కలిసివస్తున్నాయా అన్నట్టున్నాయి.

చీకటిచెట్లు వేలాదిగా ప్రాణంపోసుకు గమనంగా పాగిస్తున్నాయా? అనిన్నీ, భూకంపంవస్తే కదలుతున్న కాటుక స్తంభాలులాగ, పాతాళ లోకం పగిలిపోగా పైకి వసూన్న రక్కసుల రాసులా? పాపాలన్నీ కట్టకట్టుకుని కదిలివస్తున్నాయా? రామబాణాలకి కోపంతో పెల్లుబికి వస్తూ వున్న ఖర దూషణాది సేనా సమూహంలాగ కలి పురుషుడి

మేఘ పంక్తులని మోర ఎత్తి చూస్తూంది. తెల్లదనంలో నన్ను మీరు ధిక్కరించ గలరా? అని సవాలు చేస్తోందా? అన్నట్టుంది. అంతే కాకుండా ఆ మేఘ పంక్తులని తాగేస్తుందా? అన్నట్టుంది దాని ఒళ్ళు అంతా అనేకమైన రంగులతో ఇంద్రధనస్సులా గైరికాది ధాతువుల్లో ఒప్పారి ఉంది. ధూళి దూసరితమైన నందీశ్వరుడా అని భ్రాంతి కలిగిస్తూంది. ఆ గుఱ్ఱాన్ని కెంపుల హారాల్తో అలంకరించారు — ఆ ఎర్రరంగు దానిమీద ప్రతిబింబించి శక్తివాహనం అయిన సింహం జూలు రక్తసిక్తమైనట్లుందా అనిపిస్తుంది. సోమరులను చూసి, అశ్వజాతి అయినా మీకంటె మేం వెయ్యిరెట్లు నయం అని ఛీ కొడుతున్నట్లు ఎక్కువగా నాసాపుటాల్ని ఆడిస్తోంది. లోకంలో ఉన్న కశ్మలాన్ని చూసి చూసి కోపంతో తనని ఎవరో ఆపేశారనే ఆవేశంతోటి ఘూర్ణిల్లే సముద్రంలా సకిలిస్తూంది. రంపం పళ్ళల్లా ఉన్న కళ్ళాన్ని దానినోటికి తగిలిస్తే నిర్దాక్షిణ్యంతో ఉన్న మానవులపై కోపంతో దాన్ని కట కట లాడిస్తోంది. అందుచేత నోట్లోంచి నురుగులు ఎక్కువగా వస్తున్నాయి. ఇది ఒకప్పుడు సముద్రంలోంచి వచ్చిన అమృతాన్ని తాగేసింది. మానవ లోకంలోకి వచ్చాక దాన్ని ఇముడ్చుకోలేక కక్కేస్తోందా అన్నట్లుంది దానికి కెంపుల పట్టెడ, పచ్చల పతకాలు బంగారు గొలుసులూ ముత్యాలు తాపిన మంచి జీను వేశారు—ఇలా అలంకరించారని కృతజ్ఞతా సూచకంగా డెక్కలతో నేలను గీరి సకిలిస్తోంది.

పచ్చలు పొదిగిన హారాలు ఎక్కువగా దానికి వేయడంచేత, దాని ఒళ్ళంతా పచ్చగా ఉండి సూర్యరథ అశ్వాన్ని గుర్తుకు తెస్తూంది.

దాని ఆకారం చూస్తూ వుంటె గరుత్మంతుడికి ప్రతిస్పర్ధి ఏమో ముల్లోకాలలో ఉండే గాలిదేవుడి స్నేహితుడిలాగ మనోవేగాన్ని మించిన వేగంలాగ ముల్లోకాలనీ మూడు పాదాలతో అక్రమించిన త్రివిక్ర

ముడులాగ మానస సరోవరంలో విహరించే రాజహంస లాగ అది కని పిస్తూంది.

ఇంకా దీన్ని చూస్తూ చంద్రాపీడుడు ఇలా అనుకొన్నాడు దేవ తలు రాక్షసులూ పాల సముద్రాన్ని మథించారే వాళ్ళు పొందిన లాభం ఏముంది ? ఇలాంటి గుఱ్ఱాన్ని వాళ్ళు పొందలేక పోయారే—ఇంత అంద మైన అశ్వాన్ని అధిరోహించలేని ఇంద్రపదవి నిజంగా వ్యర్థమే గదా! నారాయణుడు ఇంకా ఆ గరుత్మంతుణ్ణే పట్టుకున్నాడు—ఈ గుఱ్ఱా అతడు గట్టిగా చూసి ఉంటే ఎప్పుడో గరుడుణ్ని విడిచేసేవాడు.

చంద్రాపీడుడు ఎక్కబోతూ ఇంద్రాయుధం అనే గుఱ్ఱాన్ని చూసి ఆశ్చర్యచకితుడౌతాడు.

ఇది మనోవేగాన్ని మించిన వేగంతో వెళ్లగలదని వర్ణించాడు 'అశ్వస్య భూషణం వేగే' అన్నారు గదా పెద్దలు.

## : అ చ్ఛో ద న స ర స్సు వ ర్ణ న :

చంద్రాపీడుడు దిగ్విజయ యాత్రకోసం బయలుదేరాడు, మార్గ మధ్యంలో ఒక కిన్నెర మిథునం కనిపించింది — దాన్ని చూదామని వెంటాడగా వెంటాడగా అది అదృశ్యమైంది. త్రోవ తప్పాడు దాహం వేస్తుంది. అతడి గుర్రం కూడా అలిసిపోయింది. చల్లని గాలి ఈశాన్య దిక్కునుంచి వస్తోంది. ఆ వైపుగా వెళ్ళాడు. అక్కడ ఒక సరస్సు ఉంది.

దాని పేరు అచ్ఛోదన సరస్సు. అది ముల్లోకాలనీ పరిపాలించే లక్ష్మీదేవికి స్వచ్ఛమైన అద్దంలా ఉంది. స్ఫటికపు రాళ్ళతో నిర్మించిన దివ్యమైన కట్టడం. ఇది ధరిత్రికి ఆవాస స్థానంగా ఉంది, దీనిలోంచే

సముద్రజలాలు అన్నీ ప్రవహిస్తున్నాయా? అనిపిస్తుంది. దిక్కుల తెల్ల దనం అంతా ద్రవం చేస్తే దాని ప్రవాహమా? ఇది. వెండి మబ్బుల తునకలన్నీ ఒక దగ్గిర చేరి అవి నీరుగామారి ఈ సరస్సుగా ఉందా! మంచంతా కరిగి ఈశ్వరుడి రజితపర్వతం అంతా నీరైవచ్చి ఇంత స్వచ్ఛ మైన నీళ్ళతో ఉందనిపిస్తూంది. చంద్రుడు పుట్టినదగ్గరనుంచీ వచ్చిన వెన్నెలలను కరిగించిపోసిన ద్రవంలా ఉంది. శివుడి చిరునవ్వులు సర స్సుల అలలతో పలకరింపులు చేస్తున్నాయా? అనిపిస్తుంది శరత్కా లంలో చంద్రికలన్నీ ద్రవించి ఈ సరస్సుగా మారిందేమో పుణ్యాత్ముల పుణ్యం అంతా తెల్లగా మారి అది ద్రవీభూతాన్ని పొందినట్టుగా ఉంది.

వైడూర్య సంపద అంతా ఒక్కదగ్గిరకు చేరి అది నీరై ఇలా ఉందా అనిపిస్తుంది.

నిర్మలత్వానికి స్వచ్ఛతకి దానికి అదేసాటి...వరుణుడికి ఈ నది చక్కని అద్దం.

ఆత్మ సాక్షాత్కారం పొందిన యతిరాజుల హృదయాల్లాగా సద్గు ణాలన్నీ వరించిన సత్పురుషుల సత్కీర్తిలాగ, తెల్లని జింకపిల్లల స్నిగ్ధపు చూపుల్లాగా మంచి ముత్యాల రాసులు రాసులుగా పోస్తే ఉండే అచ్ఛమైన తెల్లదనంలాగా అతి నిర్మలంగా ఉంది ఆ సరస్సు.

మహనీయుడైనవాడి చేతుల్లో మత్స్య మకర కచ్ఛపాది రేఖ లున్నట్లు ఈ మహనీయమైన సరోవరమనే రాజుల చేతిలో చేపలూ, తాబేళ్ళూ మొసళ్ళూ ఉన్నాయి.

ఈ పవిత్ర జలాల్లో పరమశివుడు నిత్యమూ స్నానంచేస్తూ ఉంటాడు. జటాజూటంలో చంద్రుడు ఉంటాడు. అతని అమృతం అంతా ఇందులో పడుతూ ఉంటుంది. అర్ధనారీశ్వరుడు గదా! అయ

పార్శ్వంలో పార్వతి లావణ్యం అంతా ఆ జలాల అలలలో కలిసిపోతూ ఉంటుంది. దానిచుట్టూ తమాలవృక్షా లున్నాయి. ఆ చీకటి నీడలా నీటి మధ్యలో ప్రతిబింబించి పాతాళలోకానికిది మార్గమా అన్నట్లుంది. బ్రహ్మగారికి ఈ సరోవరం అంటె ఇష్టం. అందుకని దాహం తాగ దానికి నీళ్ళు ఇక్కడనుంచె తీసుకుంటూ ఉంటాడు.

సిద్ధాంగనలు తమ నారచీరలను శుభ్రం చేసుకుని ఇక్కడ ఆర వేసుకుంటూ ఉంటారు ఆ చీరలు గాలికి అల్లాడుతూ వుంటె హంస రెక్కలు రెపరెపలాడుతూ వుంటె చూడముచ్చటగా వుంది. యక్ష కన్యలకు ఇందులో స్నానం చెయ్యడం అంటే చాలా ఇష్టం. అష్ట దిక్పతుల వాహనాలన్నీ ఎప్పుడూ ఇక్కడికే వస్తూ ఉంటాయి.

ఇంద్రుడి ఐరావతానికి ఇందులో తమ్మితూండ్లు తినడం అంటె చాలా ఇష్టం. ఇందులో స్నానం చేసిన పాపాత్ములంతా పుణ్యం సంపాదించేసుకుంటున్నారనే కోపంతో కాలుడి వాహనం కారుదున్నపోతు సరోవరపు గట్లని కదిలేస్తూ వుంటుంది. అక్కడ ఉన్న అరవిందాలలో మకరందాన్ని ఆస్వాదిస్తూ వరుణుడి వాహనంగా ఉండే రాజహంస మళ్లెక్కి మరి కదలడానికే ఇష్టపడదు. ఈశ్వరుడి వాహనం నంది ఇక్కడి లేజివుళ్ళు తిని అమృతం దీనిముందు పనికిరాదు అన్నట్లున్న ఆ నీళ్ళని హాయిగా తాగి ప్రకృతికి సరస్సుకి ధన్యవాదా లర్పిస్తోంద అన్నట్టు ఱంకెవేస్తూ ఉంటుంది——ఆ సరసు రమణీయం చూసేసరికే రాకుమారుడి దాహం తగ్గిపోయింది ఈ కమలాకరాన్ని చూడ్డంచేత కళ్ళు నిజంగా ధన్యమయాయి. కిన్నర మిధునం మాయమైతే అయింది గాని, ఈ సరస్సును నాకు చూపించి——హరుడి హృదయాన్ని సరస్సు హరించింది. అత దందుకే ఇక్కడే ఉండిపోయాడు — ఆ బ్రహ్మగారు సరోవరం చూసి ఇది ఉండగా అయ్యో అమృతాన్ని నే నెందుకు సృష్టిం

చానా! అని రాత్రి బగళ్ళు ఒక్కలా మథనపడుతున్నాడు. విష్ణువు ఇంకా దీన్ని చూడలేదనుకుంటాను చూస్తే అక్కడ నుంచి ఇక్కడకు హుటాహుటి వచ్చెయ్యక పోనా! దీని తెలుపుముందు ఆ పాలసముద్రం ఎందుకు పనికివస్తుంది? అగస్త్యుడు సముద్రాన్ని త్రాగి విడిచాడు, వరాహుని కోరలలో చిక్కుకున్న భూమి ముందు ఇక్కడ చూసివుంటె అక్కడ దాగి ఉండేది కాదు. బ్రహ్మగారు తన సృష్టిలో ఉన్న తెల్లతనం అనే వస్తువునంతా ఒక పెద్ద ముద్దగాచేసి దాన్ని ద్రవం చేసి— ఈ సరస్సుగా సృష్టించాడు—చెరుకునంతటినీ పిండి రసంతీసి ఇందులో కలిపేశాడు. అందుకే ఇది ఇంత తెల్లగా తియ్యగా ఉంది, అబ్బ! దీనికిదే సాటి ఇక్కడ నివాసం ఏర్పరుచుకున్నవాళ్ళు ఎంత ధన్యులో.

## మహాశ్వేత వర్ణన :

చంద్రాపీడుడు తన ఇంద్రాయుధంతో సహా అచ్ఛోదస సరస్తీరంలో హాయిగా నీళ్ళుతాగి విశ్రాంతి తీసుకుంటున్నాడు. ఒక్కసారి గానం వినిపించింది. ఆ దిక్కుగా వచ్చి శివాలయం చూశాడు. అక్కడ తెలుపంతా చేర్చి ప్రాణంపోసిన వెండిబొమ్మ అన్నంత అతి తెల్లగా ఉన్న ఒక తన్విని చూశాడు. ఆశ్చర్య చకితుడయ్యాడు.

అబ్బ ఏమి తెలుపు? ఎంత కాంతి? ఏమి నిశ్చలత — ఎంత ఏకాగ్రత! ఏమి సౌందర్యం; తెలుపంతా ఒక్క దగ్గరకే చేర్చి బ్రహ్మ ప్రాణం పోశాడా అన్నట్లుంది ఆమె.

ఆవిడ జడలు నిడిగా వేళ్ళాడుతూ ఉన్నాయి. తూర్పుకొండపై ఉదయించిన సూర్యకిరణాలా! ఆమె జడలు అన్నట్లుంది. తనస్నానం చేసింది ఆ తడి ఆరనేలేదు శివ పాదాలను ఉలులతో చెక్కిన వాటిని

ల్లో ధరించింది. స్నానం అయాక సూర్యుని రథం నడుస్తూ వుంటె
వాని చక్రాలకింద పడిన నక్షత్రరాసుల రజం జారిపడింది—ఆ చూర్ణం
ఆమె ఫాలభాగంలో విభూతి ధరించింది. ఉసిరిగ కాయలంత పెద్దవి
మంచి ముత్యాల హారము వేసుకుంది. మేలైన చక్కని పట్టుబట్ట కట్టింది.
ఈశ్వరుణ్ని తదేకంగా ధ్యానించే ఆమె మన్మధుణ్ని జీవింపచెయ్యమని
వేడుకుంటున్న రతీదేవిలా ఉంది. చంద్రుని జటాజూటంలో శివుడు
బంధించాడు—లక్ష్మి కూడా పాలసముద్రంలోనే పుట్టింది. చంద్రుని
వదులలేక ఇక్కడ శివుని ఎదుట ఇలా వచ్చి కూచుందా! ఆవిడ
ఒతులే తెలుపు. అంతకంటె మహాతెల్లగా ఉంది ఆవిడచేతిలో దంతపు
వీణె — వేళ్ళకి కూడా తెల్లని దంతపు ఉంగరాలు పెట్టుకుని
ఒళ్ళో వీణను వుంచుకుంది. తనంత తెల్లగావున్న కూతురుని
అలా ఒళ్ళో కూచోపెట్టుకుందా! అన్నట్లుంది. ఆలయం తెలుపు,
వీణ తెలుపు—ఈ తెలుపంతా కలిసి అక్కడవున్న తెల్లదనాన్ని కోటి
రెట్లు హెచ్చుచేస్తోందా! అన్నట్టుంది. శివుణ్ని విడువలేక వెండికొండ
ప్రాణంపోసుకు స్త్రీలా అయి వచ్చి కూచుందా! అన్నట్లుంది. పాల
సముద్రంలోంచి ఐరావతం పుట్టింది—దాని సాహచర్యంచేత ఆ ప్రాం
తాల న్నిటినీ తెల్లదనంతో నిండివుంది. పరమశివుని చిరునవ్వే ఒక
తెల్లపువ్వులా పూబోడిగా మారిందా? అన్నట్లుంది. ఈశ్వర కంఠంలో
ఉన్న నల్లతనాన్ని తుడవడానికివచ్చిన వెన్నెలలా వుంది—స్వచ్ఛమైన
గౌరీదేవి మనస్సులా వుంది కుమారస్వామి వ్రతదీక్షలో తెల్లటి వస్త్రాలు
కట్టుకుని త్రిపుండ్రాలను ధరించి సేవిస్తున్నారా? అన్నట్లుంది.
రాహువు కబళిస్తాడేమో అనే భయంతో శివుణ్ని శరణువేడిన చంద్రు
డిలా పరమేశ్వరుడు వంటికి పూసుకున్న విభూతిలాగ వుంది. ఆలయ

ప్రాంగణంలో చెట్ల పూవులన్నీ తెల్లటివి రాశిపోశారా! అన్నట్టుంది. కృతయుగంలో ప్రజాపతుల ప్రవిమలకీర్తి అన్ని లోకాలూ తిరిగి తిరిగి ఇక కదలలేక అలసట తీర్చుకొందుకు ఇలా కూచుందా? అన్నట్లుంది. అడవిలో మూడు వేదాలూ కలియుగంలో మా ప్రసక్తేలేదు ప్రజలకని ఏడ్చి ఏడ్చి ఇక్కడ ఇప్పుడిలా నిశ్శబ్దంగా వుండిపోయాయా! అన్నట్లు—రాబోయే కృతయుగానికి ఈ తెల్లని ఆకృతిబీజంలాగ కనపడుతూంది. మహా తపస్సంపన్నుల తపోశక్తి రాశీరూపంతో నారీరూపిగా మారిందా? ఆకాశగంగా తరంగాలలో స్నానం చేయడానికి వచ్చిన వెల్ల యేనుగుల గుంపా అన్నట్టుగా ఉంది.

రావణాసురుడు కదలించగా తునుకలా పడిన కైలాసంలాగ ఉంది. లక్ష్మికి శ్వేతద్వీపంలో వుండి వుండి విసుగు అనిపించి అంతకంటె ఇక్కడ వెయ్యిరెటు తెల్లదనాన్ని సంపాదించుకొని సాధ్విలా మారిందా? బలరాముడు మద్యం తాగాడట ఆ మాంద్యంలో అతడి శరీరంలోంచి జారిపడిన లావణ్య శలాకలా ఉంది. పున్నమ రాత్రుల వెన్నెలలు అన్నీ కూడబలుక్కొని ఒక్కదగ్గరచేరి ఈమెలా మారిపోయాయి హంసల తెలుపంతా వచ్చి ఈవిడదగ్గరే ఉండిపోయింది. ధర్మదేవత హృదయంలో స్వచ్ఛత అంతా ఈవిడలా మారి ది. అమృతంపు నురుగే పాదరస ప్రవాహమే సృష్టిలో వుండే వెండి అంతా బ్రహ్మగారనే కంసాలి తన చాతుర్యం అనే నిప్పుతో కరిగించి స్త్రీమూర్తిగా మూసపోసి ప్రాణం ఇచ్చేశాడా అన్నట్టుంది. సత్యం అనే గుణం చాలా తెల్లనిదిగదా! దాన్ని అంతా చేర్చేసి ఒక చావగా తీర్చాడు ఆ స్రష్ట—ప్రపంచంలో వున్న తెల్లమల్లెలు మొల్లలు జాజులు విరజాజులు దేవకాంచనాలు సిందువార పుష్పాలు ఇవి అవి అనడం ఎందుకు? సమస్తం స్వచ్ఛమైన తెలుపు ఒక రూపంతో, వచ్చి ఇలా ఇక్కడ ఈమె ఉంది.

గానే మనస్సును ఆకర్షించే, మంచి ముదురునీలం రంగు పట్టుపట్టం నీటుగా పరిచి వుంది. తెల్లని పట్టుగుడ్డ తొడిగిన నిడుపాటి దిండు వుంది. పదారు వన్నె బంగారు బొమ్మలా ఆ రెండిటిమధ్య వాలుగా నవ్వుల పువ్వులను వర్షిస్తూంది. కాదంబరి శరీరచ్ఛాయకు అనుగుణ్యంగా కళ్యాణ సూచకంగా లేతపసుపు వన్నె వస్త్రం కట్టుకుంది. అప్పుడు ఎలా వుందంటే ముదురు నీలపుటాకాశంలో వెండిమబ్బు తునకకి మధ్యలో ప్రకాశించే విద్యుల్లతలా వుంది. ఈవిడ—మణులు స్థాపించిన నేలమీద ఈమె గోమేధికాలతో చిత్రించిన చిత్రపు బొమ్మలా అక్కడ తటా ప్రతిబింబిస్తోంది. ముదురునీలం పట్టుబట్టలు కట్టుకుని ఇద్దరు చెలికత్తెలు చేతుల్తో తెల్లని వింజామరలు వీస్తున్నారు కాదంబరి అనే సౌందర్య లక్ష్మికి రెండు ఏనుగులు తొండాలనే కాడలకి, దంతాలలాంటి వింజామరలు తీసుకుని భక్తితో సేవిస్తున్నారా! అన్నట్లుంది. ఆకు పచ్చని ఎర్రని మేలైన పట్టుపుట్టాలు కట్టిన పడతులు అక్కడక్కడ గుంపులు గుంపులుగా కూర్చున్నారు. ఆ దృశ్యం ఎలా వుందంటె లక్ష్మికి రెండువైపులా ఆకులతో ఎర్రగులాబులు కలిపి కట్టిన పూల కుండ్లా అన్నట్లున్నారు.

(మూలంలో చిన్న వర్ణన ఆధారంగా తీసుకున్నాను.)
ముల్లోకాలలో ఉండే ప్రజానీకం ఆమెను ఒకసారి అలాచూస్తే మరి ఆ చూపులు ఒకంతట మళ్ళనే మళ్ళలేవు.

సృష్టిలో ఉండే సమస్త శుభలక్షణాలూ ఈ సుందరాంగిని వరించేశాయి. పదారువన్నె బంగారు నగలు, ఆ బంగారం తల్లికి ఎంతో సింగారాన్నిచ్చాయి. కాదుకాదు ఆవిడ ధరించడం చేతే ఆ నగలకి అందం వచ్చింది. ఆమె ప్రతి అణువణువున నవయవ్వనం తొణికిస

లాడుతోంది. విష్ణువు జగన్మోహినిగా అవతరించాడు — ఈవిడని చూసి, నా అవతారం వ్యర్థం అని ఇప్పుడతడు తొంభయితొమ్మిదిపాళ్ళు సిగ్గుపడుతూ వుండాలి, ఆమె పాదాల అరుణిమ ఆ ప్రదేశం అంతా మెట్ట ఎర్రతామరలు పఱచాయా అన్నట్టుంది. మణి మంజీరాలు పాదాలకు ధరించింది. కాళ్ళకు లాక్షారాగం ఉంది. ఆ పాదాలలో మణుల ప్రతిబింబం ఏదో? లాక్షారాగం ఏదో? ఎవరూ కనిపెట్టలేక పోతున్నారు. "మహిత భావాభావ మధ్యంబు మధ్యంబు" అసలు నడుము ఉందో లేదో అన్నట్టుంది. బ్రహ్మ సృష్టిస్తూన్నప్పుడు పరాకుగా నాభిని దిద్దబోయాడు గట్టిగా వేలూని ఉంటాడు. ఆమె నాభి అందుకే చాల లోతై ఉండాలి. కాళిదాసుకూడా కుమారసంభవంలో పార్వతిని వర్ణించినప్పుడు "చిరేణ నాభిం ప్రథమోద బిద్ధవ" అంటాడు—నాభిని లోతుగ వర్ణించడం కవుల సంప్రదాయంలా కనిపిస్తుంది. వక్షోజాల భారం ఆ వనితకు చాలా వనటని దిస్తోంది. అనురాగ జలధిలో రమణీయాలైన అలలా! అన్నట్టు ఆమె పెదాలు కదలాడుతున్నాయి. మాణిక్యాల పాత్రలలో మదిర నింపారా! అన్నట్టు ఆవిడ చెక్కిళ్ళు ఎర్రరంగుతో తళతళలాడుతున్నాయి. రతీదేవి వీణకుండే రత్నకోణం కంటె ఎంతో అందంగా ఆ వి డ ముక్కు ఉంది. అనురాగాల వెల్లువలనే పాల సముద్రపు అలల కంటె అందంగా ఉన్నాయి ఆమె కళ్ళు—మానవులకు కళ్ళున్నందుకు సఫలం ఏమిటంటె ఆవిడకళ్లని చూడ్డమే అనిమిషులైనా ఆ కళ్ళని చూస్తూవుంటె తమ అనిమిషత్వం ఇంత కాలానికి సార్థకం కలిగిందని సంతోషిస్తూ వుంటారు. చెవులకు మరకత మాణిక్యాలతో కూర్చిన కుండలాలు వున్నాయి. అవి చిరుగాలికి అల్లాడు తున్నాయి. ఆ దృశ్యం నీ చెవుల సౌందర్యానికి మేం ఎంతమాత్రం తగం గాక తగం అని పొగులాడుతున్నాయి. అష్టమి చంద్రుడి కంటె అందంగా ఉన్న

మహర్షులు చేసే అగ్నిహోత్ర విధుల ధూమాలు పైకిలేచి ఆకాశాన్ని అంటుతున్నాయి. వీళ్ళు ఎందుకు ఈ హోమాలు చేస్తున్నారంటే మన శరీరం అనే కాష్టం మృత్యువు అనే అగ్నిలో ఏ క్షణంలో ఆహుతి అయిపోతుందో—ఓ అజ్ఞానీ జ్ఞానాగ్నిచేత పాపకర్మలని ఇప్పటికైనా దగ్ధం చేసుకో పునర్జన్మ లేని స్థానాన్ని చేరుకో అని జ్ఞాపకం చేస్తూ ఉంటాయి. నెమళ్ళు, జింకలు, చిలుకలు మొదలైన రకరకాల పక్షులూ జంతువులూ ఉన్నాయి అక్కడ—కారుమేఘాలని చూస్తే ఏం నృత్యం చేస్తాం. ఆ మేఘాలకి మే పురివిప్పి ఛత్రింపడతాము. ఓ మనిషీ నువ్వు కష్టాలనే మేఘాల్ని చూసి జడిసిపోతున్నావ్ నీకంటె మేం చాలా ఘనులం సుమా! అంటున్నాయి. లేళ్ళు చాలానే ఉన్నాయిట అక్కడ అవి అంటున్నాయి. మేం ఎంత హాయిగా లేపచ్చికని తింటూ అరిషడ్వర్గానికి దూరంగా ఉన్నాం. ధనగర్వం ఈర్ష్యా అసూయాది దుర్గంధాలు మమ్మల్ని కోసినా ఒక్క క్షణంలోకూడా మానస్పృశా నువ్వు చూడలేవు. గనుక నీ జన్మం కంటె మా జన్మమే చాలా చరితార్థమైంది సుమా అని చాటుతున్నాయి. చిలుకలు గోరువంకలూ మాకు ఏంతో ఏకాగ్రత ఉంది. ఋషులు వేదఘోషలు అలా విని సుస్వరంగా అప్పచెప్పేస్తాం. ఈ మహనీయుల తపోశక్తి మాకు ఎంతో అండదండగా ఉంటోంది మేం ఎలా కృతజ్ఞతను తెలుపుకోవాలో వారికి తెరికి తెలియక ఎంతో బాధపడుతున్నాం. మ రెక్కలనే మామిడి ఆకుల తోరణాలు కట్టి సంతోషపూర్వకమైన కలరవ ధ్వనులనే మంగళ గీతికలతో మహర్షులను సేవిస్తున్నాం అని చెపుతున్నట్లు ఉన్నాయి.

కాషాయ వస్త్రాలు ధరించిన తపోధనులు ఇచటి ప్రాణికోట్లకు లకలో అయినా కష్టాన్ని తలపెట్టరు. వీళ్ల హృదయాలన్నీ ప్రేమా

మృత భాండాలే. ఇక్కడ అక్కడ ఉన్న సరస్సులన్నీ, ఆ విషయం ముమ్మాటికీ సత్యమే అని సాక్ష్యమిస్తున్నాయా అన్నట్లున్నాయి. మచ్చికగా ఉన్న పిల్లలా ఉంటాయి ఇక్కడి జంతువులన్నీ—ఒక్కదగ్గర భక్తి పారవశ్యంతో ఏకాగ్రత అనే తాడుతో దేవుణ్ని కట్టేశారా? అని పిస్తుంది. పితృదేవతలపై భక్తితో కొంతమంది మనస్తృప్తి కోసం పితృకార్యాలూ భూతబలులూ చేస్తూ ఉంటారు. ఆ తపోవనం అంతా సత్యధర్మాలకు నిలయంగా ఉండి అపర సత్యలోకమా, అనిపిస్తుంది. ఈ ఆశ్రమాన్ని చూడాలనే ఆకాంక్షతో అప్పుడప్పుడు సప్తర్షులు ఇక్కడకు వస్తున్నారా అన్నట్లు సరస్సులో ఆ సప్తర్షి మండలం ప్రతిబింబిస్తూంది. అచటి చిలుకలూ గోరువంకలూ శిష్యుల పఠన కార్యక్రమాలు అగ. గానే అవి వేదఘోషలూ దేవతాస్తవాలు సహస్రనామాలూ పఠిస్త నిత్యం ఏకాహాలు చేస్తున్నాయా అనిపిస్తుంది.

అక్కడ వివిధ ప్రదేశాల్లో రామాయణ కథలు భారత కథల భాగవత కథలు శాస్త్ర చర్చలు ఉపనిషత్పఠనలు యోగాభ్యాస విషయాలు ప్రాణాయామ ప్రత్యాహారాదులు ఓంకార మంత్ర ప్రభావాలు ఆత్మసాక్షాత్కారానికి కావలసిన సమస్త విషయాలూ అన్ని నిత్యం సాగుతూ ఉంటాయి. అందరూ ఆచరణ వ్యక్తులే ఉపదేశ శూరులుకారు

అలాంటి ఆశ్రమ మధ్యభాగంలో రక్తాశోక వృక్షం ఉంది, అది ఎక్కడా ఎంత వెదికినా ఒక్క ఆకైనా కనపడకుండా అంతా ఎఱ్ఱగా కుంకుమ కల్పినట్టుగా ఉంది. మునికన్యలు నారబట్టలను ఉదికి చెట్లకు ఆరకట్టారు. అవి గాలికి రెపరెప లాడుతున్నాయి. విషయ వాసనలనే అగ్గిలో అటమటించే ప్రాణాలకి ఇక్కడ మీకు శాశ్వతానందం దొరుకు

రండి రండి రండి అని ఆహ్వానిస్తున్నట్టున్నాయి అవి. కొన్ని చెట్ల కొమ్మలకి జింక చర్మాలుకూడా ఎండబెట్టి ఉంచారు. అవి ఏం చెప్పు తున్నాయంటే మీ ప్రాణాలు విడిస్తే మీ శరీరం నిప్పుల్లోకే గాని మరెం దుకూ పనికిరాదు, మేం సజీవంగా ఉన్నా నిర్జీవంగా ఉన్నా మానవుల కు మేలు చేస్తాం. సజీవంగా ఉంటె మా చూపులతో నడకలతో, శ్రమజీవు లకు విశ్రాంతి నిస్తాం. నిర్జీవంగా ఉంటే తపస్సు చేసుకోందుకు చక్కగా మేం ఉపయోగపడుతున్నాం. మీకంటే మేం చాలా కృతజ్ఞతా శీలంగల వాళ్ళమని చెపుతున్నాయి. ఆ ప్రదేశం అంతా ఎంతో బాగా గోమ యంతో అలికారు. అందమైన ముగ్గులు పెట్టారు. అక్కడ చిన్న దర్భాసనంమీద జాబాలి కూచున్నాడు. ఆయనకి చుట్టూ ఎంతోమంది తపస్వులు కూచున్నారు.

'మహర్షి మండలే భాసితరాజహంస గతి భాతి' మహర్షి సము దాయ మధ్యంలో బ్రహ్మలా ఆ ఋషి మధ్యంలో బ్రహ్మజ్ఞాన సంప దతో ప్రకాశిస్తూ అపర భాస్కరుడులా జాబాలి దేదీప్యమానంగా వెలిగి పోతున్నాడు. అతడు అతి వృద్ధుడు, దేహం అంతా తపోగ్నికి శుష్కించిపోయింది. కనుబొమలు ముందుకు వాలాయి. అతని నుదురు మీద మూడు ముడతలు పడివుంది. అది అకార ఉకార మకారాలు లాగ, ఓంకారోచ్చారణకి అతడే ప్రతినిధి అన్న విషయం అవి చాటుతున్నాయి. అతని తల జప తపాలచేత నిరంతర అగ్నిధూమంచేత అతిపాటల వర్ణంగా తయారయి ఇప్పుడు పూర్తిగా ముగ్గుబుట్టా అన్నట్టుంది. శివుడు అతని భక్తికి మెచ్చి నందీశ్వరుడి తెల్లని రోమరాజినంతా కానుకగా ఆయన కిచ్చేశాడేమో అన్నట్టుగా ఉంది. దేహం అంతా వణుకుతూంది. అతని జడలు చాలా పెద్దగా పెరిగాయి. అవి చుట్టలు చుట్టలుగా ఉండి

ఏం చెపుతున్నాయంటే—అధర్మాన్ని జయించిన పతాకలం సుమా అంటు న్నాయి. పుణ్య అనే చెట్టుకు పూసిన పూగుత్తులం స్వర్గంలోకి వెళ్ళ డానికి తాడుగా ఉపకరిస్తాం అని చెపుతున్నాయన్నమాట.

అతడి నుదుటిమీద మూడు విభూతిరేఖ లున్నాయి. అది హిమ పర్వతం నుండి ప్రవహిస్తున్న పవిత్రగంగ ఇక్కడ మూడు పాయ లుగా ఉండాలనిపిస్తూంది. ఆయనచేతిలో స్ఫటికపూసల జపమాల ఉంది. దాంతో ఆయన నిత్యం జపంచేస్తూ ఉంటాడు. దూరం నుంచి ఆయన చేతివేలు కణువులేనో స్ఫటికపు పూసలేనో తెలుసుకోలేమన్న మాట. ఆయనకి రెండువేపులా, దండ కమండలం ఉన్నాయి. దండం అంటె అది బ్రహ్మదండం. మోదుగ కఱ్ఱని దండంగా ఉపయోగిస్తారు విష జంతువులూ రావు. విషపు ఆలోచనలూ రావు కమండలం జలం ప్రోక్షిస్తే అమృత ప్రోక్షణంకంటె దీనికి మహత్తుంది.

ఈయన ధీరత్వం ఓర్పు నిర్మలత్వం తేజస్సూ గాంభీర గుణాలు మేరుపర్వతాన్నీ భూమినీ ఆకాశాన్నీ సూర్యుణ్ణీ సముద్ర పోలి ఉన్నాడన్నమాట.

కోటి సూర్యుల కాంతితో అతని ముఖమండల వెలిగిపోతు ఉంటుంది. వేనవేల దీపాల కాంతులు కళ్ళల్లో కదలాడుతూ ఉంటాం ఛాయ పసుపుముద్దను బొమ్మగాచేసి, బ్రహ్మ ప్రాణంపోశాడేమో ( జాబాలికి అన్నట్టూ, పూలలో పుష్పాడినంతా చేకూర్చినట్టూ చామంతుల బంతుల పసుపుఛాయనంతా ఈఋషికిచ్చేశాడు ఆదేవుడు. కాషాయరంగు త్యాగానికి చిహ్నం కదా! జీవిత భవిష్యత్తంతా ఇతడు కాషాయవస్త్రాల లను ధరించి సన్యాసి అవుతాడు అని నిరూపించడానికే ఇ్బ్జి ఈవిధంగా

సృష్టించినవాడు బ్రహ్మ. అతడు తన తపోశక్తిచేత వైశంపాయనుడి పూర్వజన్మ వృత్తాంతం అంతా చెప్పగలిగాడు. ఇతను చెప్పిందే వైశంపాయనుడు శూద్రకుడికి చెప్పాడు. కనుక ఈ పాత్ర ఈ కావ్యంలో చాలా ముఖ్యమైనది.

రాగులను ఎంత చక్కగా సృష్టించాడో విరాగులనుకూడా అంత బాగా సృష్టించాడు. మన బాణుడు ఇతడు ఋషి తుల్యుడు. అవునుమరి "నానృషిః కురుతే కావ్యమ్" అన్నారుగదా పెద్దలు.

## : ఉ జ్జ యి ని న గ ర వ ర్ణ న :

ఉజ్జయిని అన్ని పట్నాలకంటె అతి అందంగా ఉంటుంది. ఇక్కడ జనం అంతా సత్యబద్ధులై ఉంటారు. పరమేశ్వరుడు ఈ నగర సౌందర్యాన్ని చూసి తన పరివారం అంతటితోటీ ఇక్కడికే వచ్చేశాడు. ఇక్కడినుంచి మరి కదలక, కాళేశ్వరుడనే పేరుతో ఇక్కడే కాపురం స్థిరం చేసుకున్నాడు. ఈ పుర రమణీయం చెప్పడానికి సాధ్యం కాదు—చూసి తీరవలసిందే. దీని అయిశ్వర్యం ముందు కుబేరుడి అయిశ్వర్యం ఎందుకూ పనికిరాదు. అన్ని కళలకు ఇది ఆలవాలం.

ఈ పట్టణ వీధుల్లో నవరత్నాలు రాసులు రాసులుగా పోసుకుని—వర్తకులు పద్ధతిలో ప్రజలకు అమ్ముతూ ఉంటారు—ముత్యాల రాసులు మహాముద్దు గొలుపుతూ ఉంటాయి. సముద్రుడే ఇక్కడ స్థావరం ఏర్పాటుచేసుకున్నాడా! అన్నట్టుంది. అక్కడి కోట గోడలు ఆకాశాన్ని అంటుతున్నాయి. ఇది స్వభావోక్తేగాని అతిశయోక్తికాదు—అక్కడి మేడలు స్వర్గంలో సౌధాలకంటె వెయ్యిరెట్లు అందంగా

ఉన్నాయి. బంగారం పూతలతో, కళ్లవిందుగా ఉండే స్తంభాలు రత్నాలు పొదిగిన గోడలు అక్కడక్కడ పచ్చలు పరుస్తూ మధ్యమధ్యలో గోమేధి కాలూ చొప్పిస్తూ ఉన్న అరుగులూ వెండిమలామా చేశారా అనే భూతల ప్రదేశాలూ మంచి చక్కనైన చౌరస్తాలూ ఉన్నాయి. ప్రతి రెండు వీధులకు ఒక అతి రమణీయంగా ఉద్యానవనాలున్నాయి. వీటిముందు నందనవనం ఎందుకూ పనికిరాదు. దీని అందచందాలు చూసి అది మూర్తి ముడుచుతుంది. అందుకే అక్కడి గంధర్వులూ గంధర్వ కాంతలూ ఇక్కడికే వచ్చేశారు. అందాలు చిందుతూ కలకలలారే కమలాలతో నిండిన కొలకులూ, కోనేళ్ళూ చాలా వున్నాయి. ఇంద్రుడికి సహస్రాక్షుడనే పేరుంది. తనలోకంలో సౌందర్యం దీన్ని చూశాక ఇష్టం లేక వెయ్యి సరస్సులనే కళ్ళతో తూస్తూ ఉండవచ్చు అని ఇక్కడికి వచ్చేశాడు. ఇక్కడ ప్రజలు ఎంతో అదృష్టం చేసుకున్నారు—దేవలోకంలో దేవతలంతా మానవాకృతులతో వచ్చి అక్కడకంటె ఇక్కడే బాగుందనుకుని ఉండిపోయారు,

ఈ పట్నంలో ప్రజలకి అరిష్టాలేవీ రాకుండా కాపాడడానికో అన్నట్లు ఎప్పుడూ వేదఘోషలు వినిపిస్తూ ఉంటాయి. గానంతో రాళ్లను కరిగిస్తారు సంగీత శాస్త్రవేత్తలు రామాయణ భారతకథలు మహా యిష్టంగా వింటూవుంటారు అక్కడి మానవులు. అచటి ప్రజలంతా ధర్మాత్ములే ఆ పట్నంలో పాపం అనే ప్రసక్తే లేదు. అందరూ శాంత మూర్తులే, సద్గుణ వంతులే, సత్యసంధులే, కరుణా సముద్రులే, పరోపకారులే, భగవద్భక్తులే, కళా కోవిదులె_శాస్త్ర పారంగతులే. అలాంటిదీ ఉజ్జయినీ పట్నం.

## అలంకారము

కా. 8వ పే. 11వ పంక్తి.

### పరిసంఖ్యా అలంకారము

ఒక వస్తువునకు ఒకచో నియంత్రణము (నియమనము) చేసి మరి యొకచోట నిషేధము చెప్పినచో పరిసంఖ్యా అలంకారము.

మహీం చిత్రకర్మసు వర్ణసఙ్కరా, కావ్యేషు దృఢబంధాః. శాస్త్రేషు చింతా, స్వప్నేషు విప్రలభాః, ఛత్రేషు కనకదండాః, ధ్వజేషు ప్రకమ్పాః, గీతేషు రాగ విలసితాని, కరిషు మద వికారాః, చాపేషు గుణచ్ఛేదాః, గవాక్షేషు జాలమార్గాః, శశికృపాణకవచేషు కళఙ్కా, శార్యక్షేషు శూన్యగృహాః.

యస్యచ పరలోకాద్భయమ్, అంతఃపురి కాలకేషు భంగః. 'నూపురేషు ముఖరతా, వివాహేషు కరగ్రహణమ్, అనవరత మఖాగ్ని ధూమేనాశ్రుపాతః, తురగేషు కశాభిఘాతః, మకరధ్వజే చాపధ్వని రభూత్.

చిత్రలేఖనమందే రంగులు కలుపుట, జాతులలో వర్ణసంకరములు లేవు, కావ్యాలలోనే కట్టుదిట్టము నేరంచేసిన మనుషులును పట్టుటలేదు. శాస్త్ర చర్చలయందె చింత—విచారములు లేవు, కలలలోనే ఎడబాటు, భార్యలను విడిచిపెట్టడం అనే జబ్బులు ఆనాడు లేవు. గొడుగులకే బంగారు దండములు—ప్రజలకు దండన లేదు. ధ్వజములు మాత్రమే గాలికి కదలాడుట మనుషుల మనసులకు డోలాయమానములు లేవు. ఏనుగులకు మాత్రమే మదవికారము విల్లులలోనే వింటినారిని సారించుట

మానవులు గుణములను విడువరు కిటికీలకే జాలమార్గము, మనుషులలో మాయాజాలములు లేవు. చంద్రుడికీ కత్తులకే నల్లదనాలు మనుష్యులకు కళంకాలు లేవు చదరంగపు ఆటలలోనే శూన్యగృహాలు— వన్నులు కట్టక అధర్మంగా ఇళ్ళు ఖాళీలనేవి లేవు.

చనిపోతే, యమలోకం అంటేనే భయం. ఇహలోకం లేదు. ఆ దెలలోనే ధ్వని—కలహాలు లేవు, వివాహాలయందే చేతులువుచ్చు కోవడ.. పన్నుల బాధలులేవు. యజ్ఞాలు మూలంగా ఆ పొగనుంచి కన్నీరు తప్ప, కష్టాలకి కన్నీళ్ళులేవు. ఆ రాజ్యంలో గుజ్జాలనే కొరడా దెబ్బలు. మనుష్యులకు అట్టిశిక్ష లేదు. మన్మథుని చాపధ్వనేగాని శత్రు రాజులతో యుద్ధం చేయడంకోసం చాపాలు తియ్యక్కరలేదు.

అలంకారాలు కావ్యానికి అందం ఇస్తాయి. ఎంతవరకంటె ర నికి అంతరాయం కలగకుండా ఉన్నంతవరకే. రసభంగం కథాగమ భంగం అయితే ఆ అలంకారాల ప్రయోజనం అంతగా ఉండదన్నమాట

మనకవి అలంకారాలు పట్టుకు చె మాత్రం ఒకపట్టాన విడిచే స్వభావం కాదు. తగు మోతాదులో చెప్పడు—అలా ఒక ప్రవాహ లాగా చెప్పేసుకు వెళ్ళిపోతూ వుంటాడు.

కా. 4౹—౨ పే. 5 పంక్తి.

## ఇంకొక పరిసంఖ్య

మలినతా, హవిర్ధూరేషు, న చరితేషు, ముఖరాగ, శ్ళకేషు, న కోపేషు, తీక్ణతా, కుశాగ్రేషు, నస్వభావేషు, చంచలతా, కదళీదళేషు, న మనస్సు, చక్షూరాగః కోకిలేషు, న సరకళత్రేషు, మేఖలా, బంధో

ప్రతేషు, నేర్ష్యాకలహేషు, పక్షపాతః, కృతవాక్యేషు, న, విద్యా. వివాదేషు, భ్రాంతి, రవల ప్రదక్షిణేషు, నశాస్త్రేషు, వస్త, సంకీర్త నం. దివ్యకధాసు, న, ధన, తృష్ణాసు, గణనా, రుదాక్ష, వలయేషు, న, శరీరేషు, మునిబాలనాశః, క్రతుదీక్షయా, న, రామానురాగో, రామయణే, నలయౌవ్వనేన, ముఖభంగ వికారో, జరయా, సధనాభి మానేన.

యత్రచ. మహా, భారతే, శకునివధః, పురాణే, వాయు ప్రలపితం, వయః, పరిణామే, ద్విజపతనం, అపవన చందనేషు, జాడ్యమ్ అగ్నినాం, ధూతిమలినత్వం, ఏణకానాం, గీతవ్యసనం, శిఖండీనాం, నృత్యపక్షపాతః, భుజంగమానాం, భోగః, కపీనాం, శ్రీఫలాభిలాషః మూలానామ్, అధోగతిః.

మాలిన్యం హవిర్ధూమలలోనే మానవచరిత్రలలో లేదు ముఖ మున ఎఱుపురంగు చిలుకలకే గాని కోప తో ఎఱుపెక్కే ముఖాలుగల మానవులు లేరు. వాడి దర్భల చివరభాగముందేగాని మానవ స్వభావా లలో లేదు. చాంచల్యం, అరిటిచెట్లకే, మనస్సులకు లేదు. కోకిల పక్షుల కండ్లలోనే రాగంగాన పరస్త్రీలను చూడ్డంలో లేదు అడూ ఇటూ కదిలే లక్షణం కోడికి నెమలికే గాని పక్షపాతబుదు. విద్యా వివాదాలలో హెచ్చుతగ్గులు గాని మానవులకు భేదములు లేవు. అగ్నికి ప్రదక్షిణం చేసినపుడు మాత్రమే తిరుగుట, శాస్త్రాలకు తిరుగులేదు. దివ్యకథలలో మాత్రమే మానవులకు తృష్ణ, ధనతృష్ణ లేదు—రుద్రాక్షమాలలో పూస లను మాత్రమే గణించుట, శరీరములను గణించుట లేదు, యజ్ఞముల యందే బాలురదీక్ష—మృత్యుభయము వారికిలేదు. యవ్వనమున స్త్రీల యందు రాగములేదు. రామాయణమునందు మాత్రమే అనురాగము,

వృద్ధత్వముచే ముఖమునందు వికారముగాని, ధనాభిమానంచే ముఖ వికారం లేదు.

మహాభారతంలో మాత్రమే శకుని చంపుట శకుని—అంటె నల్ల పిచ్చుకలను చంపుటలేదు. పురాణముయందు మాత్రమే మనోగాలిపీచుట వాతరోగాదులు లేవు—వయసు హెచ్చుదంచేత మాత్రమే ద్విజులకు పాటుగాని వారి కార్యకలాపాల్లో గాదు. చందనవనాలకే జబ్బుగాని మానవులకు లేదు. నిప్పునకు మాత్రమే బూడిద కప్పి వుండుట .మలినత్వం మానవులకు లేదు. సంగీతం వినాలన్న కోరిక లేళ్ళకుమాత్రమే మానవులకు ఆ వ్యసనం లేదు. నెమళ్ళకు మాత్రమే నృత్యంమీద అభిలాష. ఇతరులకు వారాంగనా నృత్యాల వ్యసనం లేదు. పాములకు మాత్రమే పడగలు. మానవులు నీతిమంతులే. కోతులకు మాత్రమే మారేడుఫలములమీద ప్రీతి—మానవులకు ఐశ్వర్యమునందు ప్రీతిలేదు చెట్టువేళ్ళకు మాత్రమే నేలక్రిందకుపోవుట మానవులకు అధోగతిలేదు.

## లేశాలంకారము

దోషమునకు గుణమును, గుణమునకు దోషము కల్పింపబడెనేని లేశాలంకారమగును.

ద్యూతం వినోద ఇది.

జూదం ఆడడం సప్త వ్యసనాలలో ఒకటి. 'వెలది పానంబు జూదంబు' అని పేర్కొన్నారు

వి..దం అంటె మానసిక ఆనందం కోసం చేసే మహోత్కృష్టమైన పని.

ఇక్కడ జూదం ఆడడం అనే దోషానికి ఆత్మానందం అనే గుణాన్ని కల్పించాడు గనుక ఇది లేశాలంకారము. కొన్ని ఉదాహరణాలు చూదాం.

పరదారాభిగమనం వైదగ్ధ్యమితి — స్త్రీలోలత — పరుల భార్యను మోహించుట నైపుణ్యమని భావించుట.

మృగయాశ్రమ ఇది—వేట శరీర పరిశ్రమ.

పానం విలాస ఇది—తాగుట వేడుక.

ప్రసుప్తతా శౌర్యమితి—అలక్ష్యం శౌర్యమని.

స్వదార పరిత్యాగో అవ్యసనత ఇది—తమ భార్యలను పరిత్యజించుట అవ్యసనము.

గురువచనా వధీరిణమ్ అపర ప్రణేయత్వ మితి—

గురు వచనము ధిక్కరించుట వక్కని ఔషధప్రాయమని ముక్త ప: గ్రస్త.

'తన్వీ రూపన్యేన యౌవనం, యౌవనస్యేన మకర కేతనమ్, మకరకేతనస్యేన వసంత సమయస్యేన దక్షిరావిల మనురూపమ్.

సౌందర్యానికి యౌవనంలాగా యౌవనానికి మన్మథుడిలా మన్మథుడికి వసంతుడిలాగా వసంతుడికి, దక్షిణపు గాలిలాగా—

ముక్తపద గ్రస్తం—విడిచిన మాటలో, పంక్తి ప్రారంభించిన, ముక్త–పదగ్రస్తం. యుక్త వసంత ఇవ మధుమాసేన,

మధుమాస ఇవ, పల్లవేన, పల్లవ మివ కుసుమేన కుసుమమివ
మధుహాణీ—మధుకర ఇవ మదేన

ఉత్ప్రేక్ష :—

శబర సైన్యం ఎలా ఉందంటె నల్లటి అరణ్యజనం సమూహంగా
వస్తూ వున్నారు. అలాంటి నల్లటి మనుష్యులు గుంపుగా ఉంటె భయం
కరమైన అమావాస్య రాత్రిళ్ళన్నీ కట్టకట్టుకుని కదలివస్తున్నాయా?
అన్నట్టుగా ఉందిట— ఆవిడ కదల్తూ ఉంటె నల్లటి స్తంభాలు—బాగా
కదలాడుతున్నాయా అన్నట్టుంది. సూర్య కిరణాలనే కొరడా దెబ్బ
లతో పరుగులు తీస్తున్న గుఱ్ఱాలని గట్టిగా కొడితే ఆ తాకిడికి తట్టు
కోలేక పరుగెట్టి వస్తున్న చీకటి మూకలా అన్నట్టుగా వుంది.

ఉపమానము యొక్క ధర్మాన్ని ఉపమేయమున తాదాత్మ్యము
చెప్పుట, ఊహించుట ఉత్ప్రేక్ష.

నల్లటి ఆకారంతో కదలివస్తూ ఉన్న శబరుల గుంపు అమావాస్య
చీకట్లు కట్టకట్టుకు వస్తున్నాయా? అన్నట్టుంది.

చీకట్లకు శబరులకు నలుపురంగు కదలుట వీటిలో తాదాత్మ్య
మును చెప్పుటచే నిది ఉత్ప్రేక్ష.

## రూపక అలంకారము

విషయమునకు విషయియొక్క అభేదము తాద్రూప్యము.

తామరకొలను సూర్యుడు అస్తమించంగానే విరహిణిగా తపో
దీక్ష తీసుకుందా? అన్నట్లు తామర మొగ్గలనే కమండలాన్ని తీసుకుని

హంసలనే తెల్లని చీర కట్టుకుని తామరతూళ్ళు అనే జందెపు పోగులను వేసుకుని బ్రహ్మచర్యవ్రత దీక్షను హానిందా అన్నట్లుంది.

## చంద్రాపీడుడు - ధీరోదాత్తుడు

ఈ కావ్యంలో కథానాయకుడు చంద్రాపీడుడు.

"ఆలంబన మతం తత్రనాయకో గుణవాన్ పుమాన్"

కావ్యంలో రసానికి సంబంధించినవారు ఆధారములు అగుటవలన నాయకా నాయికలు ఆలంబన విభావమగుదురు. ఆలంబనము రెండు విధములు. ఉద్దీపనము విభావము. అందు గుణవంతుడగు పురుషుడు నాయకుడు.

నాయకుని లక్షణాలు ___ రసార్ణవ సుధాకరం. సర్వజ్ఞసింగ భూపాలుడు.

తెలుగుసేత—బులుసు వెంకట రమణయ్యగారు. 61-62-63.

"ఆలంబన మతం తత్ర నాయకో గుణవాన్ పుమాన్"

తద్గుణాస్తు మహాభాగ్యం ఔదార్యం స్థైర్య దక్షితే ఔదార్యం ధార్మికత్వంచ కులీనంచ వాగ్మితా, కృతజ్ఞత్వం నయజ్ఞత్వం శుచితామాన శీలతా, తేజస్వితా కళావత్వం ప్రజారంజకతాదయః ఏతే సాధరణా। ప్రోక్తానాయకస్య గుణా బుధైః మహాబాగ్యము, ఔదార్యము స్థైర్యము దక్షత ఔజ్వల్యము, ధార్మికత్వము కులీనత్వము వాగ్మి కృతజ్ఞీత్వము నయజ్ఞత్వము శుచిత్వము మానిత్యము తేజస్విత కళావత్వం ప్రజారంజకత్వము.

ఇవి నాయకుని సామాన్య గుణములు అని విద్వాంసులు చెప్పుదురు.

మ హా భా గ్య ము

"సర్వాతి శాయి సామ్రాజ్యం మహాభాగ్య ముదాహృతమ్"

శతృశేషం అనేది లేకుండా ఉండే రాజ్యాధిపత్యాన్ని మహాభాగ్యం అంటారు.

చంద్రాపీడుడికి అట్టి మహాభాగ్యం ఉంది.

ఔ దా ర్యం

"యద్విశ్రాణన శాలిత్వం తదౌదార్య బుధా విదుః"

లోభత్వం అనేది ఏ కణంలోనూ లేకుండా ఎంతైనా ఇతరులకు ఇయ్య కలిగినట్లయితే దానిని ఔదార్యం అంటారు. నాయకునకు గాని నాయికకుగాని ఈ లక్షణాలు ఉండవచ్చును అంటారు గనున కాదంబరి చంద్రాపీడునకు సముద్ర మధనంనుండి వచ్చిన ముత్యాలహారాన్ని ఇవ్వడం అనేది ఔదార్యానికి తగి ఉంది.

స్థై ర్యం

"వ్యాపార ఫల పర్యంతం స్థైర్యమాహుర్మనీషణః"

ఫల ప్రాప్తి వరకు ప్రయత్నించుట స్థైర్యము. కాదంబరిమీద ఉన్న అనురాగం నిమిత్తమే తిరిగి చంద్రాపీడుడు వైశంపాయనుణ్ణి తెచ్చే మిషతో వస్తాడు. అందుచే స్థైర్యగుణ మితనిలో ఉంది.

ద క్ష తా

"దుష్కరేఽపి ప్రికారిత్వం దక్షతా పరిచక్షతే"

సాధించడానికి సాధ్యంకాని వనిని సాధింపపూనుట దక్షత। చంద్రాపీడుడు కిన్నర మిథునాన్ని వెంటాడే ప్రయత్నం దక్షత,

ఔ జ్జ్వ ల్యం

"ఔజ్జ్వల్యం నయనానంద కారిత్వం కథ్యతే బుధైః"

మానవులకు మరీమరీ చూడాలనే కోరిక కలిగించే మంచి ఎక్కా అయిన పక్కా చక్కదనం ఎక్కడుందో అది ఔజ్జ్వల్యం అంటారు. మన నాయకుడు చంద్రాపీడుడి సౌందర్యం మన్మథుని మించి ఉంది అంటాడు కవి కాదంబరీ కనుదమ్ములలో కదలక నిలువగలిగిన నిరుపమాన సౌందర్యవంతుడు. అందుచేత ఔజ్జ్వల్యం అనే గుణం నాయకుడికి ఉంది.

అ థ ధా ర్మి క త్వం

"ధర్మ ప్రవణ చిత్తత్వం ధార్మికత్వ మితీర్యతే"

ధర్మమునం దాసక్తమగు చిత్తము గలవాడు ధార్మికుడు. బాణుని చేతిలో చంద్రాపీడుడు శాపంచేత కొంతకాలం నిర్జీవుడై ఉన్నాడు. అందుకు అతని తండ్రి తారాపీడుడిలో కొన్ని ఈలక్షణాలు మనం చూడ్డం సముచితమనిపిస్తుంది.

కులవర్ధన విలాసవతి విశేషవార్త (అంతర్వర్తిని) విని రాజు పరమానందంతో తన ఒంటిమీద ఉన్న అన్ని ఆభరణాలు ఒలిచి ఇచ్చేశాడు——

అందుచేత అతనిలో ఈ ధార్మికగుణం ఎంతో ఉందనాలి.

## అథ కులీనత్వం

"కులే మహతి సంభూతిః కులీనత్వ ముదాహృతమ్."

గొప్ప వంశమున పుట్టుట కులీనత్వము.

చంద్రాపీడుని వంశము చాలా గొప్పది.

## అథ వాగ్మితా

"వాగ్మితాతు బుధైరుక్తా సమయోచిత భాషితా"

సమయోచిత సంభాషణా చాతుర్యము వాగ్మిత.

చంద్రాపీడునకు సమయోచిత సంభాషణా చాతుర్యము చాల పుష్కలంగా ఉంది.

మహాశ్వేతతో ఇతడు మాట్లాడిన విధం కావ్యం అంతటిలో చాలా హృద్యంగా కనిపిస్తుంది. కేయూరకుడితో సంభాషణ అతడి స్థాయికి తగినట్టుగా ఉంటుంది. పత్రలేఖ తరళికలతో ఇతడు పలికిన పలుకులు చల్లని పన్నీటి జల్లులా ఉంటాయి.

అందుచేత ఈ వాగ్మితలోకూడ యువరాజు దిట్ట.

## అథ కృతజ్ఞత్వం

"కృతానామ్ ఉపకారాణామ్ అభిజ్ఞత్వం కృతజ్ఞతా"

కాదంబరి కేయూరకుడిచేత ఇతను అక్కడ మరిచిపోయిన ముత్యాల శేషహారమే గాకుండా మంచి నవనవలాడే అకులూ వక్కలూ కలిపిన కమ్మని తమలపాకులు కూడా పంపుతుంది. అందుకు రాజు తన కృత

జ్ఞత తెలుపమంటాడు కాదంబరికి. అవి కాదంబరీ చేతుల్తో స్వయంగా ఇచ్చింది అన్న తృప్తి సంతోషంతో.

అ ధ న య జ్ఞ త్వ ం

సామాద్యుపాయ చాతుర్యం నయజ్ఞత్వ ముదాహృతమ్"
సామదానభేద దండోపాయములను ఎప్పుడెప్పుడు ఎలా నడపాలో తెలుసుకుని రాజకీయాన్ని నడపడం నయజ్ఞత తారాపీడుడు ఈ నయజ్ఞత్వాన్ని అనుసరించి రాజకీయాల్ని నడిపాడు గనుకని రాజ్యం చాలా ప్రశాంతంగా ఉంది.

అ ధ శు చి తా

అంతః కరణశుద్ధిర్యా శుచితా సా ప్రకీర్తితా
అంతఃకరణ పవిత్రత శుచిత్వము.

మంచి వయసు మందానిలం వీస్తూంటె మహారణ్య మధ్యంలో మహాశ్వేతలో తాను ఒంటరిగా ఉన్నా ఆమెను తన తల్లి తోడూ కంటె ఎంతో గౌరవంగా ఆదరంగా అభిమానంతో కష్టకథనంతా విని ఆదుకున్నాడు, ఆవిడను చి అతి సన్నిహితమైన స్వచ్ఛమైన మిత్రత్వముతో కూడిన ఆత్మీయతను సంపాదించాడు

చంద్రాపీడుడి అంతఃకరణ శుద్ధికి ఈ ఘట్టము చక్కని తార్కాణము.

అ ధ క లా వ త్వ ం

"కలావత్వం నిగదితం సర్వవిద్యాసు కౌశలమ్"
సర్వ విద్యలయందు గల అపార నైపుణ్యము కళావత్వము.

చంద్రాపీడుడు విద్యలలో ప్రవేశించిం దగ్గరనుంచి పదహారే ళ్ళకే అన్ని కళలలో అతి ప్రజ్ఞాపాటవాలు గడించాడు.

అ ధ ప్రి జా ర ం జ క త్వ ం

"రంక కత్వం తు సకల చిత్తాహ్లాదన కారికా"
మానవ మానసాలకి మహా సంతోషాన్ని కలిగించే ప్రవర్తన.

ప్రి జా ర ం జ క త్వ ము

తన పాలనలో ఉన్న ప్రజలందరినీ కంటికి రెప్పలాగ కన్న కంతరిలాగ కాపాడుతూ వారి కష్టాలలో పాలుపంచుకుని అవి తీర్చగలి గిన రాజు అన్నమాట. అప్పుడే ప్రజలు ఆరాజంటె సంతోషిస్తారు ఇతడిరాజ్యం ఏ అల్లకల్లోలాలు లేకుండా ఉంది గనుక ఈ లక్షణం సం పోతుంది. బాణుడు కాదంబరిలో నాయకుడు చంద్రాపీడుడిలో ఈ నాయ కుడికి ఉండవలసిన మంచి లక్షణాలు అన్నిటితో అతి రమణీయంగా చిత్రించాడు.

ఇక ధీరోదాత్త లక్షణాలు చూదాం.

ధీ రో దా త్త :

దయావాన్ అతీ గంభీరో వినీత. సత్త్వ సారవాన్ దృఢవ్రతః తితిక్షావాన్ ఆత్మశ్లాఘా పరాఙ్ముఖః నిగూఢ అహంకృతిః ధీరైః దీరో దాత్తః ఉదాహృతః—దయగలవాడు—మిక్కిలి గాంభీర్యము గలవాడు వినీతుడు సత్వసారము గలవాడు దృఢవ్రతుడు తితీక్షావంతుడు ఆత్మ శ్లాఘా పరాన్ముఖుడు నిగూఢ అహంకారము గలవాడు.

ఇట్టి గుణములు గలవాడు ధీరాదాత్తుడు.

దయా —

చంద్రాపీడుడు శ్వేత విషయంలో ఎంతటి దయాస్వభావుడో మనకి తెలుస్తోంది.

అతి గంభీరః—ఒంటిగా తోవతప్పిపోయాడు. కిన్నెర మిథునం కోసం ఎండని దాహాన్నీ అలసటిని దేన్నీ లక్ష్యం చెయ్యలేదు. అతి గంభీరంగా ముందుకు నడిచాడు.

వినీతః—కాదంబరీ మహాశ్వేతలతో ఎంతో విధేయతగా సంభాషణ సాగించాడు.

ఆత్మశ్లాఘా పరాఙ్ముఖత—

తన్ను గూర్చి మహాశ్వేత కాదంబరితో చెప్పుట విని అయిష్టంగా చంద్రాపీడుడు తలవంచాడు.

## చంద్రాపీడుడు - కాదంబరి

కాదంబరీ కావ్యంలో ఇతడు నాయకుడు, సౌందర్యవంతుడు' సద్గుణవంతుడు, విద్యావంతుడు, వినయధనం విస్తారంగా గలవాడు.

మహాశ్వేతని ఇతడు చూశాక కాని, మనకి ఇతడు అంతగట్టిగా కనపడడు.

మహాశ్వేతతో ఎంతో సహృదయపూర్వకమైన సంభాషణ సాగించాడు. ఆవిడ కష్టకథను విని కన్నీరు కార్చాడు.

తరువాత ఆవిడతో హేమకూటానికి వెళ్ళాడు. అక్కడ కాదంబరిని చూశాడు, ఆవిడ సౌందర్యానికి ముగ్ధుడయాడు.

"ఏభూవైరమభావశ్య సాత్వికైః వ్యభిచారిభిః

విభావములచేత అనుభావములచేత ఆస్వాదనకు తేబడిన స్థాయీభావమే రసము.

ఈ రసములు తొమ్మిది

శృంగార హాస్య కరుణారౌద్ర వీరభయానకాః

భీభత్సాద్భుత శాంతశ్చనవ నాట్యేరసాః స్మృతాః

శృంగారము, హాస్యము, కరుణ, రౌద్ర, వీరము, భయానకము, భీభత్సము, అద్భుతము, శాంతము.

ఈ నవ రసములకు స్థాయీభావము లున్నవి_అవి యేవనలా

రతి, ర్హాసశ్చ, శోకశ్చ, క్రోధో, త్సాహే, భయం, తధా జుగుప్సా, విస్మయ, శమాః, స్థాయీభావా ప్రకీర్తితః

రతి, హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము, భయము, జుగుప్స, విస్మయము, శమ ఇవి స్థాయీభావములు.

విభావములు రెండు విధములు — (1) ఆలంబన విభావము (2) ఉద్దీపన విభావము.

విభావ స్వరూపము—స్త్రీ పురుషులు ఆలంబనము.

ఉద్దీపనము—ప్రియము, సౌమ్ములు. చేష్ట మొదలైనవి.

అనుభావము—ప్రౌఢ కటాక్షాదికములు.

సాత్విక భావములు—"పరగీత సుఖదుఖాదుల నరయగ భావించి యట్లయలరుట.

స్తంభము, ప్రళయము, శ్వేదము, రోమాంచము, కంపము, నైవర్ద్యము.

సంచారీభావములు ముప్పదిమూడు

నిర్వేదము, శ్రమ, దైన్యము, గ్లాని, త్రాసము, శంక, ఆర్తి రోషము, గర్వము, ఆవేశము, ధృతి, స్మృతి, చాపలము, ఉగ్రత, అవహిత్థము, విషాదము, మదము, ఔత్సుక్యము, మతి, నిద్ర, మోహము, బోధము, మృతి, ముదము, ఆలస్యము, వితర్కము, సుప్తి, అసూయ, ఉన్మాదము, అపస్మృతి.

శృంగార చేష్టలు పద్దెనిమిది

భావము, హాసము, హేల, విలాసము, చకితము, హసితము, కుతూహలము. చక్షుప్రీతి, చింత, సంస్మృతి, గుణకీర్తన, అరతి, తాపము, లజ్జాత్యాగము, గమనము, మూర్ఛ, ధన్యత. పై లక్షణాలు బాణుడి చేతిలో నాయకానాయికలకు కొంతవరకు పట్టించాడు.

అతడి కొడుకు భూషణభట్టు చేతిలో వీళ్ళకి ఈ లక్షణాలు గట్టిగానే పట్టించాడు.

చంద్రాపీడుని ఉదాత్తనాయక లక్షణాలు మనం ఇదివరకే చూశాం.

కనుక పాత్రలోకి వద్దాం.

కాదంబరి చంద్రాపీడుణ్ణి మళ్ళీ చూడాలనే ఉద్దేశంతో తనమేడ పై భాగంలోకి వెళ్ళింది.

అటు క్రీడాశైలంమీద ఉన్న చంద్రాపీడుడ్ని చూసింది. ఇక్కడ శృంగారచేష్టలు ఆమెని, భట్టు తగు మోతాదులో వర్ణించాడు.

తలలో పూవులు అతణ్ని చూస్తూ అస్తమానం సవరించుకోవడం— మద వికారాన్ని వ్యక్తంచేస్తూ ఒళ్ళు విరుపులూ ఆవలింతలు ఆవలిస్తూ

నోటికి చేతిని అడ్డంపెట్టుకుంటూ, కనురెప్పలను మాటిమాటికీ అల్లా ర్చడం—

పరస్పరావలోకనాదుల తరువాత ఈ చేష్టలు వర్ణిస్తాడు,

తన పరివారాన్ని చంద్రాపీడుడు కలుసుకున్నాక వాళ్ళతో కాలం గడుపుతూవున్నా హృదయం పదే పదే కాదంబరివైపే పరుగులు తీస్తూ వుంది.

కేయూరకుడు వచ్చి కాదంబరి మీ దర్శనం అపేక్షిస్తుంది. ఆవిడ విరహాగ్నిలో వేగుతోంది. అని చెప్తాడు—వెంటనే ఇంద్రాయుధం ఎక్కి హేమకూటానికి చేరుకుంటాడు. అక్కడ హిమ గృహంలో కాదంబరిని చూస్తాడు.

హిమగృహం చుట్టూ చందనపు బావులున్నాయి. ఈమె ఉన్న గదికి నలువైపులా చందనపు నీటిప్రవాహాలు వున్నాయి. దానికిచుట్టూ చల్లటి పూలతోరణాలు కట్టారు. అచటి కన్యలు తడిబట్టలు కట్టుకున్నారు. వంటికి దట్టంగా గంధం పూసుకున్నారు. చేతుల్లో నీళ్ళుకారుతున్న తామరపూలు పట్టుకున్నారు. వీళ్ళందరినీ చూస్తూంటే వరుణ లోకం భూలోకంలోకి దిగివచ్చిందా అన్నట్టుంది.

అందులో కాదంబరి చంద్రుణ్ని పట్టుకుని మంచి గ్రీష్మంలో, సూర్యుడికంటె వేడికిరణాలు గుప్పిస్తున్నాడు. వీడని దూషిస్తూంది చల్లగాలిని పట్టుకుని వేడిగాడ్పులే నయం ఈ గాలికంటె అంటూ పచ్చకర్పూరాన్ని మంచుముక్కలనీ పదే పదే పట్టుకుంటూ వుంది.

ఆ స్థితిలో చూశాడు చంద్రాపీడుడు కాదంబరిని విషయం అర్థం అయింది. కాని ఆ భావం అక్కడ ఎవరికీ వ్యక్తం కానీయలేదు.

కాదంబరి అతడ్ని సాపేక్షగా చూసింది. లేవాలి అనుకుంది అస్వస్థత ఆవిడ్ని లేవనివ్వలేదు.

అచటి పరిచారికలు రతనాలు తాకిన బంగారు ముక్కాలిపీటవేసి కూర్చోవలసిందిగా అతడిని కోరారు. కాని దాన్నితోసి అతడా శయ్యా సమీపంగా క్రిందనే కూర్చున్నాడు. అలా కూర్చున్నాడని కాదంబరి చాలా కటకటలాడింది.

అతని కనుకొలకులలోంచి అనురాగవారిధి పన్నీటి జల్లుపై వర్షిస్తోంది. కొన్ని క్షణాలకు రెప్పలల్లార్చి తలవాల్చాడు. ఆమె విరహ వేదనకు విలవిల్లాడాడు. పచ్చకర్పూరపు పలుకుల్లా చల్లగా పలుకరించాడు.

దేవీ కాదంబరీ—మిమ్మల్ని ఈలా చూడ్డం నాకెంతో బాధగా ఉంది. చిన్నగా కొంటెగా చూచి, ఇంతకీ ఈ వెతకంతటికీ కారణం ఊహ కందదంలేదు.

చూడండి—నా వల్ల మీ బాధలు ఏవిధంగా తగ్గుముఖం పట్టినా ధన్యుణ్ని అనుకుంటాకు. బాధకి హేతువు తెలుసుకోవచ్చా—పడాయి వాడిగా భావించి నన్ను దూరతీరాలకి నెట్టేస్తారా ? నెమ్మది కరిగేదాకా వస్తూ ఉండడం మానలేను.

కాదంబరి బరువుగా కనురెప్పలు పైకిఎత్తి ఒత్తుగానున్న జుట్టును చేతితో పైకిఎత్తి ఇందివి ఎత్తిపోటుమాటలవునా ? కాదా ? అని నిశితంగా అతడికళ్ళని చూస్తూ అతడి గుండెల్లో లోతులను చుఱుగ్గా చదివేస్తూంది.

వాటిని తట్టుకోలేక తబ్బిబ్బు అయిపోతున్నాడు చంద్రాపీడుడు.

విషయం ఎంత విషమించినా బాణుడి పాత్రలు అవధులని అతిక్రమించవు

ఇంతలో, కేయూరకుడు వచ్చి పరివారజనం తనకోసం ఎదురు చూస్తోంది, అనచెప్పాడు.

ఆ స్థితిలో ఆమెను చూస్తుంటే జాలిగా వుంది. ఎలా వెళ్ళాలా అని ఆలోచిస్తున్నాడు. కాదంబరీ ముఖపద్మం నుంచి ఇతడి చూపులనే తుమ్మెదలు అసలు కదలం అని భీష్మించుకు కూచున్నాయి. వచ్చిన వార్త అడుగులను తొందర చేస్తున్నాయి అతడి హృదయం ఆమె పాదాలకి అంకితం అయిపోయింది—కాలు గడప దాటక తప్పనిసరి. పాపం—ఇతడు వెడతాడన్న విషయం గమనించింది కాదంబరి. ఆమె కపోలాలు పాలిపోయాయి. అది గమనించిన ఇతడి ముఖం తెల్లబోయింది ఇది చూచిన ఆమె కళ్ళు వాలిపోయాయి. ఇక లాభంలేదని మహాశ్వేతను గౌరవ గా చూసి చేతులు జోడించి కాళ్ళునదవం మొరాయి అంటున్నా, చూపులు మేం తిరగ, అని తిప్పలు పెడుతూ ఉన్నా, ఆలోచనా పరంపరలు ఆవిడ దుట్టూ అతివేగంగా తిరుగుతూ వున్నా. అన్నిటినీ అదుపులోనుంచి అతడు అవతలకు వెళ్ళాడు, పరివారాన్ని కలుసుకున్నాడు.

తన తండ్రి దగ్గరనుంచి ఉత్తరం తెచ్చి ఇచ్చాడు సేవకుడు. క్రమ్మ గబగబ విప్పి చదువుకున్నాడు. రమ్మని రాసిన తండ్రి ఆజ్ఞ మీరలేడు()కాదంబరిని విడిచి వెళ్ళలేకపోతున్నాడు.

ఇక్కడ ఉన్నట్టయితే తన జనానీకం అంతటికీ తనమీద చులకన అభిప్రాయం ఏర్పడుతుందని వెళ్ళడానికే నిశ్చయించుకున్నాడు,

వెడుతూ 'కేయూరకా నాన్నగారు వేగంగా రమ్మన్నారు— కాదంబరితో చెప్పు—ఏమీ అనుకోవద్దని. మనిషిని ఉజ్జయినిలో ఉన్నా మనస్సంతా హేమకూటంలోనే ఉంటుంది. తప్పనిసరిగా వెళుతున్నాను. ఆవిడ ఇలాంటివాణ్ని ఎందుకు ప్రేమించానా? అనుకుని బాధపడు తుందో ఏమో? అలా ఎప్పుడూ అనుకోవద్దని పదేపదే చెప్పమని చెప్పు మహాశ్వేతకీ నమస్కారాలు అందివ్వు—నన్ను నిందించవద్దని కాదంబరితో మరీ మరీ నచ్చచెప్పు—మరి ఉంటా!

ఇప్పుడు విరహ అవస్థ అంతా చంద్రాపీడుని వంతైంది.

ఉజ్జయిని వెళ్ళాడు తల్లి దండ్రులను ప్రేమగా చూసుకున్నాడు.

కాదంబరిని గురించి ఆలోచనలతో అతడికేమీ స్థిమితం ఉండడం లేదు.

వైశంపాయనుడు వచ్చాక అతడిమీద భారం వుంచి హేమకూటా నికి వెళదామనుకున్నాడు.

ఇలా ఉండగా హేమకూటం నుంచి మదలేఖ కేయూరకుడూ వచ్చారు ఇతడి దగ్గరకి.

చంద్రాపీడుడు రా మదలేఖా వచ్చావా? కేయూరకా బాగు న్నావా? కాదంబరి ఎలా ఉంది? శ్వేత క్షేమమేనా? అక్కడి విష యాలు చెప్పు చెప్పు అంటూ వాళ్ళని తొందర చేశాడు.

మదలేఖ ఇలా చెప్పింది.

మహారాజా కాదంబరి మీ కి విధంగా సందేశం పంపింది. సావ ధానంగా వినవలసిందని, మరీ మరీ కోరింది. స్త్రీ సహజమైన జంకు నాలో చాలా వుంది—కొందరు అవివాహితలు తమ ప్రేమికులకి నిస్సం

కోచంగా నిర్భీతిగా తమ మనోభావాన్ని దూతికలద్వారా గాని, లేఖల మూలంగా గాని, పంపుతూ తృప్తి పడుతూ ఉంటారు.

నన్ను నేను పొగుడుకోవడంగా భావించకండి గాని నేను ఆకోవకి చేరినదాన్ని కాను.

మీరు కంటి ఎదురుగా కనిపించినప్పుడైనా నోరు తెరచి ఒకమాట చెప్పడానికి కూడా, మనస్సంగీకరించలేదు—అబల అన్నపేరు నాకు అక్షరాలా సార్థకం అయింది. నా నీడలో కొంచం అయినా ధైర్య సాహసాలు లేవు—మీకు ఈ విధంగా సందేశం పంపడానికి—ఎంత వంతగా వుందో చెప్పడానికి సాధ్యం కాదు—

అసలు ఎలా సంబోధించాలి ? ప్రియా ! ఇంతకంటె మంచిమాట ఏమీ కనపడదు. ఆ రెండక్షరాలూ నాకు ఎంత ప్రేమ ఉందో వ్యక్తం చెయ్యలేవు అయినా అది పునరుక్తిగా, నా భావం వ్యక్తం చెయ్యడానికి అసలు అవగింజంతైనా సరిపోవు. ఒక చిన్న ప్రశ్న వేదాం అనుకుంటు న్నాను—అబ్బా ఆ మాట ఎలా చెప్పను—మరి నా మాటకే గాని, నా పేరు అంటే అయినా మీ కిష్టం ఉందా ? అయినా అడగడం అవి వేకం వాచ్యంగా మరీ అలా అనడం వదిరుబోతు తనం అనే భయ గా ఉంది.

పోనీ నేను మిమ్మల్ని ఎంతో ప్రేమిస్తున్నాను—అని ఒక యువ రాజుకి వార్త పంపడం ఏమంత సముచితం — అసలు మీ పేరులోనే ఉంది—చంద్ర—అంటె అందరికీ ఆహ్లాదనిచ్చేవాడు గదా ! అందులో నా ప్రత్యేకత ఏం ఉంది ? అయినా అది ఎంత సిగ్గులేని మాట.

ఉన్న భావోద్రేకాన్ని ఒక్కమాటలో చెప్పాలంటె, నువ్వులేంది జీవించలేను—అన్నమాట పొసగనే పొసగదు. జీవించి ఉండి అలా అన దం—అది ఎంత సత్య విరుద్ధం అయింది—విలుకాడు వేధిస్తున్నాడు అనడం వివేకంలేని మాట—అయినా నా దౌర్బల్యాన్ని చాటుకున్నటె అవుతుంది.

నన్ను నీ ప్రేమపాశం ఎంత గట్టిగా పెనవేసుకుని వుందంటె కత్తులు కావు, రంపాలైనా నాన్ని కొయ్యలేవు అనడంలో సందేహించ క్కరలేదు గాని—స్వాహంకారం అవిధేయత స్పష్టంగా కనిపిస్తుంది. ఉజ్జయినీ మహారాజుని—ఇక్కడికి రా అని ఆజ్ఞాపించడం ధనమదాంధత, అనిపించుకుంటుంది. పోనీ నేను అక్కడికే వచ్చేస్తున్నాను అనడం స్త్రీలోకానికే అవమానకరం—నా ప్రాణత్యాగం విన్నాక అయినా ప్రేమ విలువలు లోతులు మీ కర్థం అవుతాయేమో అని అనుకోవడం బాగులేదు. బాధలో ఉన్న మనిషిని చూసి కూడా అర్థం చేసుకోకుండా తండ్రిగారి ఆజ్ఞ అని వెళ్ళిన మనిషికి ఈ వార్త పంపడం చాలా పేలవంగా ఉంది— అయినా మా మహాశ్వేతకు వివాహం అయేదాకా నా విషయం తలపెట్ట నని గట్టిగా శపథం చేశాను. అది నిలబెట్టుకోలేక నీళ్ళల్లో రాతలా కల్లోలిత మౌతోంది నా మనస్సు. ఇంకే చెప్పను, అందుకే సెలవు తీసుకుంటున్నాను.

ఇంతవరకూ బాణుని కాదంబరి.

(దీని తరువాత ఘట్టాల్ని భట్టు కొడుకు భూషణభట్టు రాశాడు.)

## సంభాషణా చాతుర్యం

...దర్శకుడు చిలుకతో.

'ఆత్మనో జన్మ కస్మిన్ దేశే—ఏ దేశంలో జన్మించావు.

కేనవా నామకృతం—నీ పేరెవరు పెట్టారు.

కామాతా? కస్తే పితా?—తల్లీ ఎవరు? నీ తండ్రి ఎవరు?

కథం వేదానాం ఆగమః—వేద శాస్త్రాలతో నీకింత పరిచయం ఎలా వచ్చింది.

కుతః కలాః సమాసాదితాః—ఈ కళలన్నీ నీకెలా వచ్చాయి.

కిం జన్మాంతరాను స్మరణం ఉతవర ప్రదానం —

జన్మాంతర జ్ఞానం ఎలా వచ్చింది? వరాన్ని పొందావా?

అథవా విహంగ వేషధారీ—పక్షి వేషము ధరించిన మహాను భావుడా?

కశ్చిన్నం సివ సని—ఎక్కడ ఉండేవాడవు?

కియద్వావయః—నీ వయసేమాత్రం ఉంటుంది.

కథం పంజరబంధః—ఎలా ఈ పంజరంలో బంధింపబడ్డావు.

కథం చండాల కన్యకా హస్తగమనం—ఎలా ఈ చండాల కన్య చేతిలోకి వచ్చావు.

ఇహవా తవ కథమాగమనం—ఇక్కడకు నువ్వు ఏ విధంగా వచ్చావు?

బాణుడు చిన్న చిన్న మాటలతో మహా చక్కగా సంభాషణలు ...డిపిస్తూ ఉంటాడు.

వరసగా ప్రశ్న పరంపరలు గుక్క తిప్పుకోకుండా వర్షంలా కురిపించేస్తాడు గాని ప్రతి సమాధానం అవతల ఇచ్చే అవకాశాన్ని ఇవ్వడు.

అవతలవాడు కూడా అలాగే చెప్పాలన్నమాట.

కపింజలుడు పుండరీకుడితో

కపింజలు - ఏమిటయ్యా మిత్రమా ఈ సంచలనం? నీలాంటి సత్పురుషుడికి తగిందేనా.

పుండ - మనసుకు చలనం వచ్చాక ఈ ఆలోచనలేమీ ఉండవయ్యా.

కపిం - మహర్షి పుత్రుడివి, ఆత్మనిగ్రహం ఉండవద్దా.

పుండ - నిగ్రహం గిగ్రహం కబుర్లు చాలా చెప్పచ్చు అది ఆచరణలో ఉండడం అనేది యాజ్ఞవల్క్యుడు లాంటి వాళ్ళకే అసాధ్యం గదా!

కపిం - అందంగా స్త్రీలు కనిపించంగానే నిగ్రహం వదిలేసి నీళ్ళు గారతే సామాన్య మనుషులకు చెల్లింది - కానీ నువ్వో జప తప సంపన్నుడివి గదా! ఇలా ఏం బాగుందో చెప్పు.

పుండ - నాయనా నీ ధర్మపన్నాలు వినే ఓపిక లేదయ్యో నాకు.

కపిం - కాదు నాయనా కాస్త ఆలోచించు — కామానికి లోబడేవాడు కాపురుషుడు—దాన్ని జయించినవాడే పుణ్యాత్ముడు.

పుండ - పుణ్యం పాపం అన్నీ తరువాత ఆలోచించాల్సిన విషయాలు. ముందు నాకా శ్వేత ముందుంటేగాని ఈ అల్ప ప్రాణాలు ఆగేటట్టు లేవు.

కపిం - ఒక్కమాటు చూశావో లేదో అలా శ్వేత శ్వేత అంటూ అట మటిస్తే ఎట్లా ? ఆవిడ కులం గోత్రం ఊరూ పేరూ మంచీ చెడ్డా తల్లీ తండ్రీ ఇదివరకే ఆవిడ ఇంకెవర్నైనా ప్రేమిం చడం ఇలాంటివి ఏమైనా ఉన్నాయో లేదో ఆలోచించవద్దా.

పుండ - నాయనా, లేనిపోని ఏవేవో అనుమానాలనేవి తెచ్చి నా ముం దుంచకు — అసలే నా ప్రాణం బాగులేదు.

కపిం - అయ్యయ్యో ఇంత మోహంలో పడ్డావేమిటయ్యా ఇంత రాగ పాశ బద్ధుడవైతే ఎలా ? దానికీ ఒక శృతీ గతీ అంటూ ఉండవద్దా ! ఇన్నాళ్లు మనం సంపాదించిన ప్రజ్ఞానం విజ్ఞ అంతా ఏ యేట్లో కలిపేశావ్.

పుండ - అబ్బబ్బ—అసలే నాకు తలా ఒళ్ళూ మాయదారి మన్మ మూలంగా సలసలలాడుతూ ఉంటే—ఇవేం మాటలు తున్నావయ్యా కాస్త చల్లటి మాటలు చెప్పుదూ.

కపిం - అయ్యో ! ఏమయ్యా ! పుండరీకా నీ శాస్త్రజ్ఞానం అం ఇలా చట్టుబండలై పోయిందా—ఒక్క తృటి మాత్రంలో ఇ దిగజారి జావగారుతున్నా వేమిటి—తండ్రి సామాను మహర్షి శ్వేతకేతు వే—నువ్వింత పేలవంగల ప్రాణివై ఎలా.

పుండ - చూడు కపింజలా నీ మాటలు చెవుల్లో పడ్డంలేదు. క ముందు దృశ్యాలన్నీ నా సమస్తం దోచుకుపోయిందే. ఆ అదే ఆ మహాశ్వేత అదే కనిపిస్తూంది. ఆ మాటలే వినిపి

న్నాయి. ఏ కళ్ళు చూసినా, నాకు ఆ కళ్లే తనిపిస్తున్నాయి. ఇంత ఎందుకు అంతటా ఆ శ్వేతే కనిపిస్తూంది. బాబువి కదూ—ఎలాగో వెళ్ళి ఆవిణ్ని తీసుకురా—మరి సమాధానం చెప్పకు—ఇంకా నువ్వు ఇలా ఇలా చెపుతూ కూచున్నావంటె ప్రాణం లేని నా శరీరాన్ని మాత్రమే చూడగలవు—తెలి తెలిసిందా ! మరి వెళ్ళు మంచివాడివి కదూ నన్ను సజీ వంగా నీకు చూడాలి అని ఉంటె వెంటనే శ్వేతని తీసుకు వచ్చే ప్రయత్నం చెయ్యి—

అబ్బా అబ్బా అంటూ నానా యాతనా పడుతున్నాడు కపిం జలుడు ;

## కాదంబరీ మహాశ్వేతల సంభాషణ

చంద్రాపీడుడు కాదంబరీ అంద చందాలు చూస్తూ అలా ఉండి పోయాడు. ఇంచు మించుగా ఈ లోకంలోంచి కాదంబరి లోకంలో ప్రవేశించాడు. బాహ్యంలో విషయాలు ఏవీ పట్టే స్థితిలోనే లేదు.

శ్వేత - కాదంబరీ అనంగానే ఆవిడ సాభిప్రాయంగా చూసింది శ్వేతని. కాదంబరికి కనపడకుండా తలత్రిప్పి చిన్నగనవ్వు నవ్వింది. చెలీ ఏమిటో ఆలోచిస్తున్నావు. చంద్రాపీడుడు అజ్జయినీ యువరాజు సుమా—ఇతని తండ్రి పీడుడు.

కాదం - అలాగా నీకు ఈ విషయాలన్నీ ఎలా తెలిశాయి.

శ్వేత - నిన్న ఇతడు పాపం ఎండలో త్రోవతప్పి నా ఆశ్రమానికి వచ్చాడు—

కాదం - అవును మరిచిపోయా ఆ విషయం కేయూరకుడు చెప్పాడు. అయితే ఇతను యువరాజును అనే అహం లేకుండా కలిమి మిడిగా మాట్లాడలాడన్నమాట.

శ్వేత : ఎంతమాట చాలా సహృదయుడు. ఎదుటి మనుష్యుల్ని ఎంతో చక్కగా అర్థం చేసుకుంటాడు. కష్టాలలో ఉన్న వాళ్ళని హేళనచేసే అల్పబుద్ధి లేదు, సరికదా ఆదుకోవాలనే సహృదయుడు.

కాదం - అలాగా రాజై ఉండి సౌందర్యం ఉండి విద్యా బలపరాక్రమాలుండీ స్త్రీలపట్ల ఇంత గౌరవం ఉందంటె మనం మెచ్చ వచ్చు.

శ్వేత - అందరూ స్త్రీలని అగౌరవంగా చూస్తారనుకోవడం చాలా పొరపాటు విజ్ఞత లేనివాళ్ళే అలా ప్రవర్తిస్తారు గాని ఏ మాత్రం సభ్యతా సంస్కారం ఉన్నవాళ్ళు తప్పక గౌర విస్తారు.

మనీషిభిః సాప్తపదీన ముచ్యతే అన్నారు మనవాళ్లు. ప్రజ్ఞావంతులతో ఏడు మాటలు మాట్లాడితే చాలు పటిష్టమైన స్నేహం ఏర్పడుతుం దంటారు గదా పెద్దలు.

కాదం - అయితే ఈయన మనీషి అని నువ్వు నిర్ణయించావన్నమాట

శ్వేత - నేను అనడం ఎమిటి? నువ్వు కచ్చితంగా అదేమాట అంటావు—కొంచం చూస్తే.

కాదం - విశ్వానికి భర్త అయినవాడు ఇంతటి విశాల భావాలు కలవాడుగా ఉండడం చాలా అరుదుగా ఉంటుందనుకుంటాను.

శ్వేత - అతి దయార్ద్ర హృదయుడనుకో. వెన్నకంటె సున్నితం ఇతడి మనస్సు—

కాదం - అలా అయితే యుద్ధం ఎలా చేస్తాడు—రాజ్య విస్తీర్ణతకు ఎలా పాటుపడ్డాడు.

శ్వేత - "వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాసిచ" అవసరం అయినపుడు అతని హృదయం వజ్రంకంటె కఠోరంగా ఉంటుంది. లేకపోతే పూవురేకులకంటె మృదువుగా ఉంటుం దన్నమాట.

కాదం - ఆకృతిమాత్రం చాలా ఆకర్షణీయంగా ఉంది. అందుకు సందేహం లేదు. గుణ సంపద అంతా నువ్వు చెప్తున్నావ్— సఖీ చాలా సంతోషంగా ఉంది.

శ్వేత - సన్యాసాశ్రమంలో ఉన్న నాకే ఇతని సద్గుణ సంపద వివేకం ఎంతో సంతోషాన్నిచ్చిం దనుకో—నా కన్నీటి కష్టగాధంతా విన్నాడు. నీలాగే ఎంతో సానుభూతి భాషించాడు. కన్నీళ్ళు అలా జాలువారాయి. ముఖం అంతా ఎంతో బాధగా మారింది. ఎంతటి విశాల హృదయం—అందుకే నాకు ఇతణ్ణి నీకు చూపించాలనిపించింది. అంటూ ఉంటె కాదంబరి బుగ్గలు గులాబి మొగ్గలులా విచ్చాయి. చిన్న చిటిక వేసింది కాదంబరి. ఆమెను చిరునవ్వుతో చూసింది శ్వేత.

సంభాషణ చాలా రమణీయంగా నడుపుతాడు బాణుడు.

బాణుని దోషాలు

కాదంబరీ కావ్యంలో ఉన్న దోషాలుకూడా మనం చూడవలసి ఉంది

చంద్రాపీడుని మంత్రి శుకనాసుడు—వాళ్ళిద్దరికీ ఎంత సన్నిహిత మిత్రత్వం ఉన్నా అడగవలసిన విషయాలు అడగడం బాగుంటుందిగాని మరీ కొన్ని కొన్ని విషయాలు పరివారజనం ఎదుట అడగడం సముచితంగా ఉండదు.

తపస్సులు ధారపోయగా తపించగా తపించగా తారాపీడుని భార్య విలాసవతి గర్భవతి అయిందన్నమాట కులవర్ధన అనే పరిచారిక అతడికి చెపుతుంది.

ఆవార్త విని రాజు ఎంతో సంతోషించాడు. ఆ శుభవార్త చెప్పిన కులవర్ధనకి తన ఆభరణాలన్నీ ఒలిచి ఇచ్చేశాడు.

ఆ ఆనందాన్ని పట్టలేక శుకనాశుడితో సహా విలాసవతిని చూడ్డానికి వచ్చాడు. ఆమెను చూడంగానే అనుకున్న లక్షణాలు కనిపించాయి. సంతోష పట్టలేక ఆమెతో ఇలా అన్నాడు.

కాదంబరి 68వ పేజీలో 6వ పంక్తి.

తారాపీడుడు—దేవీ శుకనాసః పృచ్ఛతి—

దేవీ శుకనాసుడు అడుగుతున్నాడు, యదాహ కులవర్ధనా కిమపి తత్కిం తథైవ ఇత్యువాచ.

చూడు కులవర్ధన చెప్పినమాట సత్యమేనా? అని అడిగాడు.

చిరునవ్వుతో సిగ్గు తొణికిసలాడింది, బుగ్గలూ పెదాలూ కళ్లూ సంతోషంతో నిండిన లజ్జని సువ్యక్తం చేస్తున్నాయి. పమిటచెంగుతో ఆమె ముఖాన్ని కప్పి క్రిందగా చూస్తోంది.

నాటక పాత్రలా ఆమెను మన కళ్ళఎదుట నిలబెట్టినట్లు వర్ణించాడు గాని శుకనాసుడు అడుగుతున్నాడు—అని గర్భవతి అయిన విషయం మంత్రిచేత అడిగించడం మాత్రం సభ్యతకి చాలాదూరం అనుచితం అనిపిస్తుంది.

పు ం డ రీ కు డు

ఇతని తండ్రి శ్వేతకేతు మహర్షి—మహాలక్ష్మి జగన్మాత—తెలదామరలు నివాసం. అసలు కథ ఉండి ఉండవచ్చు. పుండరీకుడు చనిపోవడానికి కూడా ఏవేవో కారణాలన్నీ చెప్పాడు.

మహాలక్ష్మి కాముక దృష్టితో మహర్షిని చూసిందట. సద్యో గర్భంగా వెంటనే తామరపూవులో శిశువు జన్మించాడట. అతణ్ని తెచ్చి నీ కొడుకే అనిచెప్పి ఇచ్చేసిందట. అతడు ఈ పిల్లవాడికి పుండరీకంలో పుట్టాడు గనుక పుండరీకుడని పేరు పెట్టాడట.

వ్యథతో కాస్త తాపానికి తట్టుకోలేక పుండరీకుడు ప్రాణాలు విడిచి పెట్టేశాడు. అందుకోసం ఈ విధంగా సృష్టించాడేమోకాని కాస్త ఆలోచిస్తేమాత్రం పై విషయం ఏమీ సముచితంగా లేదని చెప్పక తప్పదు. వర్ణనలు—రసాన్ని ఆశ్రయించి వర్ణనలు తగుమాత్రం అయితే రాణిస్తాయి కాని రసాన్ని కథని పాత్రలని అన్నీ వదిలేసి తృప్తి తీరా ఏ వర్ణన పడితే ఆ వర్ణనలని అతిగా వర్ణించి అలంకారాలని

కుప్పేసి కుప్పేసి కావ్యానికి జీవమైన కథా సన్నివేశాలని రసాన్ని పూర్తిగా మృగ్యం చేసేస్తే పాఠకుడు సహనం విడిచేసి ఆ పదజాలంలో పడి సాముచేసి సతమతమయేస్థితి కల్పించడం చాలా అసంబద్ధం ఏమో అనిపిస్తుంది.

చంద్రాపీడుడు తిరిగి వస్తున్నప్పుడు మార్గమధ్యంలో ఒక దేవి ఆలయం దానికి పూజలు—ఇంకా అక్కడ సన్నివేశాలూ బలులూ భజనలూ తప్పెట్లూ తాళాలూ తాగుళ్ళూ త౽దనాలూ ఇవన్నీకూడా కథకి ఎక్కడా ఏమీ సంబంధం లేదు—అది మానేసినా ఏమీ బాధలేదు.

అయితే కాదంబరిమీద సంపూర్తిగా సక్తమైన చిత్తానికి కొంత ఈ విధమైన కల్పనల మూల౦గా విశ్రాంతి ఉంటుందని సన్నివేశాలు కల్పించాడు కవి అని అంటే అనవచ్చు. కాని, వాటిమూల౦గా కంటె ఇంకా హృద్యమైన సన్నివేశాలు పెడితే బాగు౦టుంది. పై విషయాలు అన్నీ కూడా రసభంగమూ కథాగమనం సాగనీయకపోవడం ఒక విధమైన విసుగుదల పాఠకుడికి కలుగుతుంది.

గంధర్వులు గనుక వాళ్లకి జరా అనే భయం ఉండదు. ఆపాత్రలని చంపేసెయ్యడం ఎన్నో సంవత్సరాలు వాళ్ళని అలా మృతపాత్రయులుగా ఉంచేసెయ్యడం దాని తరువాత జన్మం అ౦తా పూర్తిఅయాక ఆయా పాత్రలని జీవించేటట్లు చెయ్యడం ఇదంతా అద్భుత౦గా సృష్టించాలి అని అనుకోవడం, అంతవరకూ ఈ స్త్రీ పాత్రలను ఆ అరణ్యంలో అరణ్యరోదనం చేయిస్తూ ఉండడం ఆయా జన్మలు తీరాక. అప్పుడు వీళ్ళకు కళ్యాణ మహోత్సవాలు చేయించడం ఇదికూడా అంత సముచితం అనిపించదు.

కేయూరకుడిచేత చంద్రాపీడుడికి తన తాపం అంతా వర్ణించి చెప్పమని కాదంబరి పంపిస్తుంది.

ప్రేమ విషయాల్ని కేయూరకుడు తనకు ఎంత సన్నిహితంగా వీణా వాహకుడయినా ప్రియుడు చంద్రాపీడుడికి—విరహ వ్యాపారాలని చెప్పి కబురు పంపడం ఏమీబాగులేదు.

ఇలా చూసినకొద్దీ తప్పులు కనపడతాయి.

అక్కడక్కడ చిన్నగా ఉన్న దోషాలను అంత గణించకూడదు. రత్నాకరుడైన సముద్రంలో చిన్న నత్తగుల్లలు ఉన్నా దానికి లోటు రాదు. ఘనత తగ్గదు. ఏకోహి దోషో గుణ సన్నిపాతె.

## ఆ ధ్యా త్మి క ం గా బా ణు డు

విలాసవతితో సంతానం లేదని ఆవిడ దుఃఖిస్తూ ఉండగా ఇలా అంటాడు.

కా. 61పే. 9-10 దగ్గిరనుంచి 15వ పంక్తి వరకూ.

"దేవీః కి మత్ర క్రియతాం, దైవాయత్తే, వస్తుని, అలమితి, రుదితేన, న, వయమనుగ్రాహ్యః, ప్రాయో, దేవతానాం, ఆత్మజ పరి ష్వంగామృత, ఆస్వాద సుఖస్య, నూనమ్, అభాజనమ్, అస్మాకం, హృదయమ్, అన్యస్మిన్, జన్మని నకృత, మవదాతం, కర్మ, జన్మాం తర, విరహితం, కర్మ ఫలముపనయతి, పురుషస్య, ఇహ, జన్మని, నహి, శక్యం, దైవమన్యధాకర్తుం, అభియుక్తేనాపి, యావత్తు, మాను ష్యకే, శక్యముప పాదయితుం, తావత్సర్వం, ఉపపాద్యతాం, అధికాం

కురుదేవీ ! గురుషుభక్తిమ్, ద్విగుణాము ఉపపాదయ, దేవతాసుపూజామ్ ఋషిజన, పరిచర్యాసు, దర్మితాదరా, భవ, పరంహి దైవతమ్, ఋష యః యత్నేన, అరాధితా, యథీ, సమీపహిత, ఫలానామ్, అతిదుర్లభా నామ్, అపి, నరాణాం, దాతారో భవంతి ;"

"దేవీ ! విలాసవతీ మనం ఎంత దుఃఖపడ్డా చెయ్యగలిగిందేమీ లేదు సుమా ! విధి మనకి విధించిన కష్టాలు మనం కిమ్మనకుండా అను భవించ వలసిందే గదా ! సుఖాలకీ కష్టాలకీ మనం కర్తలం కాదుగద ఆ యా జన్మల్లో మనం చేసుకున్న సుకృత దుష్కృతాలే మన కీ జన్మకి కారణభూతం అవుతూ ఉంటాయి. మనం ఇక్కడ వుట్టడం పెరగడం పోవడం ఏవో కర్మలని చేస్తాం, మంచి పనులు మనం ఎంత ప్రయ త్నించినా చెయ్యడం అసాధ్యం. చెడ్డవి అన్నావా ? వాటికి ప్రయత్నం అఖ్ఖర్లేదు. కష్టపడే అవసరం కూడా లేదు—మన భారత దేశానికి కర్మభూమి అని పేరుంది. సత్కర్మ చేసుకొందుకు ఇక్కడ మాత్రమే అవకాశం ఉంది. ఇంక ఎక్కడా అవకాశం లేదు.

పాపాలనీ, దుష్కర్మలనీ, దేవతారాధన, జప, తపాదుల్తో పె పోగొట్టుకోవచ్చు, అందుకని మంచి భక్తితో మహర్షులను సేవించు, దేవతలకంటె మహర్షుల అనుగ్రహం చాలా గొప్పది. వీళ్ళ ప్రత్యక్ష దేవతలన్నమాట. ఎంతటి దుర్లభమైనవి అయినా మంచి సత్ఫలితాల్ని మానవులకు ఇస్తాయి.

బాణుడు కర్మసిద్ధాంతాన్ని పూర్తిగా అంగీకరించినట్టు పై వాక్యాల వల్ల మనకు తెలుస్తూంది.

మన జన్మలకు కర్మలే కారణం. జన్మరాహిత్యం కావాలంటే కర్మల్ని ఆవాసనల్ని మనం నశింపచేసుకోవాలి—'జ్ఞానాగ్ని దగ్ధ కర్మా

ణాం' అన్నాడు గీతాచార్యుడు కృష్ణపరమాత్మ. అందుకని మానవుడు సత్కర్మల ద్వారా జ్ఞానాన్ని సంపాదించి తద్వారా కర్మరాహిత్యం అనంతరం మోక్ష ఫలానికి అర్హుడౌతాడు.

చాలాచోట్ల తన కావ్యంలో కర్మ సిద్ధాంతాన్ని బాణుడు ప్రతిపాదిస్తూనే ఉంటాడు.

## కా ద ం బ రీ నా మౌ చి త్యం

కాదంబరి గ్రంథానికి ఆ పేరు ఎంతవరకు తగి ఉంది. ఆ పేరులోగల ప్రాధాన్యం ఏమిటి? కవి, తన కావ్యానికి ఆ పేరు ఎందుకు పెట్టాడు.

ఈ విషయంకూడా మనం పరిశీలించవలసి ఉంది

"సూత్రే మణి గణా ఇవ"

మణులను ఒక దారంలో గుచ్చినట్లయితే దారం కనపడదు గాని దండ అంతటా అది వ్యాప్తమై ఉంటుంది.

అలాగే మనం ఏ పేరు కావ్యానికి పెట్టామో దాని సార్థక్యం కావ్యం అంతా కనిపించాలి.

కాదంబరి—అంటె మద్యము—సరస్వతి – ఆడు కోకిల మనకు తెలిసిన అర్థము కాదంబరి అనే కావ్యము.

మద్యము అంటె కల్లు, ఇది మత్తు ఇస్తుంది. చైతన్యం తప్పిస్తుంది. ఉచితానుచితాలు ఆలోచింపనివ్వదు. అతిగా సేవిస్తే ప్రాణహాని తాగిన వాడికి ఆహారం కూడా రుచింపదట.

మన భట్టు ఈ నామాన్నే ఈ కావ్యానికి పెట్టడం అంత సము చితంగా లేదని కొంతమంది విమర్శకులు భావిస్తున్నారు కథానాయిక పేరు కాదంబరి ఈ పాత్ర మనకి గ్రంథంలో రెండు వంతులు దాటి మహాశ్వేతని మనం చూశాక ఆవిడచేత చెప్పిస్తాడు కవి. హేమకూటంలో మదిరా చిత్రరథుల కూతురు కాదంబరి ఉందని తనప్రాణ స్నేహితు రాలనిన్నీ.

ఇంతవరకు చదువరులకు ఎక్కడా కాదంబరిపేరు వినపడదు. పాత్ర కనపడదు.

కాదంబరి పెండ్లికి ఆడపెండ్లివారివైపు జనం మగపెండ్లివారివైపు జనం పందిరంతా నిండి ఉంటారు. బాజా మేళాలు సందళ్ళూ వచ్చిపోయే వాళ్ళ హడావిళ్ళూ, సరిగ్గా మంగళసూత్ర ధారణకు ముందే గంపదగ్గిర కూచుని గౌరీపూజ చేసుకుంటున్న పెండ్లికూతుర్ని ఏ మేనమామో చట్టున పట్టుకు వచ్చి కూచోపెడతాడు. అప్పుడు చూపరుల చూపులన్నీ పెండ్లి కూతురు ముఖపద్మం చుట్టూ ఒక్కసారి చుట్టుముట్టేస్తాయి ఇది అంద రికీ తెలిసిన విషయం కద.

మన బాణుడుకూడా తన కావ్య కన్య కాదంబరిని అపురూప సౌందర్యరాసి అని మహాశ్వేతచేత చెప్పించాడు ఆమె సౌందర్యం సద్గు ణాలూను.

ఆ తరువాత హేమకూటం మహాశ్వేత చంద్రాపీడులూ వెళ్ళాక చంద్రాపీడుడి కళ్ళతోనే మనం చూస్తాం కాదంబరిని. చూసినదగ్గిర నుంచీ చూడముచ్చటగా ఉందేమో మనంకూడా ఆ పాత్రని అంత తొందరగా విడిచిపెట్టలేం.

ప్రబంధ కవులైతే కొంచం కథ నడిచిన దగ్గరనుంచీ కథా నాయికా కథానాయకుల సందర్శనాదులు—ఇహ అక్కడనుంచి కథ మృగ్యం స్త్రీ పాత్రలను అసభ్యంగా జుగుప్స కలిగేటంతగా వర్ణించి వర్ణించి విసిగించి పారేస్తారు.

మొదటినుంచీ కావ్యం ఈ పద్ధతిలో నడుస్తే విశాల దృక్పథంతో పఠించే పఠితలకు విపరీతమైన విసుగూ రోతా కలిగిస్తాయి.

ఆ జాడ్యం ఈ కావ్యానికి పట్టలేదు అని మనం అనలేం. కావ్యం అన్నాక పట్టించక తప్పదు. అత్యవసర పరిస్థితుల్లో ఈ లక్షణాలు పట్టించాలిరా బాబూ అన్నట్టు పట్టిస్తాడు. కాదంబరి రంగంలోకి వచ్చిం దగ్గిరనుంచి మంచి రక్తి కట్టిస్తాడు ఆయా సన్నివేశాలని.

కథానాయికకు ఉండవలసిన సమస్త ఉదాత్త లక్షణాలూ కలిగి పాఠకలోకాన్ని రంజింప చేస్తుంది. తలిదండ్రులమీద భక్తి సహ చరులపై అనురక్తి మిత్రత్వంలో మిక్కిలి ప్రగాఢత మొదలైన మంచి లక్షణాలన్నీ ఉన్నాయి కాదంబరిలో.

చంద్రాపీడుడుమీద కాదంబరికి అనురాగం ఆయా పాత్రలలో అవధులు అంగుళమాత్రమైనా అతిక్రమించకుండా బహు ప్రశంసా పాత్రంగా సృష్టించాడు. పాత్ర ఔచిత్యంలో బహు జాగ్రత్త కనపరు స్తాడు మన కవి.

కాదంబరి అంటె ఆడు కోకిల అని అర్థము.

'కోకిల లేచివుల్లె తిని కో యని పంచమ సుస్వరంబులో',

కోకిల కంఠం చక్కగా శ్రావ్యంగా ఉంటుంది. కాదంబరి అంటె కోకిల అని అర్థం కదా! ఈ కావ్యం అంతా కోకిల కంఠంలా

రమణీయంగా ఉంటుంది. అంతేకాదు—మన కాదంబరీ మహాశ్వేతల మాటలు ఆ కోకిలమ్మ కంఠంలోంచి వచ్చిన పంచదార గుళికల్లా ఉంటాయి.

అంతేగాక సంస్కృత సాహిత్యమనే మహారణ్యంలో 'గీర్వాణారణ్య సంచారి'—మన కాదంబరి ఒక పక్కని కోకిల పాత్రల మాటల్లో కోకిలమ్మ సుస్వరంగా వినిపిస్తుంది.

స్వేచ్ఛగా చెట్లమీద సంచరిస్తూ ఆయా చిగుళ్ళను హాయిగా తింటూ ప్రకృతి రమణీయాన్ని తనివితీరా చూస్తూ—గొంతెత్తి హాయిగా పాడుకుంటుంది కోకిల.

మన కాదంబరీ మహాశ్వేతలు కూడా, అరణ్యమధ్యంలో జీవయాత్రలు గడిపారు. ఆనందాన్ని కోరే వచ్చారుగాని ఆవేదనతో కొంత కాలం గడిపారు—శిశిర ఋతువులో ఆకులన్నీ రాలిపోతాయి వృక్షాలకి—

వసంత ఋతువులో చిగురిస్తాయి చెట్లు. వీళ్ళ హృదయాలుకూడా కోరికలనే ఆకులన్నీ వైశంపాయన చంద్రాపీడులు చైతన్యంలేక పడి ఉన్నప్పుడు శిశిరఋతు ధర్మాన్ని చెంది ఉన్నాయన్నమాట. పునః చైతన్యవంతు లవడంతో వీళ్ళ హృదయాలలోనే వేయి వసంతాలు ఉద్భవించాయి.

అందుకనే మనకవి దీనికి కాదంబరి అని పేరు పెట్టడం సహజంగాను ఎంతో సముచితంగాను ఉంది. (చెఱకు, కడిమిచెట్టు, బాణము—కదంబము)

"ప్రతి పర్వ రసోదయమ్" అంటే చెఱకుముక్క ప్రతికణుపు ఎంత తియ్యగా ఉంటుందో ఇందలి ఏ భాగం చూసినా భారతంలోలా

రమణీయంగానే ఉంటుంది. శూద్రకుడూ వైశంపాయనుడూ—జాబాలి హారీతుడూ—వైశంపాయనుడి వృత్తాంతమూ—తారాపీడుడూ—విలాసవతీ—శుకనాసుడూ—రాజనీతి—చంద్రాపీడుడూ—కాదంబరీ చంద్రాపీడుడూ—

ఇలాగ్గా ఎక్కడ చూసినా హేరకుడు ఎంతో సంతోషంగా ఆయా ఘట్టాలలో రసాన్ని ఆస్వాదించవచ్చు.

బా ణ ము :—

మనం మొదట్లోనే చెప్పుకున్నాం బాణ వేగంబును అని భట్టు మూర్తి ఇక్కడ బాణ శబ్దాన్ని శ్లేషగా చెప్పాడు. మామూలు బాణమని ఒక అర్థం, బాణుడు అని రెండవ అర్థం.

బాణుని రచన ఎలా ఉంటుందంటె నారిలో సంధించిన బాణం ఎంత వేగంగా శత్రువులను తాకుతుందో అంతటి వేగం ఇతని రచనలో మనకి కనిపిస్తుంది, ఒక మాటకోసం తడుముకోవడంగాని తలక్రిందు లవడంగాని భావాన్ని చంపేసేమాటలు కోసం కొట్లాడడంగాని ఉండదు. భాషాపరంపర బాణాలులాగ పుంఖాను పుంఖాలై అలా అలా నడిచి పోతూనే ఉంటాయి.

కడిమిచెట్టు—ఆకు కనపడనంత దట్టంగా ఆ చెట్టు ఎఱ్ఱని పువ్వులతో చాలా అందంగా ఉంటుంది. సంస్కృత సాహిత్యమనే తోటలో ఇది ఎంతో ఎఱ్ఱగా అందంగా ఉంది అన్నమాట—

మహా పరాక్రమ వంతుడు యుద్ధంలో శత్రువులచే ఖడ్గప్రహారాలతో నిండి ఉన్న శరీరం ఎలా ఉంటుందో అలా ఉంది ఈ చెట్టు అని.

ఇందులో ప్రధాన నాయకుడైన చంద్రాపీడుడూ అతని తండ్రి కూడా మహా పరాక్రమవంతులైన రాజులు—వీళ్ళ శరీరాలుకూడ ఆ కడిమిచెట్టు మాదిరిగా ఎఱ్ఱగా ఉంటాయన్నమాట.

అదే గాకుండా అనురాగాన్ని కూడా ఎరుపుతో పోలుస్తారు—దాన్నే ఒకొక్క కోణంలోంచి ఒక్కొక్కలా పిలుస్తారు—తారాపీడుడికి కొడుకుమీద అనురాగం. వైశంపాయనుడికి—తండ్రిమీద, పుండరీకుడికి—మహాశ్వేతమీద చంద్రాపీడుడికి—కాదంబరిమీద ఇలాగ వివిధ కోణాలలో నుంచి ఆ యా విధములైన రాగము ప్రస్ఫుటితమయే ఘట్టాలున్నాయి.

కావ్యం అంతా అలా రాగానుమయంగా ఉంటుంది. అందుకే దీనికి కాదంబరి అనడం సాహిత్యప్రియులు చాలా సముచితం అని సంతోషించి తీరుతారు.

ఈ విధంగా ఏ కోణంలోంచి ఎంత నిశితంగా మనం పరిశీలించినా దీనికి ఈ పేరు చాలా సార్థకం అని గట్టిగా నొక్కిచెప్పగలం.

## ము గిం పు

### బాణుని ప్రతిభా విశేషము

ప్రపంచంలో మానవులకి సముద్రపు కెరటాలలాంటి కష్టపరంపరలు సంప్రాప్తిస్తూ ఉంటాయి. వాటితో ఊపిరాడక కొట్టుమిట్టాడుతూ ఉంటారు కొంతమంది. వాళ్ళకి విద్యాతృష్ణ అనేనావ దొరికింది. విరించిపత్ని కరుణాకటాక్ష వీక్షణాలనే, అనుకూల వాయువు వీస్తోంది. పటుతరంగా ఉండే బాహ్య దుఃఖాలని పాటింపక పరమసంతోషంగా తీరాన్ని చేరతారు, అనడానికి బాణుడి జీవితం చక్కటి నిదర్శనం.

ఒక కవిపుంగవుడు పాణినే బాణుడుగా జన్మించా డన్నాడు,

గీర్వాణారణ్యం అన్నారు పెద్దలు–అందులో తిరిగి తిరిగి బాణు డికి పీరావేశం వచ్చి వర్ణించి వర్ణించి పారేశాడు. వింధ్యాటవిని సం స్కృత సాహితీ వసవాటికలో సీ వింధ్యాటవి వర్ణన, వియత్తలాన్ని అందుకుంది. అందు పరమేశ్వరుడి ప్రళయ తాండవం దర్శించాడుభట్టు ధన్యుడవయ్యా భవ్యమూర్తీ భట్టూ, అరణ్యానికే అలంకార ప్రాయంగా కోటానుకోట్ల పక్షులకు ఆశ్రయంగా ఉంది. శాల్మలీవృక్షం. సంస్కృత, సాహిత్య వృక్షాలలో ఇది చాలా చాలా పెద్దది. ఆకృతిలో మాత్రం పెద్దకాదు, అన్ని సల్లక్షణాలలోనూ ఇది మిన్నే ఒక్క చెట్టును పట్టు కుని వర్ణించి పాఠక హృదయాలనే తీగలను ఊపి ఊపి వదిలేశావ్. కాదంబరి 88వ పేజీలో నాల్గవ పంక్తిలో తన ప్రజ్ఞను ఇలా చెప్పాడు.

"ఉత్కృష్ట కవి గద్యమివ వివిధవర్గ శ్రేణీ ప్రతిపాద్యమాన అనేక అభినవార్థ సంచయమ్."

అనేకార్థాలతో వివిధ వర్ణనా పరంపరలతో సజీవమైన గద్యకవితా స్రవంతిలో శారదను ఓలలాడించిన చతురమతి మన బాణుడు.

"కటుకు బోయ చేతిలోంచి రాల, నేలమీదపడి తండ్రిపక్షి తరలి పోగ, తల్లడిల్లి తల్లడిల్లి హారీతుడి చేతుల్లో ఆహారం ఆరగించి కావితాల్పు మూలంగా కథ విని జ్ఞానంరాగా శ్వేతను చూడాలంటూ చక చక పోతో ఉంటె మధ్యను మరి బలంలేక మాలపల్లెలో పడ్డా. చండాలిక చేతచిక్కి చేరా సిక్కుడికి నేను" అని శూద్రకుడికి వైశంపాయనుడనే చిలుకచేత తన కథను చెప్పించాడు భట్టు. ఆ చిలుక సమస్త శాస్త్ర పారంగతుడిలా సృష్టించాడు.

బాణా, నీ చేతుల్లో చిలుకని ఇంత నిష్ణాతవంతంగా తీర్చావే ఇక పాత్రల సంగతి చెప్పాలా,


వీణాపాణి వాణి చేతిలో నువ్వు ఎంత చక్కని ముద్దుల చిలుక వయ్యా.


నిన్ను చూసుకో గలిగిన మానవజాతి ధన్యమైంది గదూ!

సంస్కృత కావ్యాలనే దివ్యనగరాలలో నీ కాదంబరి అనే ఉజ్జయినీ నగరం మహోజ్వలంగా ఉందయ్యా. సాహితీ సరస్సులలో నీ అచ్ఛోదన సరస్సు—అందరిచేత—అచ్ఛా అనిపించుకుంది. ఆ తీరంలో అతి ధావళ్యరాశి మహాశ్వేత వెగిలిపోతూ దిగంతాలని తెలుపుచేసేస్తూ ఉంది. నీ కీర్తి చంద్రికలని అన్ని ఖండాలలోకూడా వ్యాపింపచేసేసి తన తెలువంతా తగ్గిపోయిందని తెల్లమొఖంతో అలాఒకదగ్గిర కూచుండిపోయింది. నీ కావ్యకన్య కాదంబరిని చూసి కనకం వన్నెతరిగిపోయింది అది ఇపుడు గీటురాయికి అసలు అందడమేలేదు.



మహాశ్వేత పాత్రను మరి మరువలేని రీతి నీవు పఠితల హృత్పుటాలలో స్ఫుటతరముగ నిలుచునట్లు స్రష్టయొక్క సృష్టిలోని ధావళ్యము నంతటినీ పిండీకృతముగ చేసి, దంతపు బొమ్మగ తీర్చి, అద్దానికి ప్రాణమిచ్చి ఆ శ్వేతను తీర్చావు. సత్‌శీలము సత్యగుణము, సదమల స్నేహంపుహృది, సర్వేశ్వరు ధ్యానిష్ట సంగీతపు చాతుర్యము అద్దములా స్వచ్ఛమైన అతి సుందర హృదయమ్మును, సుజ్ఞానము, విజ్ఞానము సుదతిలో చిత్రించినావు. ఆధ్యాత్మిక సంపత్తితో ఆ శ్వేతను సృష్టించి అణువణువున పవిత్రతను అద్దానిలో నింపావు. ప్రాణప్రియుని ఏ రీతిగ పడతులు భావనచేసి పతివ్రతా భావమెట్లు భామలు ఎటు నడపాలో అవి

యన్నియు ఆ శ్వేతలో రమ్యంగా రమణీయపు రమణివోలె నైపుణ్యపు శిల్పినిగా నిపుణతతో నిర్మించిన బాణభట్టు ప్రణతులివె, పాఠకు లర్పిం పంగ నీ హృదయ నిర్మలత్వమంత ఈ మెలోన నిల్పినావు. నీ చాతు ర్యము ధీశక్తి పఠితల హృదయాలలోన బహుచక్కగ నిలుచునయ్య. బహుచక్కగ నిలుచునయ్య.

బాణా - నీ చేతుల్లో పెరిగిన అరణ్యాల చిగుళ్ళు తిని తిని కోకిలలు గొంతు నొప్పెట్టేదాక నిన్ను అలా తమ కూతల గానంతో తన్మ యత్వాన్ని చెందుతూ ఉన్నాయయ్యా. నిన్ను పక్షులే అంతగా కీర్తిస్తు న్నాయంటే మరి మానవులం మేం ఒక లెక్కా——

బాణా భారతీదేవికి నువ్వెంత ప్రేమపాత్రుడవు. నీ లాంటి బం గారు కొడుకుని కన్న ఆ చదువుల తల్లి సంతోషం ఎంతటిదో!

ఆమె ఆనందపూరిత ఆశీస్సులనే అమృతంపు జల్లులతో ఆచం ద్రార్కం వర్ధిల్లవయ్యా.

నీకివే మా చేతులు జోడించి జే జే లిచ్చుకుంటున్నాము.

మంగళం మహత్

శ్రీ శ్రీ శ్రీ

ఆమె ఫాలభాగంలో చక్కని కస్తూరిచుక్క, ఆ చక్కని చుక్కకు ఎంతో అందాన్నిస్తూంది ఇంత ఏల—చతుర్ముఖుడు ప్రపంచంలో ఉండే సౌందర్యాన్ని అంతటినీ ఒక్కదగ్గిరకు చేర్చి అందుతో మంచి పాళంలో బంగారు ద్రవాన్ని వేసి పోతపోసి ప్రాణం పెట్టి నిర్మించాడా ఈ కాదంబరిగా అని—అనిపిస్తుంది చూపరులకు.—

అసలు మనభట్టు తన కావ్యానికి కాదంబరి అనే పేరు పెట్టుకున్నాడు. ఆవిణ్ణి ఎంత సభ్యంగా ఎంత హృద్యంగా ఎంత లావణ్య రాసిగా, గుణాలకుప్పగా, మురిపాలు నింపె ముద్దుగుమ్మగా, కనకంపు బొమ్మగా, కళ్ళనిండుగా ఉండి, గుండెకు మెండుగా ఆనందాన్నిచ్చే అందాల భరిణలా అతి రమణీయంగా వర్ణించుకున్నాడు. సప్తసంతానాలలో కావ్యసృష్టి ఒకటి అది శాశ్వతమైంది. ఆ చంద్రార్కం అందరి చేత వౌను అనిపించుకునేటంత ఉన్నతంగా ఉండాలి అనుకోవడం కవుల తప్పుకాదు కదా !

మన భట్టు తన కావ్యకన్యక 'కాదంబరిని' తనకొక కూతురుంటె ఎలా ఉండాలో తన భావంలో ఊహించుకున్నాడు—మనకి ఆవిణ్ణిచూపి ఆనందింపచేశాడు.

; జా బా లి ఆ శ్ర మ వ ర్ణ న :

జాబాలి మహర్షి ఆశ్రమం వుంది. దానిచుట్టూ ఎన్నో రకరకాల పూలచెట్లూ, పండ్లచెట్లు ఉన్నాయి. కొంతదాకా తెల్లటి పూవులు మధ్యలో ఎర్రని పూలు మళ్లీ తెల్లపూవులూ—ఇలాగ్గా చూడ్డాడికి చాలా చక్కగా వున్నాయి. వీళ్ళు నిత్యం భగవంతుడికి శాంతి క్షమా తపో పుష్పాలని అర్చిస్తూ ఉంటారు. అవి ఎప్పుడూ వదలనివి అందుకు సంతో

శ్లో॥ అహింసా ప్రథమం పుష్పం పుష్ప మింద్రియ నిగ్రహః
సర్వ భూత దయాపుష్పం క్షమా పుష్పం విశిష్యతే
శాన్తి పుష్పం తపః పుష్పం ధ్యాన పుష్పం తథైవ చ
సత్య మష్టవిధం పుష్పం విష్ణో ప్రీతికరం భవేత్.

అందుకు సంతోషించి ఆ సర్వేశ్వరుడు ఈ వనవాటిలో ఎంత కోసుకున్నా తరగని తట్టలకు తట్టలే పూలు పూయింపచేస్తున్నాడా! అన్నట్లుంది.

చుట్టూ రకరకాల పండ్లచెట్లు కూడా ఉన్నాయి. పండిన పండ్లన్నీ బంగారు రంగులో మధురమైన వాసనలతో ఉన్నాయి. మహర్షులు చేసే ధ్యాన తపో నిష్ఠలకు సంతోషిస్తూ మీకు మోక్షఫలం తథ్యంగా ఇస్తాననే వాళ్ళకు భగవంతుడు హామీ ఇస్తున్నాడా అన్నట్లుంది. అంతే గాకుండ మహర్షి హృదయం ఈ పండ్లకంటె ఎంతో తీయనిదని ఆ పండ్లు తిన్న చిలుకలు కోకిలలు కలకల ధ్వనులతో ఆ విషయాన్ని చాటిచెపుతున్నాయా? అనిపిస్తుంది, ఎందరో మహర్షులున్నారక్కడ, స్నానాలు పూర్తిచేసుకొని దర్భలూ పూలూ పట్టుకు వెస్తున్నారు. వాళ్ళు చేతుల్లో దర్భలు పట్టుకోవడంలో అంతరార్థం ఏమిటంటే మన జీవితాలు ఈ తృణంకంటె కూడా చాలా అల్పమైనవి—విషయ సుఖాలకోసం అమూల్యం అయిన జీవితాల్ని ఎందుకరార్థి వ్యర్థ చేసుకుంటారు—మీ జీవితాలకంటె మే మే ఇంకాకొంత దీర్ఘకాలం జీవించగలమేమో అని చెప్పుతున్నట్లు తోస్తుంది. పూవులలో రేకులు ఎంత సున్నితంగా ఉంటాయో అంతకంటె ఎక్కువగా సున్నితంగా మన మనసనే పూవును మలచుకొని భక్తి అనే జలంతో దాన్ని తడుపుతూ అది దేవుడికి అర్పించాలి. అదే జీవితసార్థకం అని చెప్పడానికే ఒకచేత కమండలం ఒకచేత్తో పూవులూ పట్టుకున్నారన్నమాట!

కుటుంబం అంతా ఒక్కమాటుగా బయటకు వచ్చేస్తోందా ? అన్నట్టేను—
కారు మేఘాలు పరుగులుతీస్తున్నాయా అన్నట్టు కాదు. దున్నల గుంపులు
గుంపులు గుంపులుగా బురదలో దూకడానికి వస్తున్నట్టునూ, లోకాలకి
నాశనాన్ని సూచించే తోకచుక్కల్లాగ వస్తూవున్న శబర సైన్యం అరణ్యం
అంతా ఒకసారి చీకట్లు కమ్ముకున్నాయా అన్నట్లు కనిపిస్తోంది.

అందులో మధ్య వాళ్ళకి నాయకుడున్నాడు — వాడు మంచి
ఒడ్డా పొడవు కలవాడు—ఉంగరాల జుట్టు వాడి భుజాలపై వేలాడు
తోంది. శరీరం నలుపూ, జుట్టూ నలుపు పెద్ద పెద్ద కళ్లు అంతకి పె
పెద్ద ముక్కు—అది గెద్దముక్కులా క్రౌర్యాన్ని సూచిస్తోంది.

జంతువుల్ని వేటాడ్డంచేత వాడి విశాల వక్షంలో రక్తబిందువులు
దట్టంగా చింది వున్నాయి. వాటి మధ్యలో చెమటచుక్కలు కనిపిస్తు
న్నాయి—అవి దూరంనుంచి ఎఱ్ఱపగడాలూ, ముత్యాలు కలేసిన దండ
లెన్నో మెడనిండా మెండుగా ధరించాడా అన్నట్లున్నాయి

నల్లని శరీరం ఎర్రటి పట్టుబట్ట కట్టుకున్నాడు. చీకటి కొండ
మీద ఎర్రటి కడిమిచెట్లు విరియపూస్తె ఎలా ఉంటుందో అలా వుందన్న
మాట. కారుమేఘాలలో ఇంద్రధనస్సు వుంటుంది. వీడి శరీరం ఒక
నల్లటి మేఘంలా వుంది. వాడు పట్టు వంటికి నెమలికన్నులు ఎన్నో
అలంకారార్థం కట్టాడు .ఇప్పుడు వాడు మేఘాలలో ఇంద్రధనస్సులాగ
కనపడుతున్నాడు.

బకాసురుడు ఏకచక్రపురంలో వుండేవాడు—వాడిలాగ, వీడు
చేతిలో ఒక ఏకచక్రాన్ని ధరించాడు. పాముల కోరలలెన్నో పటు
ధైర్యంతో పీకిపారేశాడు. గరుత్మంతుడిలా.

భీష్ముడికి శిఖండి శత్రువు. ఇతడు నెమళ్ళ గుంపులకి శత్రువు. పరాశరుడికి యోజనగంధి అంటె ఇష్టం. ఇతడికి కస్తూరి మృగాలంటె ఇష్టం. ఇతడు ఘటోత్కచుడులా చాలా భయంకరా కారంగా వుంటాడు. వరాహ నరసింహుడి కోరలతో హిరణ్యాక్షుని వక్షస్థలంలో గాయాలు ఉన్నట్లు అడవిపందుల కోరపళ్ళు వీడి గుండెల్లో గుచ్చుకుని గంట్లు గంట్లులా కనిపిస్తున్నాయి. వీడి ఆకారం చూస్తె ఈ వింధ్యారణ్యానికి ముద్దుబిడ్డడా అన్నట్లు యమధర్మరాజుకి పెద్దకొడుకా అన్నట్లు పాపాలరాశి అనే పెద్దక్కకు తమ్ముడా అన్నట్టును, కలికాలపు అధర్మాలన్నీ ఒకదగ్గిర చేర్చి మసితో బొమ్మగా చేసి దానికి ప్రాణంపోశాడా ఆ బ్రహ్మ అన్నట్లు తోస్తుంది.

అరణ్యాన్ని అందులో ఎప్పుడూ సంచరించే అడవిజనాన్ని అక్కడ వుండే పశు పక్ష్యాదులనీ అతి జాగ్రత్తగా పరిశీలించేవాడు బాణుడు. నానా పురాణ విజ్ఞానం అంతా బాణుడి నాలుకచివర వుండేది. అందు కనే సందర్భం వచ్చినప్పుడల్లా రామాయణ మహాభారతాదుల్లో ఉదాహరణలు ఇతడి కావ్యంలో అలా అలా అప్రియత్నంగానే వచ్చిపడిపోతూ వుంటాయి.

నల్లటి చింత మొద్దులా వుండి ప్రాణికోట్ల పాలిటి అపర యముడులా ఉన్న శబరుణ్ని ఎంతో హృద్యంగా వర్ణించేసి మన మనోపీఠంలో అలా నిలబెట్టేశాడంటే సామాన్యుడా మన బాణుడు——

## : ఇంద్రాయుధ వర్ణన :

ఉత్తమ జాతికి చెందిన ఉచ్చైశ్శ్రవం లాంటిది. ఈ ఇంద్రాయుధం. ఆజానుబాహువైన ఆరడుగుల ఎత్తుమనిషి బాగా చెయ్యి పైకి ఎత్తితేనేగాని దాని వీపు అందదు. అది అతి తెల్లగా ఉంది. తెల్లటి